ఆధ్యాత్మిక గ్రంథ నిలయం
మోహన్ పబ్లికేషన్స్
కోటగుమ్మం, అజంతా హోటల్ ఎదుట,
రాజమహేంద్రవరం - 533101.

# భాగవతకథ

## 32వ భాగము

గ్రంధకర్త - శ్రీ ప్రభుదత్త బ్రహ్మచారి

అనువాదం - శ్రీ కుందుర్తి వేంకట నరసయ్య



# భాగవత కథ

(శ్రీమద్భాగవత దర్శనము)

**32వ భాగము**


హిందీ మూలము:

శ్రీ౧౦౮ ప్రభుదత్త బ్రహ్మచారి మహారాజు

ఆంధ్రానువాదకులు, శ్రీరామ శరణ్

శ్రీ కుందుర్తి వేంకట నరసయ్య



శ్రీ వేంకటేశ్వర ఆర్షభారతీ ట్రస్టు

గురుకృప, 1-10-140/1,

అశోక్‌నగర్, హైదరాబాదు - 500 020.

# తొలి పలుకు

బ్రహ్మసృష్టిలో మానవు డుత్తమోత్తముడుగా పరిగణింపబడు చున్నాడు. అందు కితరజీవజంతువులకు లేని జ్ఞాన మతని కుండుటయే కారణము. భగవంతుడు కరుణాళువై ప్రసాదించిన యీ జ్ఞానము సాహాయ్యమున మానవుడు తురీయ పురుషార్థమైన మోక్షమును బొందుటకు యత్నింప వలయును. అతడట్లు చేయనిచో నాహారభయ నిద్రాదులతో గాలము పుచ్చుచుండు నితరజీవులకును అతనికిని ఆకారమున మాత్రమే భేదముండును. మోక్షప్రాప్తికి మన పూర్వులు మూడు మార్గములను నిర్దేశించి యుండిరి. అవి జ్ఞాన, కర్మ, భక్తి మార్గములు. ఈ కలియుగమున వీనిలో మొదటి రెండు మార్గములను అవలంబింప జాలువా రరుదుగా నుందురు. ఇంక మూడవదైన భక్తి మార్గమును స్త్రీలనక, పురుషులనక, బాలురనక, వృద్ధులనక, పండితులనక, పామరులనక అందరు ననుసరించి మోక్షసౌధమును జేరవచ్చును.

వేదార్థోపబృంహణార్థమై భగవంతుడగు కృష్ణద్వైపాయనుడు బ్రహ్మసూత్ర శ్రీమద్భాగవతములతో పాటు పదునెనిమిది మహాపురాణములను, ఉపపురాణములను కూడ రచించి యుండెను. ఇవి కథోపాఖ్యాన పూర్వకముగా వేదనిక్షిప్తములైన ధర్మసేతితత్త్వములను జిజ్ఞాసువు లందరికిని సుబోధమొనరించును. పదునెనిమిది పురాణములలో భాగవత మొకటి. ఇది శ్రీమద్భాగవతమా, దేవీ భాగవతమా అను విషయమున పండితులలో వివాదమున్నది

కాని పలువురది శ్రీ మద్భాగవతమే యని భావించుచున్నారు. ఇది యెంత మనోహరమో, భాషాభావము లందంత క్లిష్టమైనది. అందు చేతనే "విద్యావతాం భాగవతే పరీక్షా" అను నానుడి యేర్పడు టయు, పోతరాజు "భాగవతము తెలిసి పలుకుట చిత్రంబు శూలి కైన దమ్మిచూలికైన" నని చెప్పుటయు సంభవించినది. "భగ వతః ఇదమ్" (భగవంతునికి సంబంధించునది) అని భాగవత శబ్దమునకు వ్యుత్పత్తి. ఇందు భగవన్మాహాత్మ్య బోధకములైన విషయములు కథలు అనేకములుండును.

సర్గము, ప్రతిసర్గము, వంశము, మన్వంతరములు వంశాను చరితము అను పంచలక్షణములు పురాణమునందుండును. శ్రీ మద్భాగవతము పురాణమగుటచే నిందా పంచలక్షణములును కలవు. వీనితో పాటిందు శ్రీమన్నారాయణునికి సంబంధించిన ఏక వింశత్యవతారములును (21) వర్ణింపబడి యున్నవి. "యదాయ దాహి ధర్మస్య గ్లాని ర్భవతి భారత" "పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం, ధర్మ సంస్థాప నార్థాయ సంభవామి యుగే యుగే" అని శ్రీ మద్భగవద్గీతలో భగవంతుడు చెప్పినట్లా తడు ధర్మసంస్థాపనము కొఱకును, సాధురక్షణ, దుష్టశిక్షణముల కొఱకును భూమిపై నవతరించుచుండును. ఆ యవతారముల విష యమే శ్రీమద్భాగవతము నందు ప్రపంచింప బడినది. మత్స్య కూర్మాద్యవతారము లన్నియు నవతార ప్రయోజనములను నిర్వహిం చిన మాట వాస్తవమే యైనను "కృష్ణస్తు భగవాన్ స్వయ" మ్మను సూక్తి ననుసరించి యిందు దశమ స్కంధమున శ్రీ కృష్ణుని

జన్మాది వృత్తాంతములు విపులతరముగా వివరింపబడినవి. భాగవత తారహారమునకు దశమస్కంధము తరళ ప్రాయము.

శ్రీ మద్భాగవతమున కర్మజ్ఞాన విషయములు కూడ ప్రతిపాదింపబడినను భక్తికే అందు ప్రాధాన్యము. మోక్ష ప్రాప్తి కదియే పరమసాధన మని యది బోధించును. అందలి కథోపాఖ్యానము లన్నియు భక్తిమహత్త్వ ప్రతిపాదనము నందే పర్యవసించును. జగద్గురు శ్రీ శంకరాచార్యుల వారు కూడ భక్తిని నిరసింప లేదనుటకు "మోక్షసాధన సామగ్ర్యాం భక్తిరేవ గరీయసీ" అని వివేక చూడామణిలో చెప్పియుండుట నిదర్శనము. సత్యము కూడనంతే. కలియుగము నందలి జనులు కర్మ జ్ఞాన మార్గముల నవలంబింపజాలని వారగుటచే భక్తినే ఆశ్రయింప వలయును. సంసార సాగరతరణమున భక్తియే నిరపాయమైన నౌక. వ్యాసభగవానుడు భాగవతము నిగమ కల్పతరువు నుండి జాఱిన ఫలమని చెప్పియుండెను. అది కల్పతరువువలె భక్తులకు సర్వాభీష్టముల సిద్ధింప జేయును.

వ్యాసుడు సంస్కృతమున రచించిన శ్రీమద్భాగవతమును మహాభక్తుడును, కవిపుంగవుడునైన బమ్మెర పోతరాజు గద్యపద్యాత్మకముగా తెలుగున కనువదించెను. అతడు రచించిన భాగవతము నందలి కొన్ని భాగములే కారణముచేతనో శిథిలమగుటచే వానినతని మిత్రులో శిష్యులోయైన గంగన, సింగన, నారయ యను వారు పూరించిరి. అయినను తెలుగున భాగవతము మాట విన్నం

తనే పోతరాజే తలంపునకు వచ్చును. ఆంధ్ర దేశమున నతని భాగవతమున కున్నంత ప్రచారము మరే గ్రంథమునకును లేద నుటలో నతిశయోక్తి లేదు. అందుకతని పద్యము లందలి ధారా శుద్ధియు నాన్యతో దృశ్యమైన మాధుర్యమును కారణములు. అందలి పద్యము లొండో, రెండో నోటికి రాని అక్షరాస్యుడు మొన్న మొన్నటి వరకు ఆంధ్ర దేశమున నుండెడి వాడు కాదు. కాలవైపరీత్యముచే నిప్పుడందలి పద్యములను కంఠగతము లొన రించుకొను వారి సంఖ్య చదువుకొన్న వారిలోనే చాల తక్కు వైనది. పోతరాజు సంస్కృత భాగవతమును యథాతథముగా నాంధ్రీకరించి యుండలేదు. భక్తిభావ భరితమైన భాగముల నాతడు పెంపొందించి యుండెను. అది గాక పద్యకావ్యముల నర్థము చేసికొన గలవారిప్పుడెందరో యుండరు. అందుచే సంస్కృత భాగవతమునకు రెండు మూడు వచనానువాదములు కూడ వెలసినవి. భాగవతము వంటి ఉత్తమ గ్రంథమెంత అధిక ముగా ప్రచారము పొందిన లోకమున కంత మేలుకలుగును.

తపోనిష్ఠాగరిష్ఠులు, యోగిపుంగవులు, భక్త శిఖామణులునైన శ్రీ శ్రీ శ్రీ ప్రభుదత్త బ్రహ్మచారి గారు జగద్ధితార్థమై శ్రీభాగవతము నందలి విషయములను కథాదృష్టాంతానుభవ పూర్వకముగా సరళ సుందరమైన హిందీభాషలో నరువది సంపుటములుగా వచన రూపమున రచించియుండిరి. అది హిందీ భాషాభిజ్ఞుల అదృష్టము. వానిని భక్తవరేణ్యులు శ్రీ రామశరణ్ కుందుర్తి వేంకటనరస్రయ్య గురుపుంగవులు సర్వ సుబోధమైన భాషలో తెలిగించి యుండిరి.

భక్తి ప్రధానమైన శ్రీమద్భాగవతమును భక్తవరేణ్యుడైన పోతరాజాంధ్రీకరించుట వలన నాంధ్రలోకమునకెంత మహోపకారము జరిగినదో భక్తచూడామణులైన శ్రీ ప్రభుదత్త బ్రహ్మచారి గారి హిందీ గ్రంథమును భక్తిసముద్రులైన శ్రీ కుందుర్తి గురుపుంగవులాంధ్రీకరించుట వలన నంత మహోపకారము జరిగినది. ఆ గ్రంథమునకు శ్రీమద్భాగవతదర్శన మను పేరు సార్థకము. అది రెండుసార్లుముద్రితమైనది. కాని ప్రతులిప్పుడు లభ్యములగుటలేదు. అది చూచి నిత్యధర్మ కార్యపరాయణులును వదాన్య శేఖరులునైన భక్తులొక రా సంపుటములను పునర్ముద్రించుట వలన లోకమునకు మేలు కలుగునని అందుకు సంకల్పించిరి. వారు సిద్ధ సంకల్పులు. వారి సంకల్పబీజము వృక్షమై యిప్పుడీ గ్రంథముల రూపము ఫలించినది. ఆంధ్రు లా ఫలమును ఆస్వాదించే ఆనంద పారవశ్యము పొందుదు రనుటలో సందేహము లేదు.

ఆ భక్తులే శ్రీ వేంకటేశ్వరార్ష ధర్మ భారతీధర్మ సంస్థను స్థాపించి దాని పక్షమున అష్టాదశ మహాపురాణములను తెలుగు లిపిలో తాత్పర్య సహితముగ ముద్రించి ఆంధ్రులకు మహోపకారము చేయుచున్నారు. ఈ భాగవత కథా సంపుటములు కూడ శ్రీ వేంకటేశ్వర ఆర్ష భారతీ ధర్మ సంస్థ పక్షముననే ముద్రింపబడుచున్నవి.

శ్రీ వేంకటేశ నామ్నా
భారత సంస్కృతిప్రవర్ధనార్థాయ
సంస్థాపితేయం ధర్మ
సంస్థార్షా జయతు భగవతః కృపయా.

— దివాకర్ల వేంకటావధాని

నిగమకల్పతరో ర్గళితం ఫలం
శుకముఖాదమృతద్రవ సంయుతం
పిబత భాగవతం రస మాలయం
ముహురహో రసికా భువి భావుకాః

— సంస్కృత భాగవతము

లలితస్కంధము కృష్ణమూలము శుకా
లాపాభిరామమ్ము మం
జులతాశోభితమున్ సువర్ణ సుమన
స్సుజ్ఞేయమున్ సుందరో
జ్జ్వల వృత్తమ్ము మహాఫలమ్ము విమల
వ్యాసాలవాలమ్మునై
వెలయున్ భాగవతాఖ్య కల్పతరువు
ర్విన్ సద్ద్విజశ్రేయమై

— శ్రీమదాంధ్ర మహాభాగవతము

# విషయ సూచిక

←(౦)→

# ఉత్తర రామ చరిత్ర

## శ్రీ శత్రుఘ్నునివలన లవణవధ

శ్లో॥ శత్రుఘ్నశ్చ మధోఃపుత్రం లవణం నామ రాక్షసమ్।
హత్వామధువనే చక్రే మథురాం నామ వై పురీమ్॥

శ్రీభాగ. ౯ స్కం. ౧౧. అ. ౧౪. శ్లో.

పెద్దలకడ మాటలాడకుండుటయే చిన్నవారికి ధర్మము. వారేది యడిగిన దానికి ప్రత్యుత్తర మొసంగవలయును. ఏది యాజ్ఞాపించిన దానిని పాలింప వలయును. చంచలత్వముచే దన తెలివిని జూపింప వలయుననియు, అనవ్యకారణముగను పెద్దల మధ్య మాటలాడి తన ప్రభావము చూపింపదలచినను, దరువాత పశ్చాత్తాప పడవలసివచ్చును. పెద్దలు చిన్నవారియందు వాత్సల్యముంచి శక్తికొలది వారి కోరికలను దీర్చుచుందురు. పిన్నల కోరికలను దీర్చుటయందే పెద్దరిక మిమిడి యున్నది. పెద్దలు చెప్పినదానిని వాద వివాద మొనర్పక చేయుటయే పిన్నల కర్తవ్యము. అప్పుడే ఆర్య మర్యాద పాలింపబడినట్లు కాగలదు.

సూతు డిట్లనెను :- "మునివరులారా ! మీరు నన్ను లవణాసురుని కథ నడిగితిరి. దానిని మీకు జెప్పెదను. ప్రాచీన కాలమున మధువను నొక రాక్షసు డుండెను. అతడు గొప్ప బలవంతుడును, శూర వీరుడును, బ్రాహ్మణ భక్తుడును, ప్రజాపాలకుండును, సచ్చరిత్రుడునై యుండెను అతడు వేలకొలది సంవత్సరములు శివుని గూర్చి ఘోరారాధనము గావించెను. అతని తపస్సునకు బ్రసన్నుడై ఆశుతోషు డగు

శూలపాణి వానికొక యమోఘ శూలము నొసగి యిట్లనెను :- "ఇది అత్యధికముగ బ్రకాశించు పరమ ప్రభావయుక్తమగు నా యమోఘ త్రిశూలము. ఇది నీ దగ్గఱ నున్నంత వఱకు నిన్నెవరును నోడింప జాలరు. దీనిలో గల యింకొక విశేషమేమనగా నిది శత్రువును జంపి మరల నీకడకు రాగలదు. కాని నీవు దేవతలతో విరోధింప నంతవఱకే దీని ప్రభావముండగలదు. నీవు దేవతలతో విరోధింతివా అప్పుడు దీని ప్రభావము నశింపగలదు. అది అప్పుడు నాకడకు రాగలదు."

మధువిట్లనెను ;- "స్వామీ ! ఈ త్రిశూలము నా వంశజులందఱును ప్రాప్తింపవలెను."

శివుడిట్లనెను ; "నాయనా ! తపస్సును జేసినది నీవు. దాని ఫల స్వరూపమున నీకీ దివ్య త్రిశూలము నొసంగుచున్నాను. నీ వంశజులందఱు ప్రాప్తించుట కిది యేమి మిరాసియు, సంపత్తు కాదు. అయినను నీవు యాచించితివి; కావున నీయాచన విఫలము కారాదు. కావున నీ త్రిశూలము నీ పుత్రునకు గూడ ప్రాప్తించునట్లుగా నాశీర్వదించు చున్నాను. ఈ త్రిశూల మాతని చేతిలో నున్నంతవఱకు ప్రపంచములో వాని నెవరును జయింపజాలరు."

ఈ మాట కాతనికి మిక్కిలి సంతోషము కలిగెను. శివుడంతర్ధానమై పోయెను. మధువు శూరసేనాది దేశమును బాలించు చుండెను. అతడు అసురుండే కాని గొప్ప ధర్మాత్ముడు, నాలుగు వర్ణములవారును నాతని యెడల బ్రీతిగా నుండెడువారు. అతడున్న వనమునకు "మధువన" మను పేరు వచ్చినది. అతని రాజధానియును నాతని నామమునసే మధుర యని ప్రసిద్ధి చెందినది. అతనికి రావణుని పెదతల్లి కుంభీనసితో వివాహమయ్యెను. ఆమె గర్భమున నొక గొప్ప పరాక్రమ వంతుడగు బుత్రుడు

పుట్టెను. మధువాతనికి లవణుడను పేరు పెట్టెను. లవణుడు దినదిన ప్రవర్ధమానుడై అల్పకాలముననే యువకుడయ్యెను. అతడు మిక్కిలి క్రూరస్వభావుడు. అతడందరి యెడలను నసురుల వలెనే వ్యవహరించు చుండెను. ఆతనికి హింస యనిన ప్రియము. ఆతనికి మాంసమనిన మిక్కిలి ప్రేమ. ఆతడెందరినో స్వయముగ జంపి తెచ్చినవారి నందఱను దినెడువాడు. ఇంతెందులకు ఋషులను, మునులను కూడ చంపి తిను చుండును. దీనివలన ప్రజలాతని యెడల మిక్కిలి దుఃఖించు చుండిరి. మధువాతని కనేక విధములు జెప్పెను. కాని యాతడే విధముగను విన లేదు. ఈతడు చెప్పిన మాట వినడనియును, తండ్రి కొడుకులకు విరోధము మంచిదికాదనియు దెలిసికొని మధువా రాజ్యమును వదలి శివుని త్రిశూలమును గొడుకున కొసంగి సముద్ర తీరమునకు బోయెను. ఇప్పుడు లవణుడు సర్వదా స్వతంత్రుడయ్యెను. అతడు ఋషులను, మునులను బంధింపసాగెను. వర్ణాశ్రమ ధర్మమునకు విఘ్న మొనర్చు చుండెను. ప్రజల కనేక కష్టములు కలిగించు చుండెను. చాలమంది రాజులు పోరాడవచ్చిరి కాని శివుని త్రిశూల ప్రభావముచే నెవడును జయింప జాలకుండెను. చాలమంది అచ్చటనే చచ్చిరి. చాలమంది రణమునుండి ప్రాణములను జేతబెట్టుకొని పారిపోయిరి. దీనివలన వాని గర్వమింకను వృద్ధినొందెను. అతడు స్వచ్ఛందుడై పాపా చరణమును జేయసాగెను."

యమునాతీరమున నా దినములలో జాలనుంది తపస్వులు తపస్సు చేయుచుండిరి. ఆ దేశము పేరే బ్రహ్మర్షి దేశము ఆ ఋషులలో భృగు పుత్రుడగు చ్యవనుడు ముఖ్యుడు. శ్రీరామచంద్ర డమిత బలపరాక్రమ యుక్తుడనియు, రావణ వధ నొనర్చి యయోధ్యకు వచ్చినాడనియు, యజ్ఞయాగాదు లొనర్చు చున్నాడనియు నా దినములలో ఋషులు వినిరి.

శ్రీరామచంద్రుడే యీ దుష్టుని దుష్టత్వమును బోగొట్టగలడని ఋషులును మునులు తలచిరి. తామచ్చటికి పోయి అతనితో నివేదించెద మనుకొనిరి."

అందఱును నీ విషయమును సమర్థించిరి. ముఖ్యులగు ఋషులు నూఱుగురొక శిష్టమండలముగ నేర్పడి అయోధ్యకు వెడలిరి. భృగు పుత్రుడగు చ్యవనుడా మండలములో నగ్రేసరుడు. కొలది దినములకే వారయోధ్యా రాజభవన ద్వారముకడను జేరిరి. శ్రీ రాముడా సమయమున నిత్యకర్మల నన్నిటిని నెఱవేర్చుకొని రాజసభకు వచ్చుటతోడనే ద్వార పాలుడు వచ్చి యిట్లు నివేదించెను :- "ప్రభూ ! యమునా తీర వాసు లగు మహర్షులు కొందఱు ద్వారమున నిలిచియున్నారు. వారు మహారాజు గారిని దర్శించుటకు మిక్కిలి నువ్విళ్ళూరుచున్నారు. దీనికి శ్రీవారి యాజ్ఞ యేమి ?"

శ్రీరాముడిట్లనెను :- "ఆ తపోధనులగు మహర్షులను సత్కార పూర్వకముగ వెంటనే తీసికొనిరమ్ము." భగవదాజ్ఞచే ద్వారపాలురు ఋషులనందఱను సాదరముగ గొనివచ్చిరి. భగవానుడు లేచి యందఱ నభ్యర్థించెను. పాద్యార్ఘ్య ఫలమూలాదుల నర్పించి గోదానము ద్వారా సత్కారము కావించి వారినందఱను సుందర సువర్ణాసనములందు గూర్చుండబెట్టెను ఋషులు వివిధ తీర్థజలములచే నిండిన ఘటములను ఫలపుష్పములను శ్రీరామచంద్రున కొసంగిరి. పవిత్ర తీర్థఘటములను మునులొసంగిన పుష్పములను శ్రీరాముడు సహర్షముగ స్వీకరించెను. ఇరువైపులను కుశల ప్రశ్నలైన తదుపరి భగవాను డిట్లనెను :- "మును లారా! దీనుడనగు నాకు అత్యంత కృపతో దర్శనమొసంగి కృతార్థుని గావించితిరి. ఇప్పుడు నేను మీరేకారణమున విజయముచేసి నన్ను గృతా ర్థుని గావింపదలచితిరో తెలిసికొనగ గోరుచున్నాను. మీరేదైన కారణమున

దయచేసి యుండినను, నావలన నేదైన సుయోగ్యమగు సేవను జేయించుకొనదలచిన మీరు నిస్సంకోచముగ జెప్పవచ్చును. నన్నాజ్ఞాపింపవచ్చును. నేను మీకేపని చేసిపెట్టవలయును. మీరేపనికొఱకై వచ్చినను సరియైన పనియే యెంచుకొనవచ్చును."

భగవానుని యీ యాశ్వాసమును విని భార్గవ ముని చ్యవనుడిట్లనెను :- "రాఘవా ! ఈ వచనములు నీ కనుకూలముగనే యున్నవి. ఏమైనగానిమ్ము. నీవు రఘుకుల భూషణుడవు. ఇక్ష్వాకు వంశావతంసుడవు. మీ పూర్వజులందఱును శరణాగత ప్రతిపాలకులును బ్రాహ్మణ భక్తులునై యుండిరి. వారికడకు యాచకులు వచ్చి యొక్కడైనను నిరాశుడై తిరిగిపోలేదు. వారు సర్వస్వమును సమర్పించియైనను బ్రాహ్మణులను సేవించిరి. ప్రభూ ! మేము మధుతనయుడగు లవణాసురుని దుశ్చేష్టలచే నధికముగ దుఃఖించుచున్నాము. అతడు మధువనమున నుండి ప్రాణులను హింసించుచున్నాడు. ఋషులను మునులను బట్టుకొని తినుచుండును. వివిధోపద్రవముల నొనర్చుచున్నాడు. నీవు ప్రబల పరాక్రముడును, విశ్వవిజయుడునగు రావణుని జంపి దక్షిణదిశను నిష్కంటకము గావించితివి. ఇప్పుడీ లవణాసురుని జంపి బ్రహ్మర్షి దేశమునకు గూడ సుఖము నొసగుము. మేమందఱమును ఇందులకే కలసి నీ సమీపమునకు వచ్చితిమి."

ఋషుల వాక్యములను విని యానందమును బ్రకటించుచు భగవానుడిట్లనెను :- "మునులారా మీరు నిశ్చింతగ నుండుడు. మీరందఱును లవణాసురుడు సంహరింప బడినాడనియే తలంపుడు"

ఇట్లు పలికి భగవానుడు సభయందు గూర్చుండియే తన సోదరులతో నిట్లనెను :- "సోదరులారా! లవణాసురు డెవనిపంతు? ఆ యధమాసురుని జంపుట కెవరు ఉద్యుక్తులై యున్నారు ?"

ఇది వినగానే భరతుడు తన సింహాసనము నుండి లేచి నిలుచుండి చేతులు జోడించుకొని యిట్లనెను:- "ప్రభూ! నా కాజ్ఞయిండు. నేను లవణాసురుని వధించెదను"

భరతుడిట్లు పలికి కూర్చుండగానే చిన్న తమ్ముడగు శత్రుఘ్నుడు నిలుచుండి చేతులు జోడించుకొని యిట్లనెను :- "ప్రభూ ! లక్ష్మణుడు మీతో వనమున నుండి వివిధ క్లేశము లనుభవించెను. దుష్టులగు ననేకాసురు లను జంపెను. భరతు డిచ్చట నయోధ్యలో నుండి ఘోరతపస్సు జేయు చుండెను. అయోధ్యా రాజ్యమును రక్షించు చుండెను. అతడనేక క్లేశముల ననుభవించెను. నేనింత వఱకేమియును జేయలేదు. కావున లవణుని జంపుట కాజ్ఞ నాకొసంగుడు."

శ్రీరాముడానందమును బ్రకటించుచు నిట్లనెను :- సుమిత్రానంద వర్ధనా! శత్రుఘ్నా! నీవు సర్వవిధముల నా దుష్టుని జంపదగినవాడవు. నీవాతని నవశ్యము జంపగలవు. నేను నేడే నిన్ను శూరసేన దేశ రాజ్య మున కభిషిక్తు గావించెదను. నీవా దుష్టుడగు లవణుని సంహరించి, అచ్చటనే రాజధాని నేర్పఱచుకొని, ధర్మముగ బ్రజాపాలన మొనర్పుము"

ఇది వినగానే శత్రుఘ్నుడు నిర్ఘాంతపడెను. ఆతని కన్నులలోనికి బాష్పములు వచ్చెను. ఆతడేడ్చుచు నిట్లనెను:— "ప్రభూ! నాకీ దండన మేయపరాధమున కొసంగితిరి. నేను మీ చరణములను వీడి బయట యెట్లుండగలను. చిన్నవారు పెద్దవారికడ మాటలాడగూడదని ఋషులు సత్యమునే చెప్పినారు. నేను భరతుని తరువాత మాటలాడి చాల పొరపాటు చేసితిని. దాని పరిణామ స్వరూపమున శ్రీరామచరణములకు దూరము కావలసి వచ్చుచున్నది. ధర్మమర్మజ్ఞా! ప్రభూ! మీరధర్మ మొనర్పకుడు.

అన్నలుండగా దమ్ములకు పట్టాభిషేక మొనర్చుట శోభింపదు. నాకు కేవలము లవణ వధకొరకై మాత్రిమే అజ్ఞాపింపుము. వానిని జంపి మరల మీచరణ సన్నిధికి వచ్చెదను."

భగవానుడత్యంత స్నేహపూర్వకముగ శతుఘ్నుని వడిలో గూర్చుండబెట్టుకొని యిట్లనెను:- "మహాబాహూ! ఈవిధముగ నధీరుడవు కారాదు. క్షత్రియునకిట్టి కాతరత శోభింపదు. రాజులు ప్రవాసమునకు జంకరు. దుష్ట నరపతిని జంపి మఱియొకరాజు నచ్చట నియమింపకుండిన రాజునకు పాపము సంభవించును. కావున లవణుని జంపి రాజ్యరక్షణమును నీవే ధర్మముగ జేయవలయును. నేను నేడే నీకు రాజ్యాభిషేక మొనరించెదను."

ఇది విని చింతామనస్కుడై శతుఘ్నుడిట్లనెను:- "ప్రిభూ! ఇప్పుడు నేను మీయెదుట నేమని ప్రిత్యుత్తర మొసంగగలను? ఒక్క సారి నేను పొరపాటున నన్నలముందు మాటలాడుటచే దత్పరిణామమున నేను ప్రిభు పాదపద్మములకు దూరముగ నుండవలసి వచ్చినది. ఇప్పుడింక మాట్లాడిన నేదండనము లభించునో తెలియదు. కాని స్వామీ! నాకు మీచరణ సన్నిధిని తప్ప ఇంకెచ్చటను సుఖము లభింపదు."

శతుర్ఘ్నుని యీమాటలను విని శ్రీరామచంద్రి డత్యంత ప్రిసన్నుడయ్యెను. ఆతడు మంత్రులను బురోహితులను బిలిపించి విధి విధాన పూర్వకముగ శతుర్ఘ్నుని శూరసేన దేశ రాజ్యమున కభిషిక్తుని గావించెను. ఇప్పుడు శతుర్ఘ్నుడు కుమారుడుగాక రాజయ్యెను. ఆతడు రాజసింహాసనమందు ఛత్రిచామరములను ధరించి యత్యంత శోభను బొందెను. శ్రీరామచంద్రిడభిషేక జలమున దడిసిన సోదరుని శిరమును

బ్రేమపూర్వకముగ మూర్కొని, ఆతని కుపదేశ మొసంగుచు నిట్లనెను:— "నాయనా! ధర్మముగ బ్రజలను బాలింపవలయును. నీవలన నెవరికిని గష్టము కలుగరాదు. నీవా లవణునితో సావధానముగ యుద్ధమొనర్చుము. ఆతనికడ శివుడొసంగిన త్రిశూలముకలదు. ఆ త్రిశూలమాతని చేత నున్నంత వఱకు, ఆతని నెవరును జయింపజాలరు. అహంకార కారణమున నాతడు వేటకు బోవునపుడు త్రిశూలమును వెంటగొనిపోడు. ఇంటిలో నుంచుకొని దానిని బూజించును ఆతడు త్రిశూలమును గొనక వనమునకు బోవునపుడు నీవాతని సమీపమునకు బోవలయును. ఆతడు తిరిగి వచ్చునపుడాతనితో యుద్ధ మొనర్పవలయును. ఆతడెన్ని ప్రయత్నము లొనర్చినను ఆతనిని లోనికిబోయి త్రిశూలమును గొననీయరాదు. ఇదిగో, ఈ నా యమోఘ బాణమును నీవుగ్రహింపుము. ఇది సాక్షాత్తుగ విష్ణుభగవానుని బాణము. దీనితో నాతడు మధుకైటభులను జంపినాడు. ఇది యెన్నడును నిష్ఫలము కాని యమోఘ బాణము. దీనిచే నీవు తప్పక లవణుని జంపగలవు. నేనీ బాణమును నత్యంత భయంకరుడగు రావణుని పైనను వదలలేదు. నిశ్చయముగ నిది లవణుని నేలపై బరుండబెట్ట గలదు." ఇట్లు పలికి రామచంద్రుడు శత్రుఘ్నుని శిరస్సును మూర్కొని ప్రేమాశ్రువులచే నాతని శిరస్సును దడుపుచు నా బాణము నాతని కొసంగెను. శత్రుఘ్నుడును శిరస్సును వంచి మిక్కిలి యాదరముతో నాదివ్య శరమును గ్రహించెను.

శ్రీరామచంద్రుని యాజ్ఞచే జాలగజతురంగ సేనలు ఋషులతో గూడ మధువనమునకు బంపబడెను. శత్రుఘ్నుడు స్వయముగ నంద అను గలిసికొని, ఒక నెలయైన తరువాత పదివదునైదుగుర సైనికులను వెంటబెట్టుకొని యేకాకిగా మధువనమునకు బోయెను. మార్గమందాతడు వాల్మీకియాశ్రమమున విడిసెను. అప్పుడే సీతాదేవి లవకుశులను గనెను.

వాల్మీకి యాజ్ఞను గైకొని శత్రుఘ్నుడు వెదలి కొలది దినములలోనే మధువన సమీపమునకు జేరుకొనెను తన సేన నంతను వీడి శత్రుఘ్ను డేకాకిగా ధనుర్బాణములను ధరించి లవణాసురుని యింటికిబోయెను. ఆతడు వేలకొలది పశుపక్షులను, అటవిక జంతువులను జంపి వచ్చునప్పటికి ద్వారమున నాతడు ధనుర్బాణములను ధరించిన శత్రుఘ్నుని గాంచెను. ఆతనినిగాంచి యాతడు మిక్కిలిగ నవ్వుచు నిట్లనెను:—"నేడు నాయాహారము కొంచము తక్కువగనున్నది. కాని దైవమింటికే దానిని బంపినాడు. వీని మృత్యువు వీనిని తనకు దానే తీసికొని వచ్చినది."

శత్రుఘ్నుడు గర్జించి యిట్లనెను:—"ఒరీ ! దుష్టా! అధికముగ వాగుచున్నావే. నేను నీ కాహారమును గాను. కాలుడను. నాపేరు శత్రుఘ్నుడు. నేను శత్రువులను జంపువాడను. నీవు నాశత్రువు. నేడు నిన్ను జంపి రాజ్యమును నిర్భయము కావించెదను. నిన్ను యమసదనమునకు బంపెదను. నీవు చచ్చుటకు సిద్ధముగ నుండుము."

శత్రుఘ్నుని యిట్టి వీరతాపూర్ణ వాక్యములను విని అసురుడు కొంచెముగ వెనుకాడెను. ఆతడిట్లనెను :—"నీవెవడవు? నెచ్చట నుండువు? ఎవడు చెప్పగా నిచ్చటను జచ్చుటకు వచ్చితివి ?"

శత్రుఘ్నుడిట్లనెను:—" నేనయోధ్యాధీశుడగు శ్రీరామచంద్రమహారాజు తమ్ముడను. నన్ను శత్రుఘ్నుడందురు. శ్రీరామచంద్రుడు నిన్ను జంపుటకు నన్నిచ్చటకు బంపినాడు. ఇప్పుడు నేను నిన్ను జంపక యిచ్చటినుండి పోను."

ఇది వినగానే లవణాసురుడు క్రోధోద్రిక్తుడయ్యెను. ఆతడు గర్జించి యిట్లనెను:—" నేను రామనామమును వినియున్నాను. అతడు

మాపినతల్లి కుమారుడగు రావణుని స్త్రీనిమిత్తమై చంపినాడు. విధియు నేను రాముని క్షమించితిని, గాని నిన్ను మాత్రము క్షమింపను. నిన్ను నేడే యిప్పుడే నేను యమసదనమునకు బంపెదను. కొంచెమాగుము. నేను నాత్రిశూలమును లోపలనుండి తీసికొని వచ్చెదను."

ఇది విని నవ్వుచు శత్రుఘ్నుడిట్లనెను:-" నేను నీవంటి మూర్ఖుడను గాను, ఎదురుపడిన శత్రువున కవకాశమిచ్చుటకు. ఇప్పుడు నిన్ను లోప లికిగాని బయటకుగాని పోనీయను. ఇప్పటినే నీవు నాతో యుద్ధమొనర్ప వలయును."

ఇది వినగానే అసురునకు మిక్కిలి క్రోధము కలిగెను. ఆతడు సమీపముననున్న నొక్క వృక్షమును పెరికి శత్రుఘ్నుని శిరముపై బాదెను. శిరస్సు కడకు రాకపూర్వమే శత్రుతాపియగు శత్రుఘ్నుడు దానిని తునుకలుచేసి విసరి పాఱవైచెను. అందువలన లవణాసురున కత్యంత క్రోధము కలిగెను. ఆతడనేక వృక్షములను విసరసాగెను, శత్రుఘ్నుడు మిక్కిలి వీరత్వముతో శత్రువు విసరు వృక్షములను బండలను బాణములతో ముక్కలు ముక్కలుచేసి విసరివైచుచు బాణము లతో గొట్టసాగెను. కాని యాతని శరీరమున నొక్కబాణమైనను దగులుట లేదు. ఆతడు నవ్వుచు బాణములను పుష్పములవలె సహించుచుండెను. సమయమును గనిపెట్టి ఆతడు శత్రుఘ్నునిపై బ్రహారమును గావించెను. దానివలన రామానుజుడగు రిపునందనుడు మూర్ఛితుడై నేలపైబడెను ఆతడు మరణించెనని యసురుడు తలచి లోనికిబోయి త్రిశూలమును దేలేదు. ఆతనివైపు లక్ష్యముతో జూడనైన జూడలేదు. ఆతనికి బలాభి మానము కలదు. ఆతడు పేరాకలి చెందియుండుటచే జచ్చిన జీవులను దీసికొని యాతడు భోజనము కొరకై ప్రయత్నించుచుండెను. అల్పకాల

మునకే శత్రుఘ్నునకు జైతన్యము కలిగెను. అసురుడాహార చింతలో బడియుండెనని యాతడు తెలిసికొని, మరల యుద్ధమునకు గమ్పించెను. తన సమీపమున కాతడు రాగానే రామదత్త బాణమును ధనుస్సున సంధించి, శ్రీరామచంద్రుని స్మరించి, మంత్రము నుచ్చరించి శత్రుఘ్నుడా దివ్యామోఘ బాణమును విడుచు నప్పటికి దైత్యుడు ఖండించిన వృక్షముపతె బాణము తగులగానే పడిపోయెను. దీనినిగాంచి దేవతా గణము సాధు సాధుయనిపలికిరి. ఋషులును మునులును రామానుజుడగు శత్రుఘ్నుని బ్రశంసించిరి. ఆతనికి వివిధాశీర్వాదముల నొసంగిరి. గంధర్వులు గానముచేయ సాగిరి. అప్సరసలు నృత్యము చేయసాగిరి. లవణాసురుడు ఖండింపబడగా నందఱు నానందించిరి.

ఆసమయమునసే అందరును జూచుచుండ నాత్రిశూల మెగిరి శూలపాణి కడకుబోయెను. దేవతలు శత్రుఘ్నుని వరమును గోరుకొనుమనిరి శత్రుఘ్నుడిట్లనెను:— "నాయీపురము పరము పావనమగు మోక్షపురము కావలయును"

దేవతలు 'తథాస్తు' అనిపలికి అతని వాక్యముల నను మోదించిరి. ఆసమయమునసే శత్రుఘ్నుడు దేవతల వరదానముచే దివ్యమగు మధురాపురమున బ్రవేశించెను. ఆతడు మధువు నిర్మించిన భవనములను పునర్నిర్మాణమును గావించి వానియందు వివిధ రంగులతో శ్రీరామునకు సంబంధించిన చిత్రములను నిర్మించెను. వనోప వనములను నిర్మించెను. గొప్పగొప్ప రాజపథములను గట్టించెను. సభా భవనములను, క్రీడాస్థలములను, ఆమోదప్రమోదా వాసములను, దేవమందిరములను, మల్ల యుద్ధ రంగస్థలములను, మనోరంజన స్థానములను నిర్మాణము గావించెను. ఆ పురము పరమ రమణీయముగ నుండెను. శత్రుఘ్నుడు ధర్మపూర్వ

కముగ నాదేశమునందు రాజ్యమొనర్చుచు ప్రజాపాలన మొనర్చుచుండెను. శత్రుఘ్నుడు రాజుకాగానే ఋషులకును, మునులకును మిక్కిలి హర్షము కలిగెను. ప్రతిదినమును బరమాన్నమును దాగుచుండిరి. నిత్యసంతర్పణములు బ్రాహ్మణ భోజనమును జరుగుచుండెను. నిత్యోత్సవములును జరుగుచుండెను.

ఈవిధముగ బన్నెండు సంవత్సరములచ్చట రామ రాజ్యమును స్థాపించి శత్రుఘ్నుడు తన సేవకులను గొందరను వెంటబెట్టుకొని అయోధ్యకు శ్రీరామచంద్రుని దర్శనము కొరకు పోయెను మార్గమున నాతడు వాల్మీకి మున్యాశ్రమమున విడిసెను. అచ్చట నాతడు రాత్రియందు ప్రసాదమును గ్రహించి విశ్రాంతిని దీసికొనగానే స్వర తాళ లయాదులతో రామచరిత్రము వినవచ్చెను. దూరమున నుండియే సుందర సంగీతమును రామచరిత్రమును విని యాతడు పరమ విస్మయమును జెందెను. ఆ పనికి భూతమున జరిగిన సంఘటనములు భవిష్యత్తులవలె వినగానే ఆతనికి శరీరము పులకరించెను. ఆతడీ విషయమున వాల్మీకి భగవాను నడుగ వలయునని తలచు చుండెనుగాని సంకోచ వశమున నడుగ సాహసింపలేక పోయెను. అప్పటికి కుశలవులు పన్నెండు సంవత్సరముల యీడు కలవారైరి. కాని ముని వారిని శత్రుఘ్నునకు గనబడనీయలేదు; సీతా సంబంధమగు చర్చయును జేయనీయ లేదు.

ప్రాతఃకాలముకాగానే ముని యాజ్ఞనుగైకొని అయోధ్యకు బోయెను. నగరమునకు జేరి శత్రుఘ్నుడు ప్రభు పాద పద్మములకు ప్రణామము కావించెను. భరతలక్ష్మణులకు చరణవందనము కావించెను. శ్రీరామ చంద్రుడాతని శిరస్సును మూర్కొని కుశలము నడిగెను. శత్రుఘ్నుడు సమస్త వృత్తాంతమునుజెప్పి చివరకిట్లనెను:—"ప్రభూ! నేను మీ యాజ్ఞను

చాల కష్టముతో బాలించితిని. పాపియగు లవణాసురుడు చచ్చినాడు. మథురాపురి సమృద్ధిశాలిని యైనది. ప్రజలందరును సంతోషముతో నున్నారు. ఇప్పుడు మీరు నన్ను మీచరణ కమలములకు దూరమొనర్పకుడు. నేను సదా మీచరణ సన్నిధిలోనే యుండగోరు చున్నాను."

శ్రీరాముడిట్లనెను:- "సోదరా! నీవులేకున్న నాకు బాగుండదు. కాని యేమి చేయుదును. కర్తవ్యపాలన మన్నిటికంటె శ్రేష్ఠ ధర్మము. నీకర్తవ్యము ప్రజాపాలనము. నీవు నన్ను జూచుటకు వచ్చితివి. ఇది చాల సౌభాగ్య విషయము కాని నీవచ్చుటికే పోయి రాజ్యభారమును నిర్వహింపవలసి యుండును మధ్యమధ్య నాకడకు రావచ్చును. ఇప్పుడు నీవు కేవల మేడు దినములుండి పొమ్ము."

భగవానుని యాజ్ఞచే శత్రుఘ్ననకు దుఃఖము కలిగెను; కాని యేమిచేయగలడు? పెద్దల యాజ్ఞను శిరసా వహింపవలయును. ఆతడేడు దినములుండి తన తల్లులను దర్శించి మరల నేడు దినముల మీదట మథురాపురమునకు బోయి, అచ్చట రాజ్యముచేయ సాగెను. కాలాంతరమున నాతనికి సుబాహు, శ్రుతసేనులను నిద్దరు పుత్రులుదయించిరి. ఇదే విధముగ నంగద చిత్రకేతు లనువారు లక్ష్మణున కుదయించిరి. భరతునకును దక్ష, పుష్కలులను వారిద్దరు కుమారులుదయించిరి. వారు గంధర్వులను జయించి పంచనద ప్రదేశమున రాజ్యమును స్థాపించుకొనిరి.

ఇది విని శౌనకుడిట్లనెను:- "సూతా! భరతుడు గంధర్వుల నెట్లు జయించినాడు? గంధర్వులేమి యన్యాయమును గావించిరి? దయతో నాకథను వినిపింపుము."

అంత సూతుడిట్లనెను :-"మునులారా! ఈకథ చాల పెద్దది, దీని యొక్క విస్తార వర్ణనము పురాణములలో వచ్చినది. ఇచ్చట నేను మీ కత్యంత సంక్షేపముగ జెప్పెదను, మీరు దత్త చిత్తులరై యీ పరమ పావనమగు నాఖ్యానమును శ్రవణము చేయుడు."

# భరతుడు గంధర్వుల జయించుట

శ్లో॥ సుబాహుః శ్రుతసేనశ్చ శత్రుఘ్నశ్చ బభూపతుః।
గంధర్వాణ్ కోటిశో జఘ్నే భరతో విజయే దిశామ్।
తదీయ ధనమానీయ సర్వం రాజ్ఞేన్యవేదయత్॥

శ్రీభాగ. ౧౧ స్కం ౯అ ౧౩ శ్లో॥

ఎవనిపై భగవానుని వరదహస్తము కలదో వానికి సర్వత్ర విజయమే. ఆతడెచ్చటకు బోయిన నచ్చట లాభము కలుగును. అతనికి బరాజయ మెన్నటికిని కలుగజాలదు. భగవానుడపరాజితుడు. భగవానున కెన్నటికిని బరాజయము కలుగకున్న నాతని ఆశ్రితులకు పరాజయమెట్లు కలుగును? వారెచ్చటికి బోయినను విజయమే కలుగును.

సూతుడిట్లనెను :— "మునులారా! భరతుడు గంధర్వుల నేల జయించెననియు, గంధర్వు లాతని కేమి యనిష్టమును గావించిననియు నన్నడిగితిరి. ఇప్పుడు నేనీ ప్రశ్నమునకు బ్రత్యుత్తర మొసంగెదను. మీరీ పుణ్య ప్రసంగమును సమాహిత చిత్తులరై శ్రవణము చేయుడు.

ఒకానొక దినమున రవికులనందనుడును, రఘువంశ విభూషణుడు నగు శ్రీరామచంద్రుడు రాజసభయందు సింహాసనమున గూర్చుండెను. మూరు సువర్ణముల డిండిమ శ్వేతచ్ఛత్రము వేయబడి యుండెను. చామరములు విసరబడుచుండెను. భరత, లక్ష్మణ, శత్రుఘ్నులు సేవాసంలగ్నులై యుండిరి. హనుమంతుడు పాదములను వత్తుచుండెను. ఆ సమయమున సేవకులు రామచంద్ర మహారాజునకు జయజయకారము

లొనర్చుచు, చేతులను జోడించుకొని యిట్లనిరి :- "ప్రభూ! కేకయ రాజు యుధాజిత్తుని రాజపురోహితుడు గర్గ్యముని మీకడకు వచ్చియున్నారు. అతడు మీకొరకు సుందరములగు కాబూలు అశ్వములను, వస్త్రభూషణాదులను, నానావిధములగు బహుమూల్యోపహారములను దెచ్చినాడు. అతడిప్పటికొక క్రోసుదూరమున నుండును." తన మామకు పురోహితుడగు గర్గ్యుడు వచ్చుచున్నాడను సంగతిని వినగానే శ్రీరాముడు వెంటనే అతని స్వాగత సత్కారములకై సమస్త సామగ్రిని గొని యెదురుపోయెను. ఒక క్రోసు యెదురుగాబోయి అందరును మునివరుడగు గర్గ్యునకు స్వాగత సత్కారము లొనర్చిరి. అతని నత్యంతాదరముతో శ్రీరామచంద్రుడు తన నగరమునకు దీసికొని వచ్చెను. ముని స్వాగతము కొరకు పురియంతయు నలంకరింపబడెను వీధులందు సుగంధిత జలములు చిలుకబడెను. అచ్చటచ్చట ధూపము వేయబడెను.

శ్రీరామచంద్రుని స్వాగత సత్కారముచే వృద్ధుడగు గర్గ్యముని మిక్కిలి సంతోషించెను. అతడు రామచంద్రుని సమస్త పరివారము యొక్క కుశలము నడిగెను. తమ కుశలమును జెప్పి, భరతుని మామ యొసంగిన యుపహారములను శ్రీరామున కర్పించెను శ్రీరామచంద్రుడు మామ యొసంగిన సమస్త వస్తువులను స్వీకరించి, మునిని బూజించిన మీదట నిట్లడిగెను :- "మునివరా! మీకు స్వాగతము. మీరు బ్రాహ్మణులగుటచేతనే జగత్పూజ్యులు. పైగా మా తాతగారికి పూజ్యపురోహితులు. మామగారు మిమ్ములను మాకడకు బంపినారు. కాబట్టి మీరు మా మామగారి వలెను బూజ్యులు. మా మామగారే విశేష కార్యముచే బంపినారు ? లేక మా సమాచారమును దెలిసికొనుటకును జూచి పోవుటకును బంపినారా ఆ సమాచారమును దెలిసికొనుట కువ్విళ్ళూరుచున్నాను. ఇంకేదైన విశేష ఆజ్ఞయున్నచో జెప్పుడు.

ఇది విని వృద్ధుడగు గర్గ్యుడు తన పెద్ద గడ్డమును చేతుల నిమురుచు గంభీరముగ నిట్లనెను :- "రామభద్రా ! కేకయరాజు మీ సోదరులను గాంచి చాల దినములైనది. ఇచ్చటి మీ సమాచార మేమియును దెలియుట లేదు. అందువలన కుశల సమాచారమును దెలిసికొనుటకు ప్రేమవశమున మీ కడకు నన్ను బంపినాడు. ఒక చిన్న సందేశము గలదు."

శ్రీరామచంద్రుడిట్లనెను:- "సందేశమేమో చెప్పుడు. మామగారు మాకందరకేమి సందేశమును బంపినారు?"

వృద్ధుడగు గర్గ్యుడిట్లనెను:—"రాఘవా ! సింధు నదికి నిటు నటు కేకయ దేశము నానుకొని రెండు దేశములు కలవు. అవి మిక్కిలి సమృద్ధియైన దేశములు. వానిలో ఫల మూలములును ద్రాక్ష మొదలగునవియు బ్రచురముగ దొరకును. అచ్చటి స్త్రీ పురుషులు హృష్టపుష్టులుగను, నిరోగులుగను, గౌర వర్ణముగను నుందురు. వారు చూచుట కారోగ్యవంతులుగను, సుందరులుగను గనబడుదురు. ఆ దేశములను బూర్వము క్షత్రియులే రాజ్య మొనర్చెడు వారు. అచ్చటి రాజకుమారికలు మిక్కిలి సుందరముగ నుందురు. శైలూషుడను నొక గంధర్వుడు వచ్చి తన బల పౌరుషములను జూపి యా రాజులను జయించి, ఆ పిల్లలను వివాహమాడెను. గంధర్వులును మానవ కన్యకలను వివాహమాడిరి. దీనివలన నచ్చట నొక నూతన గంధర్వ జాతి యుత్పన్నమాయెను. శైలూషుని ముప్పది మంది పుత్రుల కనేక పరివారము కలదు. వారు పెరిగి పెరిగి యిప్పు డొక కోటిమందిగనైరి. గంధర్వు లుపదేవతలు. వారు మందరాచల ఉపత్యక లందును, స్వర్గమందును నివసించుచుందురు; కాని మానవ స్త్రీ సంసర్గముచే నిప్పుడు వారు మర్త్యలోక నివా

సులైరి. వారు తాము మానవుల కంటె నెక్కువగ దలంచుచున్నారు. తాము దేవతల మని చెప్పుకొనుచు చాతుర్వర్ణ్యులను దిరస్కరించు చున్నారు. వారందరును బలవంతులు, శూరవీరులు, యుద్ధప్రియులు, సాహసులు. మన పొరుగున నున్న రాజులు, మేము వారిని జయింప జాలకున్నాము. మీ సహాయమున్నచో మేమా గర్విష్ఠులగు గంధర్వులను జయింపగలము. కావున మీకు సమ్మతమగుచో లక్ష్మణునో, శత్రుఘ్నునో, లేక భరతునో పంపి వారి నోడింపజేసి యా దేశములను మీ రాజ్యమున గలుపుకొనుడు."

శ్రీరాముడిట్లడిగెను :- ఈ దేశములలో నేయే వస్తువులుండును."

వృద్ధపురోహితుడిట్లనెను:- "ప్రభూ! కాబూలు దేశపు గుఱ్ఱములు చాల సుందరములైనవగుట మీ రెరిగియే యుందురు. గాంధార (కంధహారము) ఫలములతి మధురములుగ నుండును, అచ్చటి దానిమ్మపండ్లకు సర్వత్ర ప్రసిద్ధి దాహమైనచో నచ్చటి దానిమ్మ పండ్ల రసమునే త్రాగెదరు. అందువలన నచ్చటివారు హృష్టపుష్టమగును, నెఱ్ఱగను నుందురు. ఆ దేశములను జయించుటచే మిక్కిలి లాభముకలదు. ముఖ్యవిషయమేమనగా నచ్చటివారీ గంధర్వుల యన్యాయమునుండి బయటబడగలరు."

వృద్ధపురోహితుని వాక్యములను విని భగవానుడిట్లనెను:-" సోదరులారా! లక్షణుడు మేఘనాధుని వధవిషయమున జాల పరిశ్రమ మొనర్చినాడు. శతృఘ్నుడు లవణాసురుని జంపుటలో దన పౌరుషమును జూపినాడు. ఇంతవఱకు భరతునకిట్టి యవసరము సంభవింపలేదు. భరతుడు సుయోగ్యులగు దన సుతులను వెంటబెట్టుకొని గంధర్వులతో బోరబోయి, మామగారి సహాయమున నాదేశములను జయించి మనరాజ్యమున గలుప

వలయునని నాయభిప్రాయము. జయించిన రాజ్యమును రెండుగా విభజించి ఒక దానికి తక్షుని రాజుగ జేయుము; రెండవదానికి పుష్కలుని రాజుగా నొనర్పుము. నాయభిప్రాయమిది. అందఱకును నిదియే సమ్మతియైనచో వెంటనే భరతుడు ప్రయాణ సన్నాహము కావింపవలయును."

భగవానుని మాటలను విని అందరును నొక్క స్వరమున సాధు సాధువనిరి. ఇప్పుడు భరతుడు ప్రయాణము కట్టుచుండెను. గజాశ్వరథ పదాతి దళములు యుద్ధము కొరకు బయలుదేరెను. నల్దిక్కులను గోలాహలము వ్యాపించెను. మార్గమున వివిధ వస్తువులనమ్ము వ్యాపారులు వాహనములందు వస్తువులను నింపుకొని పోసాగిరి. వేలకొలది, లక్షలకొలది గుఱ్ఱములు ఏనుగులు సకిలించుచు, ఘీంకరించుచు బరువిడసాగెను. దీనికి మార్గములు చాలలేదు. అందువలన బొలముల దిరుగుచు, వృక్షములను బెల్లగించుచు మదపుటేనుగులు పోవుచుండెను. భరతుని ఒక పుత్రుడు ముందుపోవుచుండెను. ఇంకొకడు మధ్యనుండెను. చివరను భరతుడుండెను. శ్రీరామ లక్ష్మణ శత్రుఘ్నులు సేనా సహితుడగు భరతుని బంపుటకొక క్రోసు దూరము వరకు పోయెను. శ్రీరాముడు భరతునకును, నాతని పుత్రులకును జాగ్రత్తగా యుద్ధమొనర్పుడని యుపదేశించెను. వివిధ రాజనీతులను బోధించెను. ఈ విధముగ యుద్ధోపయోగములగు సమస్త విషయములనుజెప్పి, వారిశిరస్సులను మూర్కొని, బుజ్జగించి వెళ్ళుటకాజ్ఞ నొసంగెను. భరతుడును పుత్రులతో గూడి శ్రీరాముని పదపద్మములకు బ్రణామము గావించి బయలు దేరెను. శ్రీరామ చంద్రుడు సోదరులతో గూడి చాల సేపటివరకు భరతుడు తిరిగి తిరిగి చూచుచు బోవుచుండెను. ఇక నాతడు కనబడకపోగానే శ్రీరామచంద్రుడు దుఃఖిత చిత్తముతో నయోధ్యాపురికి తిరిగివచ్చి పూర్వమువలె రాజకార్యము లొనర్పసాగెను.

ఇచ్చట భరతుడు దారిలో ననేక స్థానములందు విశ్రమించుచు కేకయ దేశమునకు జేరుకొనెను. పుత్ర సహితముగ భరతుడు వచ్చినాడను సంగతిని విని ఆతనిమామ ఆతని నత్యంత సత్కారపూర్వకముగ నెదురుగాబోయి నగరమునకు దీసికొని వచ్చెను. భరతునిస్వాగతము కొరకు నగర మంతయును నలంకరింపబడెను. కేకయ దేశ స్త్రీలకు తమ సౌందర్యమును గూర్చిన గర్వముగలదు. వారు భరతుని సౌందర్యమునుగూర్చి విని, తమపనుల నన్నిటినివీడి భరతుని దర్శించుటకు తమ తమ భవనములపై మేడల మీదను నిలుచుండి భరతుని జూచుచుండిరి. భరతుని మనోహర రూపమునుగాంచి అందరును రెప్పలార్చుటను మానివైచిరి. వారందరును చిత్రలిఖిత నారీమణులవలె దోచుచుండిరి. కన్యకలాతనిపై బుష్పములను లాజలను జల్లిరి. ఈ విధముగ నందరు స్త్రీ పురుషులును భరతునకు హృదయ పూర్వకముగ స్వాగత మొసంగిరి. భరతుడు తన మామయింటికి బోయెను అత్తలు హారతుల నొసంగిరి. నవ్వుచు నందర క్షేమసమాచారములనడిగి, ఆతని శిరస్సును మూర్కొనిరి. అత్తలాతనికి, ఆతని పుత్రులకును బ్రేమతో భోజనమునిడిరి. మహారాజసేవకులిది వరకే భరతునిసేన నిలుచుటకు సముచితమగు నేర్పాటులను గావించిరి. అందువలన సైనికుల కేమాత్రమును గష్టము కలుగలేదు. అదివారికి పరదేశముగ దోచలేదు. తామయోధ్యయందే నివసించుచున్నట్లు వారందరకును దోచుచుండెను.

భోజనమైన తరువాత భరతుడు సుఖముగ శయనించెను. ప్రాతఃకాలమున నాతడు స్తుతులచేతను, వీణా పణ వాది సుమధుర ధ్వనులచేతను మేల్కొనెను. ఆతడు నిత్యకర్మలు పూర్తి చేసికొని రాజసభకుబోగా నాతని దర్శించుటకు నగర వాసులు వెడలిరి. భరతు డందరను యథోచితముగ సమ్మానించెను. దగ్గరనున్న వేలకొలది పర్వతప్రదేశాధి

పతు లాతనిని గలిసికొనుటకు వచ్చిరి. అందరును 'మీరు గంధర్వులతో యుద్ధమొనర్చుచో మేమందరమును మీకు తోడ్పడగల' మనిరి.

అందరికోరిక ననుసరించి భరతుడొక సభనొనర్చెను. దానికి ముఖ్యులగు సమస్త రాజన్యులను, బుద్ధిమంతులగు మంత్రులను, బ్రాహ్మణులను బిలిపించెను. అందులో దాము గంధర్వులతో నెట్లు వర్తింప వలయునని చర్చించిరి."

దీనిమీద నందరును దమతమ రుచిననుసరించి యభిప్రాయముల నొసంగిరి. ఒకానొక డిట్లనెను:—"వారితో జాటు మాటుగా యుద్ధ మొనర్ప వలయును. వారితో యుద్ధమే చేయరాదని యింకొకరనిరి. భర తుడు వచ్చిన సమాచారము వారికి తెలియక పూర్వమే అజాగ్రత్తగనున్న సమయమున దండెత్తవలయునని ఇంకొకరనిరి."

ఈ మాటల నన్నిటిని విని వృద్ధుడగు గర్గ్యుడిట్లనెను:—"నాయన లారా! మత్త, ప్రమత్త, ఉన్మత్త, అసావధాన, విరథ, రణవిముఖ, నిద్రామత్త, శస్త్రవిహీనాదులతోడను, నితరులతో యుద్ధమొనర్చుచున్న వారి తోడను శూరవీరుడగువాడు సమర మొనర్పడు. ఇది కపటయుద్ధము. ఆర్యులిట్టి యుద్ధమును నిందింతురు. అధర్మముగ యుద్ధ మొనర్చుట మిక్కిలి నిందనీయమగు కార్యము"

వృద్ధుడగు గర్గ్యుని వాక్యములనువిని భరతుడిట్లనెను:—"పూజ్యులగు బురోహితులు సత్యమునే పలుకుచున్నారు. కూటయుద్ధమున రఘు వంశీయులకీర్తి కళంకితమగును. రఘునందనుడగు శ్రీరామచంద్రుడు మాకధర్మ యుద్ధమును నేర్పనేలేదు. రణభూమియందు సుసజ్జితుడగు శత్రుసమ్ముఖమున యుద్ధమొనర్చుటయే రఘువంశీయుల ధర్మము.

అందువలన నేను వారితో సావధానముగ ధర్మానుసారముగ యుద్ధ మొనర్ప వలయును."

ఇది విని వృద్ధుడగు గర్గ్యుడిట్లనెను:— "రఘునందనా! విద్వాంసులు యుద్ధమును ప్రశంసింపలేదు. సామ, దాన, భేద, దండములను నాల్గు ఉపాయములు కలవు. శాంతిచే బనులగుచో యుద్ధము చేయరాదు. ఏదైన గొంచెముగ గ్రహించి యుద్ధమును నివారింప గలిగినయెడల బుద్ధిమంతులగు రాజులు సైనికులకును, మంత్రులకును, రాజునకు సమీపవర్తులగు సేవకులకును నేదైన నొసంగియో, లేక పుచ్చుకొనియో యుద్ధమును నివారింప వచ్చును. దీనివలన బనినెరవేరకుండినచో రాజుయొక్క మంత్రులతోను, సైనికులతోను బరస్పరము భేదమును రగుల్కొల్ప వలయును. లేక వాని ప్రధాన శత్రువును బురికొల్పవలయును; లేక తన గుప్తచరులను బంపి ప్రజలను రాజునకు విరుద్ధముగ నొనర్పవలయును. ఈ యుపాయములన్నిటివలన బనులు కాకున్నచో నప్పుడు యుద్ధము విషయమాలోచింప వలయును. గంధర్వరాజగు శైలూషునికడకు ముందుగా సందేశమును బంపుట మంచిదని నాయభిప్రాయము. ఆతనితో నిట్లు చెప్పవలయును— "ఈసమృద్ధిశాలిని యగు దేశము మీరు నివసించుటకుకాదు. మీరుపదేవతలలో జన్మించినప్పటికి మానవ స్త్రీలకు బుట్టుటచే భారతవర్షమందే నివసించు చున్నారు. కావున మీరు హిమాలయ ప్రాంతములకుబోయి సుఖముగనుండుడు. గంధమాదన పర్వత ప్రాంతములందు మీరు గ్రామములను నిర్మించుకొనుడు, ఈదేశములను వదలిపొండు; ఇచ్చట భరతుడు రాజ్య మొనర్చును" ఈసందేశమును వారు సహర్షముగ స్వీకరించి వారు హిమాలయములోని గంధమాదన పర్వత ప్రాంతమునకు వెడలిపోయినచో యుద్ధమవసర ముండదు. వారు దీనినంగీకరింపకున్నచో యుద్ధమావశ్యకమగును. అప్పుడు మనము దోషభాగులము కాజాలము."

వృద్ధుడగు గర్గ్యుని మాటలను విని, ఆతనిని ప్రశంసించుచు భరతుడిట్లనెను:- "మునివరా! మీరు మిక్కిలి ధర్మయుక్తమును, యుక్తి యుక్తమునగు సమ్మతి నొసంగితిరి. అందువలననే సభలలో వృద్ధులు గౌరవింపబడు చుందురు. వృద్ధులులేనిసభ సభకానేకాదు. సభలోనికివచ్చి లోభ, మోహ, సంకోచములచే సత్యవిషయమును జెప్పనివారు వృద్ధులు లయ్యును వృద్ధులుకారు. మునివరా! మీసమ్మతి అతి ఉత్తమమైనది. ఈకార్యమునకు మీరేయుక్తులు. మీరే యీకార్యమును జక్కపెట్టగలరు. రాజదూత సాధ్యమైనంత వరకు వృద్ధుడుగను, దూరదర్శిగను, అనుభవ జ్ఞుడుగను, కోపపడనివాడుగను, సభ్యుడుగను, గులీనుడుగను, ఓజస్వి గను నుండవలెను. మీలో నీగుణములన్నియును గలవు. కావున మీరు నేడే గంధర్వరాజగు శైలూషుని కడకుబొండు. యుద్ధనివారణమగు నుపాయములన్నిటిని జేయుడు. మీరేవిచేసి వచ్చినను నదియంతయు మాకు సమ్మతమే."

భరతుని యనుమతిని బొంది వృద్ధుడగు గర్గ్యుడు గంధర్వ నగరమునకు బోయెను. కైకయరాజ పురోహితుడును వృద్ధుడునగు గర్గ్యుడు వచ్చినాడను సంగతిని విని గంధర్వ రాజగు శైలూషుడాతనికి విధ్యుక్తముగ స్వాగత మొసంగెను. అర్ఘ్య, పత్ర, పుష్ప, ఫల, మూలాది, పూజాసామగ్రుల ద్వారా పురోహితునకు బూజగావించి, అతని కుశలము నడిగి, రాకకు గారణమడిగెను.

పురోహితుడగు గర్గ్యుడు సంక్షేపముగ సమస్త వృత్తాంతమును నిట్లు చెప్పెను:- "భరతుడు శ్రీరామచంద్రుని తమ్ముడు. ఆతని మామ యగు గేకయదేశపు మహారాజాతని నిచ్చటికి పంపెను. అత డిచ్చట దన రాజ్యమును స్థాపింప గోరుచున్నాడు. ఈ స్థానము మీకు యోగ్యమైనది

కాదు, మీరు వ్యవసాయమును జేయరు. వ్యాపారమును జేయరు. కావున మీరు హిమాలయ పుణ్యప్రాంతమునకు బోయి నివసింపుడు. అదియును బృథివికి స్వర్గము వంటిది. అచ్చట గంధమాదన సమీపమున నానందముగ విహరింపుడు; క్రీడింపుడు, సుఖము లనుభవింపుడు. భరతుని పుత్రులిచ్చట రాజధాని నేర్పరచుకొని పర్ణాశ్రమ ప్రజలను బాలింపగలరు. మీకును నేమాత్రము కష్టమును గలుగదు. ప్రజలును సుఖింపగలరు. యుద్ధము చేయవలసిన పనియు నుండదు "

ఇది విని నవ్వుచు శైలూషుడిట్లనెను :- "బ్రాహ్మణోత్తమా ! మేము మా పౌరుషముచే నీ దేశములను జయించితిమి. మేమీ దేశముల కధిపతులము. ఇచ్చట మాకు గృహములు, పైతృక సంపత్తియును గలవు. ఇచ్చటినుండి మమ్ములను వెడల నడుపుటకు భరతుడెవరు ? హిమాలయోపత్యకలం దాతడే పోయి రాజ్యమును స్థాపించుకొననిండు. మా కాతనితో యుద్ధము చేయుట చేతగాకున్నను, భయపడినమ బారిపోగలము. కాని మేము శూరవీరులము. యుద్ధము చేయుట మాకార్యమే. భరతుని మేము గడ్డిపోచకైనను లెక్కపెట్టము. భరతుని వంటి వారిచ్చటికి నిత్యము మూడువందలతొంబది మంది వచ్చుచుందురు. ఇట్టి సందేశము నెన్నటికిని బంపకుమని మీరాతనికి జెప్పుడు. మేము యుద్ధము చేయుటకు సిద్ధముగ నున్నాము. వారు తమ శక్తినంతను నుపయోగించి మామీద దండెత్త వచ్చుననియు, మేమాతని బీరములణచెదమనియు జెప్పుడు."

శైలూషుని ప్రత్యుత్తరముబొంది, అతని ద్వారా సత్కృతుడై వృద్ధుడగు గర్గ్యుడు భరతుని కడకువచ్చి సమస్త వృత్తాంతమును జెప్పి యిట్లనెను :- "రఘునందనా! యుద్ధమాగదు. గంధర్వులు దుర్మదులైరి. వారు ప్రపంచములోని శూరవీరులను లెక్కపెట్టుటలేదు. నీవు యుద్ధమునకు సిద్ధమై రేపు ప్రొద్దుననే నగరముపైకి దండెత్తుము."

వృద్ధుడగు గర్గ్యుని వాక్యముల నభినందించి భరతుడు సైనికులకు సిద్ధపడుడని యాజ్ఞాపించెను. ఇంకేమున్నది? సైనికుల కండరములదర సాగెను. వారానందముచే నెగిరి దుముకసాగిరి. ఆడుచు బాడుచుండిరి. కొందరు వ్యాయామ మొనర్చుచుండిరి. కొందరు తాళములు వేయసాగిరి. కొందరు గుఱ్ఱపు జీనులను సరిచేయుచుండిరి. చాలమంది వాహనములను సవరించుచుండిరి. సారాంశ మేమనగా నందరును సంతోషముతో యుద్ధ ప్రయత్న మొనర్చుచుండిరి.

ఇచ్చట శైలూషుని పుత్రులును యుద్ధము సంగతిని వినునప్పటికి మిక్కిలి యానందమును జెందిరి. వారు యుద్ధమున కువ్విళ్ళూరుచుండిరి. వారందరును శూరవీరులు, బలవంతులు, పోరగలవారు, యోధులు పరాక్రమవంతులు. సాహసులు, తామపరాజితులమనుకొనువారు. అట్లే వారందరును బలులు, కాని వారిలో సముచి, వామపాల, గవేషణ, సుదర్శగ, వీరబాహు, సుబాహు, వాయువేగ, సువర్చస్, నిష్కంప, కుంభనామ, బలాక, బలక, హరికేశ, మదౌజి. సూర్యరాశి, ప్రభంకర, బృందారక, జ్యోతిషిక, దృఢస్యు, అపరాజిత, కుముచ, కుముదాపీడ, వసునాథ, సులోచన, చంద్రపీడ, గదీ, మౌలీ, కిన్నర, అజగర, రుహ, కేశరీ, వరవాణభాను, ఆగావహ, రార్య, ఏకలవ్య, విశాల, కలవింగ, కల్యాప్రియ, భీమనాద, మహానాద, వసుకీ, పనస, గద, చంద్రవర్మ, మహావర్మ, వసుషేణ, అగ్రగజారక, వీరందరత్యంత బలులు. యుద్ధ నగారా మ్రోగగానే వీరందరేకత్రితులై తమ తమ యస్త్రములను సరి చేసుకొని యుద్ధమునకై యుత్సాహమును జూపించుచుండిరి.

ఇచ్చట ప్రాతఃకాలము కాగానే భరతుడు నిత్య కర్మల నుండి నివృత్తుడయ్యెను. భరతుడు తన పుత్రులను యుద్ధమునకు శీఘ్రముగ

బొమ్మని యుత్తరు వొసంగెను. తక్ష పుష్కలు లిద్దరును రణమునకు సుసజ్జితులై వెడలిరి. అటు గంధర్వులును సిద్ధపడి వచ్చిరి. ఇరుసేనలు తలపడెను. అశ్వికు లాశ్వికులతోడను. రథికులు రథికులతోడను. పదాతులు పదాతులతోడను యుద్ధము చేయసాగిరి. గంధర్వులు రణమున ప్రసిద్ధులు. వారు గొప్ప శూరవీరులు, రణరంగ దుర్మదులు. ఇచ్చట భరతుని సైనికులును దక్కువవారు కారు వారు సుప్రసిద్ధులగు యోధులు. వారిరుపక్షములవారును బరస్పరము జయించుటకై ప్రాణముల నొడ్డి పోరాడుచుండిరి. ఆ యుద్ధము ముందు లంకలోని యుద్ధము చిన్నదిగ దోచుచుండెను. విమానముల నధిరోహించి చూచి దేవతలును జకితులగుచుండిరి. ఇట్టి యుద్ధము దేవాసుర సంగ్రామ సమయమునందును జరుగ లేదనుకొనుచుండిరి. రక్త నదులు ప్రవహించుచుండెను. వానిలో సైనికుల శిరములు తాబేళ్ళవలె దేలుచుండెను. వీరుల బాహువులు సర్పముల వలె దోచుచుండెను. తెగిన యేనుగులు తిమింగిలములవలె దోచుచుండెను. సైనికుల శిరములలోని వెండ్రుకలు శైవాలములవలె గనబడుచుండెను. యోధుల మొండెములు మొసళ్ళవలె దేలుచుండెను. ఆ యుద్ధమేడు దినముల వరకు జరుగుచు. ప్రతిదినమును భయంకరమగుచుండెను. వీరులన్నిటిని మరచి ప్రాణములపై మోహమును వీడి పోరుచుండిరి. ఇరు పక్షములును బరాజయము నొప్పుకొనకుండిరి. యుద్ధము నుండి పారి పోవుట లేదు. భరతుడు సామాన్య రాజు కాడనియు, భగవానుని అంశావతార మనియు, గంధర్వ పురోహితుడగు నాడాయనుడు శైలూషున కెంతో చెప్పెను. సాక్షాత్పరబ్రహ్మ పరమాత్మ నరాకృతిని రామరూపమున భూమిపై నవతరించెనని చెప్పెను గాని శైలూషుడు వినలేదు. ఆతడు స్పష్టముగ నిట్లనెను.— "నేను భరతుని చేతిలో జచ్చి స్వర్గము నకైనను బోయెదను లేదా భరతుని జంపి నిష్కంటక రాజ్యమునైనను

చేయుదును. భయపడి రణవిముఖుడనగుట నేను నేర్వలేదు." ఆ వీరుడట్లే యొనర్చెను. చెప్పినది ప్రత్యక్షముగ జేసి చూవించెను. ఆతని సేవ చాల వరకు సంహరింపబడెను; కాని ఆతడు సాహసమును వీడలేదు. ఏడు దినములు ఘన ఘోర యుద్ధము జరిగెను.

భరతుని సైనికులును జాలమంది చచ్చిరి; అప్పుడాతడు శైలూషునితో నిట్లనెను:— "గంధర్వరాజా! సైనికులను జంపుకొనుటచే నేమి లాభము? మనకిద్దరకును యుద్ధము జరిగిన నీవైన జయింపవలయును, నేనైనను జయింపవలయును."

శైలూషుడిట్లనెను:— "రాజా! నేను యుద్ధమునకు భయపడువాడను గాను. రక్తమును గాంచిన నారక్తముప్పొంగును; నీ యిష్టము వచ్చినట్లు నాతో యుద్ధమొనర్పుము. ఇక మనకిద్దరకును యుద్ధము జరుగుగాక! మన యిద్దరి యుద్ధముల వలననే జయాపరాజయములు నిర్ణయింపబడు గాక! ఇది వినగానే భరతుడొంటరిగ యుద్ధముచేయుట కుద్యుక్తుడయ్యెను.

భరతుడొంటరిగ యుద్ధమున కుద్యుక్తుడగుటను గాంచి సమస్త సేనాపతులాతని కడకువచ్చి చేతులు జోడించుకొని యిట్లనిరి:— ప్రభూ! మీరీనీతి విరుద్ధకార్యమేల నొనర్చుచున్నారు? స్వామి కేవల మాజ్ఞనొసంగ వలయును. సేవకులు యుద్ధమొనర్చెదరు. దానిఫలము ననుభవించు వారు యజమానులు. సేనారూపమగు విశాల వృక్షమునకు రాజు మూలము. సేనాపతులు స్కంధములు, చిన్న చిన్న సేనాపతులు కొమ్మలు, సైనికులు పత్ర పుష్పములు, విజయముఫలము; మూలము భూమియందు దాగియుండును. దాని నెవరును జూడజాలరు. భూమిలో నుండియే అది సమస్త వృక్షమును బోషించుచుండును. స్కంధశాఖలును, పత్రపుష్పములును రాలిపోయిన దావినుండి మరల బయలుదేఱును. మరల దట్టమగును;

గాని వేరు తెగిన వృక్షమంతయును నశించును. మీ రొంటరిగ యుద్ధమునకు బోవలదు. మాకాజ్ఞనిండు. మేము శైలూషుని అతని పుత్ర పౌత్రులను, బరివారమును నిశ్చయముగ నాశన మొనర్చెదము."

భరతుడు వారికి ధైర్యము చెప్పుచు నిట్లనెను :— "వీరులారా క్షత్రియులు యుద్ధమునకు భయపడరు. సమ్ముఖమున శత్రువు యుద్ధమునకు గర్వించుచుండ క్షత్రియ వీర్యమునకు బుట్టినవాడెవడు యుద్ధముఖుడగును? నేను శైలూషునితో నవశ్యము పోరెదను. మీరందరును దటస్థముగనుండి విచిత్రమును దిలకింపుడు. చూడుదేమి జరుగునో. నా హృదమున శ్రీరామచంద్రుడు విరాజమానుడై యున్నాడు, రాముని హృదయమున నిలుపుకొని యే పనిని బ్రారంభించినను సఫలమేయగును. మీరు విజయము విషయమున గాని నా విషయమున గాని చింతింపకుడు. నేడు నేను నిశ్చయముగ శైలూషుని యమపురమునకు బంపగలను.

ఈ విధముగ భరతుడు వారికి నచ్చజెప్పగా సేనాపతులందరును సమ్మతించిరి. ఇప్పుడు భరతునకును శైలూషునకును యుద్ధము జరిగెను. ఇద్దరును వీరులే ఇద్దరును దమ తమ బల, పరాక్రమ, యుద్ధకౌశలములందభిమానులే. వారిద్దరును రెండు మదపుటేనుగులవలెను, రెండు ఆబోతులవలెను బోరుచుండిరి. ఒకడొక బాణమునువైచిన మరియొకడాతనిపై బాణవర్షమునే కురిపించుచుండెను. ఈతడాతనిని బ్రహరించిన నాతడీతనిని బ్రహరించును. ఒకడాగ్నేయాస్త్రమును విడిచిన నింకొకడు వారుణాస్త్రమును విడిచి యాయగ్నినార్పును. ఈ విధముగ దివ్యాస్త్రములచే వారిద్దరును బోరసాగిరి. శైలూషునకు అస్త్రములన్నియును విఫలములుకాగా జివరకాతడు అమోఘ బ్రహ్మాస్త్రమును వదలెను. భరతుడింక బ్రహ్మాస్త్రమును సంధించి దానిని శాంతింపజేసెను. చివరకు భరతుడు తనబాణముచే నాతని శిరస్సు ఖండించెను.

శైలూషుడు చావగనే గంధర్వులందరును భయపడి భరతుని శరణువేడిరి. భరతుడు వారి కభయమొసంగి యిట్లనెను:- "మీరందరును భార్యాబిడ్డలను దీసికొని హిమాలయపర్వత ప్రాంతమున గంధమాదన పర్వత పుణ్యభూమికిబొండు. ఆదినారాయణుడు తపస్సు చేసిన స్థలము."

సూతుడిట్లనెను:— "మునులారా! భరతునియాజ్ఞను శిరసావహించి శైలూష గంధర్వుని వంశజులందరును గంధమాదన పర్వతమునకు బోయి నివసించుచుండిరి. మునులారా! ఇప్పటికిని నాతని వంశజులు బదరీనాధమున కావల మణిపుర (మాణా) మను గ్రామమున నివసించు చున్నారు. చాలమంది తిబ్బెత్తులో నివసించుచున్నారు."

గంధర్వులందరును బోయినమీదట భరతుడు సింధునదికి రెండు వైపులను నతిసుందరములగు నగరములను నిర్మించెను. ఆ నగరము లత్యంత సుందరములు. ఒకటి తక్షశిల. దానికి తక్షు నభిషిక్తునొనర్చెను. రెండవది గాంధారదేశము (కాబూలు కంధారము)నందు పుష్కలవతియను బురిని నిర్మించెను. దానిసింహాసనమున బుష్కలుని గూర్చుండబెట్టెను. ఈవిధముగ రాజ్యమునంతను నైదువర్షములుగ విభాగించి భరతుడు తన సైనికులను గొందరును వెంటబెట్టుకొని అయోధ్యకుబోయెను. విజయుడగు భరతుని యాగమనమునుగాంచి అందరును బరమప్రసన్నులైరి. లక్ష్మణ శత్రుఘ్నులిద్దరును నాతనికి గ్రోశమునకు ముందే యెదురువచ్చిరి. భరతుడు తన యన్నయగు శ్రీరామచంద్రుని పాదపద్మములకు బ్రణమిల్లెను. భగవానుడునులేచి ఆతని గట్టిగ గౌగిలించుకొనెను. శిరస్సును మూర్కొని ఆతని కుశలమడిగెను. తక్ష పుష్కలులు రాజులనుటను విని యాతడానందమును బ్రకటించెను.

సూతుడిట్లనెను:— "మునులారా! భరతుని పుత్రులు రాజులైనట్లు లక్ష్మణుని పుత్రులిద్దరును రాజులైరి.

శౌనకుడిట్లడిగెను:— "సూతా! లక్ష్మణుని యిద్దరు పుత్రులెవరు? వారే దేశమునకు రాజులైరి. దయచేసి యీ కథనుగూడ మాకు వినిపింపుము."

అంత సూతుడిట్లనెను:— "మంచిది, స్వామీ! లక్ష్మణ పుత్రుల వృత్తాంతమును గూడ వినుడు."

# లక్ష్మణ పుత్రులరాజ్యము

శ్లో॥ అంగదశ్చిత్ర కేతుశ్చ లక్ష్మణస్యాత్మజౌ స్మృతౌ
తక్షః పుష్కల ఇత్యాస్తాం భరతస్య మహీపతే।

శ్రీ భాగ. ౯ స్కం. ౧౧ అ. ౧౨ శ్లో॥

పరివారమున శ్రేష్ఠుడగువాడు పరివారములో నందరను సమానముగ జూచును. పెత్తనదారికి విషయ ప్రవర్తన మొనరించినను, న్యాయాధీశుడు భేదభావ మొనరించినను నాతడు శ్రేష్ఠుడు కాడు, సర్వమాన్యుడు కాడు. నోరు ఒక్కటే తినునుకాని అంగప్రత్యంగములన్నియును పోషింపబడుచున్నవి. ఇదేవిధముగ బరివారమునకు ప్రధానుడగు వాడు లోకదృష్టిలో సమస్త సన్మానములను, సమస్త భోగములను ననుభవించునట్లుండునుగాని ఆతడు వాస్తవమున దన కొరకేమియును నుంచుకొనడు. పరివారములోని వారికన్నియును బంచి తాను విడిగానుండును.

సూతుడిట్లనెను:— "మునులారా : శత్రుఘ్నుని పుత్రులిరువురును మధురామండలమునకును, శూరసేన దేశమునకును రాజులైరి. భరతుని పుత్రులిరువురును పంచనద గాంధార దేశములకు రాజులైరి. ఇప్పుడిక లక్ష్మణుని యిద్దరు పుత్రులు మిగిలిరి. వారిని రాజుల జేయవలయునని శ్రీరామునకు మిక్కిలి చింతయుండెను."

ఒకదినమున నాతడు సభలోనిట్లనెను:- "లక్ష్మణా! భరత శత్రుఘ్నులు రాజులైరి. నిన్ను రాజుగా జేయదలచు చున్నాను."

లక్ష్మణుడిట్లనెను:— "ప్రభూ! మీరు నన్ను మీపాద పద్మములకు దూరమొనర్పకుడు, ఇదియే నాభిక్ష. నేను నీ దాసుడను, అనుచరుడను,

కింకరుడను, భృత్యుడను, అనన్యుడను. నాకు మీరేగతి, మీరేమతి, నా సర్వస్వము మీరే. అఖిల బ్రహ్మాండ రాజ్యమును నేను మీదర్శన సమ్ముఖమున దృణముగ దలచెదను. నాకు రాజ్యముతో నేమిపని?"

శ్రీరాముడు మాటలను మార్చుచు నిట్లనెను: "నీ విషయముకాదు, నాయభిప్రాయము అంగద, చిత్రకేతులను నీపుత్రుల విషయము. ఈ యెనిమిది మందియును సోదరులు. నా కందరును సమానులే. కావున వీరందరును రాజులు కావలెను. ఇది నా యాంతరికాభిలాష."

లక్ష్మణుడిట్లనెను:— "దీనికి మీరేమి యాజ్ఞాపించిన దానిని జేయుదును; మీయాజ్ఞను పాలించుటయే మా ధర్మము."

భగవానుడిట్లనెను :— "బాగుగా ఫలించు భూమికలదియు, జలాభావము లేనిదియు, వర్ణాశ్రమ ధర్మము కలిగినట్టిదియు, నిచ్చటకు దూరముగా నుండనిదియునగు సమృద్ధిశాలినియు నగు దేశమును గోరుకొనుము"

ఇదివిని భరతుడిట్లనెను:— "సమీపముననే కారుపథ, మల్ల (గోరఖపూరు దగ్గర)యను రెండు రాజ్యములు కలవు. ఈదేశములు చూచుటకు రమణీయముగనుండును. వీనిలో వనములు నెక్కుడుగ గలవు. ఇవి హిమాలయ ప్రాంతము వరకును వ్యాపించి యున్నవి. ఇప్పుడీ రాజ్యములు రాజు లేకనే పడియున్నవి; ఈదేశమునకు రాజధానుల నేర్పరచి లక్ష్మణుని యొక్క యిద్దరు పుత్రుల నచ్చట నభిషేకింపుడు. నాయభిప్రాయమిది.'

శ్రీరాము డిట్లనెను:— "అచ్చట రాజధానుల నేర్పరచిన నన్యనరపతులతో సంఘర్షణము రాదుకదా? లేక ఆశ్రమ వాసులగు మునుల కేమియును గష్టము గలుగదు కదా?"

భరతుడిట్లనెను:— "రాజులతో సంఘర్షణము జరిగిన నేమియును లేదు. నేడచ్చట రాజెవడును లేడు. రాజు లేకుండిన ప్రజలు వారికిష్టము వచ్చినట్లు చేయుచుందురు. ఆశ్రమ వాసుల కార్యములకు మనము విఘ్నము కావింపము. వారి వనములు రాజ్యమునకు విడిగా నున్నవి. వనములో వారు భజన, పూజ, జప, తప, యజ్ఞాది పుణ్యకార్యములను జేసి కొననిమ్ము. మనము వారికార్యములందు శక్తికొలది సహాయము చేయగలము. స్వార్థపరులగు గొందాఱాదేశములపై నధికారము వహింప వలయు ననుకొనుచున్నారు. వారిని మనము నెట్టివేయ వచ్చును."

భరతుని వాక్యములను విని శ్రీరామచంద్రుడు మిక్కిలి సంతోషించెను. అందరకు నిది రుచించెను. మరునాడు గొప్పసేనను గూర్చుకొని లక్ష్మణుని వెంట నాతని పుత్రులగు నంగద చిత్రకేతులను కారుపథ దేశమునకు శ్రీరామచంద్రుడు పంపెను. ప్రేమవశమున శ్రీరాచంద్రుడు నగరము బయటవరకును పుత్ర సహితుడగు లక్ష్మణుని వీడ్కొలుప వచ్చెను. చివరకందరి శిరస్సులను మూర్కొని, ఆశీర్వాదమొసంగి భగవానుడు వారిని వీడ్కొలిపెను.

లక్ష్మణుడు శ్రీరాముని యాజ్ఞను శిరసావహించి సహజముగనే ఆదేశములను దన యధికారములోనికి దెచ్చుకొనెను. తనను విరోధించిన స్వార్థులకు విఘ్నమును గలిగించెను. వారికుచితమగు దండనము నొసంగి సరిచేసెను. శ్రీరామాజ్ఞచే లక్ష్మణుడు కారుపథ దేశమందొక నగరమును అంగదీయ యనుదానిని నిర్మించెను. అది అత్యంత సుందరముగ నిర్మింపబడినది. దానికి విశాలములగు రాజపథము లుండెను. వివిధ వస్తువుల నమ్ము వ్యాపారులచ్చట క్రయ విక్రయము లొనర్చుచుండిరి. దానిలో జాతుర్వర్ణ్యులు నివసించు చుండిరి. దానికోట దృఢమైనదియు నజేయ

మైనదియునై యుండెను. నగరమునకు నలువైపులను అగడ్తకలదు. సకల సంపత్సంభరితమైన నాపురమున లక్ష్మణుడు తన పుత్రుడగు నంగదున కభిషేకము కావించెను. అంగదుడును శ్రీరామచంద్రుని శాసనము నుండుచు నాతని యాజ్ఞచే నాదేశమును ధర్మముగ బాలించుచుండెను.

రెండవ కుమారుడగు చంద్రకేతువునకు జంద్రకాంతయను నగరమును నిర్మించెను. శ్రీరామచంద్రుని యాజ్ఞచే భరతుడు మల్లదేశమును దనవశమున నుంచుకొనెను. నగర నిర్మాణమును యోగ్యులగు శిల్పులచే జేయించెను. అది యపర యయోధ్యయో యనునట్లు సుందరముగ నిర్మింపబడెను. భరతుడానగర రాజ్యసింహాసనమందు చంద్రకేతునకు విద్యుక్తముగ రాజ్యాభిషేకము కావించెను. చంద్రకేతుడును శ్రీరామచంద్రుని యాజ్ఞకులోబడి యాదేశమును బాలించు చుండెను.

ఈవిధముగ లక్ష్మణ భరతు లిద్దరును నచ్చట నొక సంవత్సరము వరకుండిన నూతన రాజధాని నేర్పాటు చేయుటలో నిమగ్నులై యుండిరి. రాజ్యశాసనము చక్కగా జరుగుచున్న దనియు, రాజ్యములో నింకేమియును విరోధశక్తి లేదనియును, అందరును శ్రీరామచంద్రుని శాసనము నంగీకరించిరనియు భరత లక్ష్మణు లిరువురును దెలిసికొనిన తరువాత వారంగద చంద్రకేతులకు వివిధ రాజనీతులను జెప్పి అయోధ్యాపురియందు శ్రీరామచంద్రుని సమీపమునకు దిరిగివచ్చిరి. ఈదినములను లక్ష్మణ భరతులు శ్రీరామచంద్రుని వియోగమున జాలకష్టముగ గడపిరి. లక్ష్మణుడిట్లు వినతిచేసెను:- "ప్రభూ! నన్నెన్నడు మీ పాద పద్మముల నుండి దూరము చేయకుడు." శ్రీరామచంద్రుడు విజయులై వచ్చిన సోదరుల నిద్దరను శిరస్సును మూర్కొని, మిక్కిలి ప్రేమతో నిట్లనెను:- "సోదరులారా! మీరు నన్నొక్క క్షణమైన విడిచియుండుడని నేనెప్పుడు

కోరినాను? కాని యీకర్తవ్య పతికఠోరమైన దగుటచే నిష్టములేకున్నను జాలకార్యములు చేయవలసి వచ్చును."

ఈ విధముగ శ్రీరామచంద్రుని ప్రేమనుబొంది భరత లక్ష్మణు లానందముగ నయోధ్యయందు నివసించు చుండిరి. శ్రీరామచంద్రుని చరణములందు దృఢానురాగముండుటచే వారికి కాలము గడచిపోవుట తోచుటయేలేదు."

ఇదివిని శౌనకుడిట్లడిగెను:—"సూతా! నీవు భరతుని పుత్రులగు తక్ష పుష్కలులను గూర్చియు, లక్ష్మణుని పుత్రులగు నంగద చిత్రకేతు లను గూర్చియు శత్రుఘ్నుని పుత్రులగు సుబాహు శ్రుతసేనులను గూర్చియు జెప్పితివి; కాని శ్రీరామచంద్రునకు లవ కుశలను నిద్దరు పుత్రులుపుట్టిరే, వారు వాల్మీకాశ్రమ మందుడిరికాదా వారి సంగతియేమి? వారు రాజులైరా? లేదా? శ్రీరామచంద్రుడు వారెని స్వీకరించెనా లేదా? సీతాదేవిని మరల బిలిపించెనా లేదా? ఈ సమస్త వృత్తాంతమును దయ చేసి మాకు జెప్పుము."

ఈ వాక్యములను వినగానే సూతుని కన్నుల నీరు నిండెను.

అతడిట్లనెను:—" మునులారా! కథను జెప్పు కార్యము చాల క్రూరమైనది. జెప్పువానికంటె వ్రాయువాని హృదయము పాషాణముకం టెను గఠోరముగనుండును. అతడీ కరుణా ప్రసంగమును లోహలేఖినితో నిర్భయుడై వ్రాయును. మీరు నన్నత్యంత కారుణిక ప్రశ్న నడిగితిరి. దాని కెంతవరకు ప్రత్యుత్తరమీయగలనో అంతవర కిచ్చెదను. మీరు మీ హృదయములను నరచేతిలో గట్టిగా బట్టుకొని యీ రోమాంచికారియగు వృత్తాంతమును సావధాన పూర్వకముగ శ్రవణము చేయుడు.

# జగజ్జనని జానకీదేవి భూప్రవేశము

శ్లో॥ మునౌ నిక్షిప్య తనయౌ సీతాభర్త్రా వివాసితా।
ధ్యాయంతీ రామచరణౌ వివరం ప్రవివేశహ॥

శ్రీ భాగ. ౯ స్కం. ౧౧ అ. ౧౫. శ్లో॥

ఓభగవానుడా! నీవు ప్రపంచమందు ప్రేమసృష్టి నేలగావించితివి. ప్రేమ లేకుండిన నీకు పని జరుగకుండిన మధ్యలో వియోగవిషము నేల నాటితివి? వియోగ మావశ్యకమై యుండిన సంయోగమేల బెట్టితివి? జీవనేచ్ఛనేల గలిగించితివి? ఇవన్నియు నావశ్యకమగుచో లోకలజ్జను, మర్యాదను, గర్తవ్య పరాయణతను మొదలగువాని నేల బెట్టితివి. ప్రేమ అడుగడుగున వీనిమూలమున నలిగిపోవలసి వచ్చుచున్నది. ప్రేమ రాజ యోగము. అది జీవితాంతము వరకును వదలిపోదు. స్నేహసంబంధము తెగదు. ప్రాణము పోదుగాని గుటగుటమని చావవలసివచ్చును. తన్నుకొనుచు జీవితమును గడుపవలయును. మానావమానములను, లోకోప వాదములను నన్నిటిని ప్రేమాస్పదుని ప్రసన్నత కొరకు సహింపవల యును. అతిసుకుమారమైన హృదయమందు దన ప్రేమాస్పదుడే పాషాణ ములలో నిర్దయతాపూర్వకముగ ప్రహారమొనర్చుచో నయ్యో! వానిని గూడ సహింపవలయును. దైవవిడంబనమెట్టిది? ఈ కంటకాకీర్ణ పథ మెట్టిది? దీని వక్రగతి యెట్టిది? ప్రేమయొక్కనడక ఎట్టిది! ఏడ్చుటలోను సుఖమే, నవ్వునందును నుల్లాసమే, దీనిలో దుఃఖమున్నదో సుఖమున్నదో యెవ్వరును జెప్పజాలరు. సుఖమే యుండినచో నందరును నశ్రువుల నేల గార్చెదరు.? నిరంతరమేల యేడ్చెదరు? దుఃఖమేయగుచో నందరును నేకరుణా ప్రసంగము నింతయుల్లాసముతో మాటిమాటికేల వినెదరు?

కోరినాను? కాని యీకర్తవ్య పతికఠోరమైన దగుటచే నిష్టములేకున్నను జాలకార్యములు చేయవలసి వచ్చును."

ఈ విధముగ శ్రీరామచంద్రుని ప్రేమనుబొంది భరత లక్ష్మణు లానందముగ నయోధ్యయందు నివసించు చుండిరి. శ్రీరామచంద్రుని చరణములందు దృఢానురాగముండుటచే వారికి కాలము గడచిపోవుట తోచుటయేలేదు."

ఇదివిని శౌనకుడిట్లడిగెను:—"సూతా! నీవు భరతుని పుత్రులగు తక్ష పుష్కలులను గూర్చియు, లక్ష్మణుని పుత్రులగు నంగద చిత్రకేతులను గూర్చియు శత్రుఘ్నుని పుత్రులగు సుబాహు శ్రుతసేనులను గూర్చియు జెప్పితివి; కాని శ్రీరామచంద్రునకు లవ కుశులను నిద్దరు పుత్రులుపుట్టిరే, వారు వాల్మీకాశ్రమ మందుడిరికాదా వారి సంగతియేమి? వారు రాజులైరా? లేదా? శ్రీరామచంద్రుడు వారిని స్వీకరించెనా లేదా? సీతాదేవిని మరల బిలిపించెనా లేదా? ఈ సమస్త వృత్తాంతమును దయచేసి మాకు జెప్పుము."

ఈ వాక్యములను వినగానే సూతుని కన్నుల నీరు నిండెను.

అతడిట్లనెను:—"మునులారా! కథను జెప్పు కార్యము చాల క్రూరమైనది. జెప్పువానికంటె వ్రాయువాని హృదయము పాషాణముకంటెను గఠోరముగనుండును. అతడీ కరుణా ప్రసంగమును లోహలేఖినితో నిర్భయుడై వ్రాయును. మీరు నన్నత్యంత కారుణిక ప్రశ్న నడిగితిరి. దాని కెంతవరకు ప్రత్యుత్తరమీయగలనో అంతవర కిచ్చెదను. మీరు మీ హృదయములను నరచేతిలో గట్టిగా బట్టుకొని యీ రోమాంచికారియగు వృత్తాంతమును సావధాన పూర్వకముగ శ్రవణము చేయుడు.

# జగజ్జనని జానకీదేవి భూప్రవేశము

శ్లో॥ మునౌ నిక్షిప్య తనయౌ సీతాభర్త్రా వివాసితా।
ధ్యాయంతీ రామచరణౌ వివరం ప్రవివేశహ॥

శ్రీ భాగ. ౯ స్కం. ౧౧ అ. ౧౫. శ్లో॥

ఓభగవానుడా! నీవు ప్రపంచమందు ప్రేమసృష్టి నేలగావించితివి. ప్రేమ లేకుండిన నీకు పని జరుగకుండిన మధ్యలో వియోగవిషము నేల నాటితివి? వియోగ మావశ్యకమై యుండిన సంయోగమేల బెట్టితివి? జీవనేచ్ఛనేల గలిగించితివి? ఇవన్నియు నావశ్యకమగుచో లోకలజ్జను, మర్యాదను, గర్తవ్య పరాయణతను మొదలగువాని నేల బెట్టితివి. ప్రేమ అడుగడుగున వీనిమూలమున నలిగిపోవలసి వచ్చుచున్నది. ప్రేమ రాజ యోగము. అది జీవితాంతము వరకును వదలిపోదు. స్నేహసంబంధము తెగదు. ప్రాణము పోదుగాని గుటగుటమని చావవలసివచ్చును. తన్ను కొనుచు జీవితమును గడుపవలయును. మానావమానములను, లోకోప వాదములను నన్నిటిని ప్రేమాస్పదుని ప్రసన్నవ కొరకు సహింపవల యును. అతి సుకుమారమైన హృదయమందు దన ప్రేమాస్పదుడే పాషాణ ములలో నిర్దయతాపూర్వకముగ బ్రహారమొనర్చుచో నయ్యో! వానిని గూడ సహింపవలయును. దైవవిడంబనమెట్టిది? ఈ కంటకాకీర్ణ పథ మెట్టిది? దీని వక్రగతి యెట్టిది? ప్రేమయొక్క నడక ఎట్టిది! ఏడ్చుటలోను సుఖమే, నవ్వునందును నుల్లాసమే, దీనిలో దుఃఖమున్నదో సుఖమున్నదో యెవ్వరును జెప్పజాలరు. సుఖమే యుండినచో నందరును నశ్రువుల నేల గార్చెదరు.? నిరంతరమేల యేడ్చెదరు? దుఃఖమేయగుచో నందరును నేకరుణా ప్రసంగము నింతయుల్లాసముతో మాటిమాటికేల వినెదరు?

కవులు దీనిని మాటిమాటికేల పఠించెదరు? కావున శ్రేమజన్మ విరహ మందు దుఃఖముకలుగునో సుఖముకలుగునో యెవ్వరును జెప్పజాలరు.

సూతుడిట్లనెను:—"మునులారా! వాల్మీకాశ్రమమందు కుశలవులు జన్మించిరి. ముని శాస్త్రీయ విధిచే వారికి సమస్త సంస్కారములను గావించెను. వారశ్వినీ కుమారులవలె సుందరులు. ఆశ్రమవాసు లందర కానందమును గలిగించుచు శుక్లపక్ష చంద్రునివలె దినదిన ప్రవర్ధమాను లగు చుండిరి. వాల్మీకి మహాముని వారికి ధనుర్వేదమునంతను జెప్పెను. సమస్త దివ్యాస్త్రముల ప్రయోగోప సంహారముల నాతడు విధ్యుక్తముగ నేర్పెను. వారికి దివ్య ధనుస్సులను, అక్షయ తూణీరమును, కత్తిని, డాలును, గవచమును ముని యొసంగెను. కవచములను ధరించి, కత్తి డాలును బట్టుకొని, ధనుర్బాణములను ధరించి, వీపున తూణీరములను వ్రేలాడవైచుకొని యిద్దరు సోదరులు కలిసి పోవుచుండిన వీర రసము రెండు రూపములను ధరించినట్లుండును. సీతకు వారిని గాంచిన సాక్షా ద్రామ చంద్రుడే వచ్చినాడేమో యను భ్రమ కలుగుచుండెడిది. ఆ యిద్దరు పిల్లలను గాంచినదల్లికి ధనుర్యాగము స్మరణకు వచ్చుచుండెడిది. ధను ర్భంగ సమయమున శ్రీరాముడట్లే యుండెను. వారు నిలుచుండుట, కూర్చుండుట, మాట, పలుకు, వైఖరి అట్లేయుండెను. పిల్లలిద్దరును వచ్చి తల్లిని గౌగిలించుకొని నోరార 'అమ్మా' యని పిలుచుచుందురు. అప్పుడు సీతకు దుఃఖము బికి వారిముఖములను ముద్దిడుకొనును. పిల్లలు 'మా తండ్రి యెవరమ్మా?' యని అడుగుచుందురు.

జానకి కన్నులనీరు నింపుకొనుచు నిట్లనును:—"నాయనలారా! మీకు తల్లిదండ్రు లిద్దరును వాల్మీకి భగవానుడే. నేను మీకు దాసిని. దయాళుడగు ముని నన్ను భోజనము మీద మీకు లాలన పోషణ లొనరిం చుటకు నియమించెను."

పిల్లలిట్లనిరి:-" రాదమ్మా! నీవబద్ధము చెప్పుచున్నావు. నీవే మాకు ప్రియమగు మాతవు. మాకు నిజమగు తల్లివినీవే. కాని అమ్మా! ఒకానొక ఋషికుమారు డిట్లనెను:—" మీతండ్రి చాల నిర్దయుడు. ఆతడు మీతల్లి నింటినుండి వెడలగొట్టినాడు."

ఇది వినగానే తల్లికి ధైర్యము సడలిపోయెడిది; కాని తాను సర్దుకొని పరచుకొని యిట్లనెను:- "కాదు, నాయనలారా! అట్లనరాదు. మీతండ్రి నిర్దయుడుకాడు. ఆతడు మనుష్యుడు కానేకాడు. ఆతడు దేవుడు. ఒకప్పుడు మిమ్ము దయజూచును.

మరల పిల్లలిట్లడిగిరి:— "అమ్మా! తండ్రిమాట నెత్తగనే నీవు దుఃఖితవయ్యెదవు. ఏడ్చుచుందువు. నీకేదో మానసిక బాధయుండి యుండును. అందువలన నిప్పు మేమెన్నడును దండ్రి విషయము నడుగము."

ఈ విధముగ బిల్లలత్యంత గారాబముచే బెరిగిరి. జానకీదేవి ఆసుందరులు, సుకుమారులు, తేజోపరాక్రమవంతులు నగు నిద్దర బాలకుల యొక్క క్షత్రియ వేషములగాంచి యానందించుచుండెడిది; కాని ఆమె మనస్సునందు సదా శ్రీరామచంద్రుని మనోహరమూర్తి నృత్యము చేయుచుండెడిది. ఆమె సదా ఆతని చింతలోనే నిమగ్నయై యుండెడిది."

ఇచ్చట రామచంద్రుడు సీతావిరహమందు దుఃఖితుడై యజ్ఞయాగాదు లొనర్చుచు గాలయాపన మొనర్చుచుండెను. మునుల ఆజ్ఞలచే శ్రీరామచంద్రుడెన్నో యశ్వమేధయాగము లొనర్చెను. శత్రుఘ్నుడు లవణాసురుని జంపి మధురను తన రాజధానిగా జేసికొనగానే భగవానునకు రాజసూయ యాగమును జేయవలయునను సంకల్పము కలిగెను.

అతడు తన కోరికను సభలో సమస్త సభాసదులకును, తమ్ములకును జెప్పెను. దీనిని విని చేతులను జోడించుకొని భరతుడిట్లనెను;— 'ప్రభూ మీరు మాప్రభువులరు. మేము మీకాజ్ఞానువర్తులమగు ననుచరులము. మీరేది యాజ్ఞాపించిన దానిని మేము పాలించెదము; కాని నా క్షుద్ర బుద్ధికి రాజసూయమువంటి హింసాత్మక యజ్ఞమును జేయరాదని తోచుచున్నది. రాజులందరును జంపియో, లేక లొంగదీసికొనియో రాజసూయయాగ మొనర్పవలయును. రాజులందరును మీకు ప్రేమచేతనే వశులైయున్నారు. అట్టియెడ నకారణముగ యుద్ధమొనర్చు టెందులకు? రాజసూయమను పేరును వినగానే మానవుసంతులగు నరపతులకు గోపము వచ్చును. వారిట్లను కొందురు:- "మనముందు ఫలానిరాజు సామ్రాట్టెట్లు కాగలడు? మీరు రాజసూయము నొనర్పకయే అందర హృదయములకును సామ్రాట్టులైయున్నారు. అట్టియెడ రాజులను జెలరేపుట మంచిదికాదు. ఇదిగాక పుణ్యప్రదములగు యజ్ఞములనేకములు కలవు."

ఇదివిని భరతుని బొగడుచు శ్రీరామచంద్రుడిట్లనెను:— "భరతా! నీవు చాలగొప్ప బుద్ధిమంతుడవు, నాకు పరమప్రియుడవై యున్నావు. నీవు చెప్పునది యథార్థము. మంచిది, నీవు చెప్పుటచే నే నీ రాజసూయ యాగాపేక్షను విడుచుచున్నాను. ఏలననగా నుచితమగు విషయమును బాలుడు చెప్పినను వినవలెను. కాని అశ్వమేథయాగమున నేదోషమును లేదు. దీని వలన గొప్పగొప్ప పాపములు మానవుని విడిచిపోవును. బ్రహ్మహత్య సంభవింపగా నింద్రుడును నశ్వమేధ మొనర్చి విముక్తుడయ్యెను. ఇంకను వేలకొలది రాజులును, మహారాజులును నశ్వమేధముద్వారా యశస్వులై పరమ పుణ్యభాగులైరి."

భరతుడిట్లనెను:- "అవును మహారాజా! అశ్వమేధము నొనర్పుడు. రాజులకది గౌరవ విషయము. ఈ యజ్ఞమందు యథేష్టముగ దానధర్మము

లొనర్చుడు. బ్రాహ్మణులను, నతిథి అభ్యాగతులను సత్కరించి అంద రకును సుఖమును గలిగింపుడు."

ఇది విని భగవాను డశ్వమేధ యజ్ఞమొనర్చుటకై యాజ్ఞాపించెను. అచ్చటచ్చట నుండి వేదజ్ఞులగు బ్రాహ్మణులు పిలిపింపబడిరి. సరయూ తటమున నొక విశాలమగు మైదానమందు యజ్ఞశాల నిర్మింపబడెను. అశ్వశాలనుండి ఉత్తమ లక్షణములు కల యొక యశ్వము నెన్నుకొనిరి. దానిని విధ్యుక్తముగ బూజించి శ్రీరామచంద్రుడు వదలెను. దానిని రక్షించుటకై శత్రుఘ్నుని నియోగించెను. భరతుని పుత్రుడగు బుష్కలుని, హనుమంతుని, సుగ్రీవుని వెంటబంపెను. చతురంగ సేనను వెంట బెట్టుకొని శత్రుఘ్నుడు గుఱ్ఱము వెంటబోయెను. గుఱ్ఱము స్వచ్ఛందముగ నెచ్చటికి బోవుచుండునో శత్రుఘ్నుడును సేనను దీసికొని దాని వెంట బోవుచుండును. ఆగుఱ్ఱము అంగ, వంగ, కళింగాంధ్ర, సౌరాష్ట్ర, మగధ, పౌండ్ర, ఉత్కల, గుర్జర, పాండ్య, ద్రవిడ, మహారాష్ట్ర, మత్స్య, శూరసేన, కురు, జాంజలాది అనేక దేశములందు భ్రమించుచు బ్రహ్మవర్త ప్రదేశమునకు వచ్చెను. స్వేచ్ఛగా విహరించుచు నశ్వము గంగా తటమున వాల్మీకి మహర్షి ఆశ్రమ సమీపమునకు రాగానే, దానిని గుశుని తముడు లవుడు చూచెను. లవుడనేక ఋషి కుమారులతో వనములోని కగ్నిహోత్రములకు బనికివచ్చు సమిధులు గొనిపోవుటకు వచ్చెను. అతడా సుందరాశ్వము స్వచ్ఛందముగా దిరుగుటను గాంచి ఋషి కుమారుల కిట్లనెను :- "సోదరులారా! చూడుడిది యెంత సుందరాశ్వమో! దీని ముఖమున నొక సుందరమగు సువర్ణపత్రము వ్రేలాడగట్టబడియున్నది. మనమీ యశ్వమునుబట్టి చదువుదము. ఈ పత్రములో నేమి వ్రాయబడి నది. మీరు భయపడకుడు."

ఇట్లుపలికి ఋషికుమారులు నచ్చటనే వదలి లవుడు ధనుర్బాణము ధరించి, నిర్భయుడై యాహయము సమీపమునకుబోయెను. ఆతడు మేక

పిల్లను బట్టుకొనునట్లు గుఱ్ఱపు చెవులను బట్టుకొని, దాని తలను వంచి, సువర్ణపత్రమందు స్పష్టాక్షరములలో వ్రాయబడిన వాక్యములనిట్లు చదివెను:— "ఇది అయోధ్యాధిపతియగు రామచంద్రుని అశ్వ మేధాశ్వము. నిజమగు క్షత్రియుడున్నచో దీనిని బట్టుడు, లేకున్న నా సమ్ముఖమున దలను వంచుడు." దీనిని జదువగానే లవునకు గోపము వచ్చి, పండ్లు పటపట గొరుకుచు దనలో దానిట్లనుకొనెను:—"తానే యీ ప్రపంచములో సర్వశ్రేష్ఠుడగు క్షత్రియుడననుకొను నీగర్వపోతురాజెవడు? మేము క్షత్రియులము కామా? మేము మాత్రము మాగురు దేవుడగు వాల్మీకి భగవానునికడ నస్త్రశస్త్రముల నభ్యసింపలేదా? ఈ రాజననేమి? స్వర్గాధిపుడగు నింద్రుడు వచ్చినను మమ్ము రణమున జయింపలేడు. నేనీగుఱ్ఱమును బట్టుదను. దీని రక్షకుడగు శత్రుఘ్నుడు నన్నేమి చేయగలడో చూతము. ప్రపంచములో నింకను క్షత్రియులు కలరని అయోధ్యాధిపుడగు రామచంద్రుడు దెలిసికొనుగాక!" అని పలికి లవుడా గుఱ్ఱమును బట్టుకొని, ఒక వృక్షమునకు గట్టిగా బంధించెను."

అశ్వాపహరణమును గాంచి ముని బాలకులు లవునితో నిట్లనిరి:— "ఓయీ! కుమారా! నీ విట్టి దుస్సాహసము నేల జేసెదవు? ఇది అయోధ్యాధిపతి యగు రామచంద్రుని అశ్వమేధాశ్వమని నీకు దెలియదా? ఆతడు గొప్ప బలవంతుడు. ఇంద్రుడును నా గుఱ్ఱమును బట్టుటకు సాహసింపడు. నీవు బాల సహజమగు చంచలతను వీడుము. వెంటనే గుఱ్ఱమును వదలి, దాని వెంట వచ్చు రక్షకులను క్షమాపణ వేడుము. కాకున్న గొప్ప యనర్థము సంభవింపగలదు."

లవుడు ఋషి కుమారుల నదలించుచు నిట్లనెను:— "పొండు. మీరు పిరికిపందలు. ఇది క్షత్రియుల పని యయ్యా! మీరు బ్రాహ్మ

ణులు. బ్రాహ్మణులకు గావలసినది పప్పన్నము. పోయి ఆశ్రమమున బాగుగా భోజనము చేయుడు. నే నీ యశ్వము నవశ్యము పట్టుకొనవలసి నదే. నాతో బోరవచ్చిన వారిని నా దివ్యాస్త్రములచే నోడించి వైచెదను. వాల్మీకి భగవానుడు నాకును ధనుర్వేదమును నేర్పినాడు. నేను యుద్ధావసరము నెట్లు జార విడువగలను? లవుని పలుకులను విని ఋషి కుమారులు మెదలకుండిరి. ఇంతలోనే అశ్వ రక్షకులగు సైనికులు వచ్చిరి. ఋషి బాలకులు మెదలక యొక ప్రక్కన నిలుచుండిరి. ఇప్పుడేమి జరుగునో చూతమని వారి మనస్సులలో గుతూహలముగ నుండెను.

ఆ సమయమున సైనికులు గర్జించి యిట్లనిరి:—"ఎవరి శిరస్సున మృత్యువు నాట్యమొనర్చు చున్నది? మృత్యు వాసన్నము కాకయే యెవడు చావజూచుచున్నాడు. శ్రీరామచంద్రుని యజ్ఞాశ్వమును బంధించిన వాడెవడు?

ఇది విని లవుడు క్రోధముతో నిట్లనెను :—"నేను గుర్రమును బట్టినది. రాముడు కానిండు, శత్రుఘ్నుడు కానిండు. మాకు తృణముతో సమానము. ప్రపంచములో రాముడొక్కడేనా క్షత్రియుడు. శత్రుఘ్నునకు బోరుట తెలియునా? ఆతనికి శక్తి యున్నచో మాతో బోరి అశ్వమును విడిపించుకొననిండు."

చిన్నపిల్లవాని నోట నిట్టి వీరతాపూర్ణములగు వచనములను విని సైనికులందరు నవ్వసాగిరి. వారిలో వారిట్లనుకొనిరి:—"వీనిని జూడుడు. పిట్ట కొంచెము, కూత ఘనము. ఈతడు బాలకుడు. ఋష్యాశ్రమ మందెవరో క్షత్రియులున్నట్లున్నది." ఒక వృద్ధ సైనికు డిట్లనెను:—"బాలకుదేమి? సాక్షాద్వీర రసముగ నున్నాడు. ఈతని యాకృతి ప్రకృతులన్నియును శ్రీరామచంద్రునకు వలెనే తోచుచున్నవి. అట్టి కమల దళ

సదృశములగు సుందర మనోహర నేత్రములే. అట్టి వృషభ స్కంధమే. అట్టి విశాలమగు వక్షస్థలము. ధనుర్బాణములను ధరించి యీతడు సాక్షా దింద్ర పుత్రుడు జయంతునివలె నున్నాడు. సాధారణముగ బాలకులకు జంచలత యుండును. ఆ స్వాభావిక బాల సహజమగు చాంచల్యము వలననే యీత డశ్వమును బట్టుకొని బంధించినాడు. వాని మాటలను లక్ష్య పెట్టకుడు. గుర్రమును వదిలించి బాలకుని సమస్తాపరాధములను క్షమింపుడు."

వృద్ధుని వాక్యములను విని చాలమంది వీరులు వృక్షమునకు గట్ట బడిన యా యశ్వమును విప్పుటకై ప్రయత్నించిరి. ఆ సైనికులు తనను దిరస్కరించి గుర్రమును గొనిపోవు చున్నారను సంగతిని నెలిసికొని లవుడు కన్నులెర్రజేసి, ధనస్సుపై క్షురప్రణామక మను బాణమును బూన్చి క్రోధముతో నిట్లనెను:—"అందరును జాగ్రత్త! సైనికులారా! సాహసము నొనర్పకుడు. నా యశ్వమును దాకిన వారి చేతులను ఖండించెదను."

సైనికులు లవుని మాటలను లక్ష్యపెట్టలేదు. నవ్వి, తిరస్కరించి వారు గుర్రమును విడువసాగిరి. ఇక లవుడు నిలువజాలక పోయెను. ఆతడు క్షుర ప్రణామక మను బాణములచే సైనికుల చేతులను నిమిష ములో ఖండించెను. చేతులు తెగిపోగానే ఆ యోధులందరును నేడ్చుచు శత్రుఘ్నుని సమీపమునకు బోయి యిట్లనిరి :—"ఒక కుర్రవాడు గుర్ర మును బట్టుకొనినాడు. మేము గుర్రమును విడుచుటకు బోగానే ఆతడు మా గతి నిట్లొనర్చినాడు. ప్రభూ! ఆతడు కేవలము వీరరసమో లేక యింద్రుడే యజ్ఞమును విఘ్నమొనర్పదలచి బాలక రూపమును ధరించి వచ్చినాడో యనునట్లున్నది. సౌందర్యమున నాతడు శ్రీరామునితో

సమానుడుగా నున్నాడు. బల పరాక్రమములం దాతని కీడు వచ్చువా డెవడును లేడు మీరేదయినా నేర్పాటును జేయుడు. లేదా మీరే స్వయముగ యుద్ధమునకు బొండు. ఆ బాలకు డుపేక్ష చేయదగినవాడు కాడు."

ఇది విని శత్రుఘ్నుడు చింతలో బడెను. ఒకానొక బాలకున కింతటి సాహస మెచ్చటిది? ఇంద్రుడే యగుగాక! ఇంద్రునకును శ్రీరాముని గుర్రమును బట్టుటకు సాహస మెక్కడిది? ఎవడయిన గానిండు. నేను మా విశ్వ విజయుడు, సేనాపతియు, వీరపరుడు నగు గాలజిత్తును నా బాలకుని బట్టి బంపెదను."

బాలకు డవిరళ భావముతో ధనుస్సుమీద బాణము నెక్కిడి సైనికుల రాకను నిరీక్షించి యుండుటను సేనాపతి యగు గాలజిత్తు గాంచెను. ఆతడు రణోధ్యుక్తు డగుటను గాంచి గాలజిత్తిట్లనెను:— "వత్సా! నీ వెవడవు? చూచుటకు నీవు వీరుడవుగ గనబడుచున్నావు. నీ యాకృతి మా మహారాజునకువలె నున్నది; కాని నీకు బుద్ధి లేదు. ఎంతటి వీరపుత్రుడవైనను బాల్య చాపల్యమెట్లు పోగలదు? శ్రీరామచంద్రుని అశ్వమును బట్టుకొనుటలో నీవు పిల్లతనపు చేష్టలనే చేసితివి. పైగా రెండవ యపరాధము సైనికుల చేతులను ఖండించుట. అస్తు. ఏమియును ఫరవా లేదు. బాలకుడని భావించి నిన్ను నేను క్షమించు చున్నాను. నీవు గుర్రమును వదలిపెట్టి త్వరగా పారిపొమ్ము. మా ప్రభువగు శత్రుఘ్నుడు వచ్చినచో నిన్ను బట్టుకొని అయోధ్యాపురికి గొని పోగలడు. నేనాతని ప్రధాన సేనాపతి యగు గాలజిత్తును."

ఇది విని పరిహాస మొనర్చుచు దృఢతాస్వరమున లవుడిట్లనెను:- "సేనాపతి మహోదయులు నామాటను వినెదరుగాక! వీరుల యవస్థను జెప్పుటకు వీలులేదు. వారిలో వీరత్వమే ప్రధానమైనది. మీ

స్వామియగు శత్రుఘ్నుని నేను తృణమువలెనైనజూడను. నీపేరు కాల జిత్తయినచో నాపేరు లవుడు. నీకు కాలుడనైన నేను సమ్ముఖమున నిలిచి యున్నాను. నీవు నన్ను జయింపగలిగినచో నీ కాలజిన్నామము సార్థక మగును. నీవు నన్ను జయింపజాలకున్న నీ నామము వ్యర్థమే. అపకాల ములో నిన్ను నేను జయింపజాలకున్న నేను లవుడనుగాను. రమ్ము, నాతో దలపడుము."

పిల్లవానియొక్క యీ సాహస పూర్ణములగు వాక్యములను విని కాలజిత్తు నిర్ఘాంతపోయెను. ఆ మాటలను నిర్లక్ష్యమొనర్చుచు నాతడిట్ల నెను:—"నీకులగోత్రములేమి? మీ తండ్రిపేరేమి? నీవెందులకు జావబూ నెదవు? ఇంతటి గొప్ప సేనతో బోరనేల సాహసించెదవు?"

లవుడిట్లనెను:—" నీకు నాకులగోత్రములతో బనియేమున్నది? నాకులగోత్రములనుగూర్చి చెప్పుటకు నాకింకను వివాహముకాలేదు. నేను యుద్ధముచేయవలెను. యుద్ధమందు వీరత్వమే వీరునియొక్క ప్రత్యక్ష పరిచయ మొనర్పగలదు.

కాలజిత్తిట్లనెను:—" నాయనా! మాకును నీకును యుద్ధము పయు క్తమైనది కాదు. నీవు నేలమీదనున్నావు నేను రథముపై నున్నాను."

ఉపేక్షాస్వరమున లవుడిట్లనెను:—" ఫరవాలేదులే, క్షణకాలములో నేను నీరథమును ఛిన్నాభిన్నము కావించెదనులే. అప్పుడిద్దరమును నేల మీదనే యుందుము. నేను నేలపై నుండెదను. నీవు నేలమీద బరుండ గలవు. సరియే, కాచుకొనుము, నాబాణములు వచ్చుచున్నవి" అనిపలికి లవుడొక తీక్ష్ణబాణమును కాలజిత్తునిపైకి వదలెను. బాణము పోయి కాల జిత్తుని కణతకు తగిలెను, అది తగులగానే ఆతడు వ్యాకులుడయ్యెను.

ఆతనికి మిక్కిలి కోపము వచ్చెను. క్రోధోద్రేకమున నాతడును లవుని మీద లక్షలకొలది బాణములను వదలెను. లవుని తూణీర మక్షయమైనది. దానిని వాల్మీకి మహర్షి యిచ్చియుండెను, ఆతని బాణము లెన్నడును లక్ష్యమును దప్పవు. లవుడు బాణవర్షమును గురిపించి సైనికుల నందరను గొట్టెను. ఆతడు క్షణములో గాలజిత్తుని రథమును విరుగ గొట్టెను. ఇప్పుడు కాలజిత్తు భయపడి, వెంటనే ఒక గొప్ప మద మత్త గజ మును దెప్పించెను. ఏనుగుపై నెక్కి ఆతడు యుద్ధము చేయసాగెను. ఇది చాల యెత్తుగ నున్నదని లవుడనుకొని, ఆతడు పరుగెత్తుకొనిపోయి ఖడ్గముతో దాని తొండమును నరకెను. తొండము తెగగానే గజము ఘీంకరించి పారిపోయెను. లవుడు దాని దంతములను గట్టిగా బట్టుకొని, అత్యంత లాఘవముతో మిక్కిలి కౌశలముగా దంతములమీద బాదముల నిడి పైకెక్కెను. అచ్చట మూర్ఛితుడై పడి యుండిన కాలజిత్తుని మకు టమును విరుగగొట్టి, ధడాపని వానిని క్రిందకు పడద్రోచెను. నేలపై బడగానే యతడు సంజ్ఞా శూన్యుడయ్యెను. సైనికులందరును పారిపో సాగిరి. ఇప్పుడు లవుడేనుగు పైనుండి క్రిందకు దిగి యితర సైనికులను సంహరింప సాగెను. ఇంతలోనే మరల గాలజిత్తు నిలువబడి యుద్ధోద్యు క్తుడయ్యెను. కాలజిత్తు యుద్ధోద్యుక్తుడగుటను గాంచి లవుడు వాని సమీప మునకువచ్చి, రెండు బాణములతో వానిని ప్రాణశూన్యుని గావించెను. సేనాపతి చావగానే సేనయంతయును బారిపోజొచ్చెను. వారందరును బరువిడి శత్రుఘ్నుని కడకు వచ్చి కాలజిత్తు మృత్యు సమాచారమును జెప్పిరి.

కాలజిత్తుని మరణములు వినిన శత్రుసూదనుడగు శత్రుఘ్ననకు బరమ విస్మయము కలిగెను. ఈ బాలకుడెవడో యాతడు నిర్ణయింపజాలక పోయెను. ఈసారి యాతడు భరత పుత్రుడగు బుష్కలుని, హనుమంతు

నిదోడుగాజేసి బాలకునితో బోరబంపెను. బాలకుడు తన యీడువాడే యనియు దేజస్వియును, సుందరుడనియు బుష్కలుడు గ్రహించెను. ఆతని మనస్సు బాలకునివైపు స్వాభావికముగనే ఆకర్షింపబడెను. పరువిడి ఆతని పాదములను ముద్దిడుకొన వలయునని ఆతనికి మనస్సున బుద్ధి పుట్టుచుండెను. కాని క్షత్రియునకెదురుగా శత్రురూపమున నిలుచుండి నప్పుడు తలవంచుట పిరికివాని లక్షణము; అని యాలోచించుకొని ఆత డిట్లనెను:-" వీరవరా! నాపేరు పుష్కలుడు. నేను శ్రీరామచంద్ర మహా రాజు తమ్ముడగు భరతుని పుత్రుడను. నీతో బోరాడ వచ్చితిని, కాని నీవు భూమిపైన నున్నావు. నేను రథముపై గూర్చుండినాను. ఇట్టి యుద్ధము శోభింపదు. నేను నీకొక సుసజ్జిత రథము నొసంగెదను. దానిమీద గూర్చుండి నీవు నాతో యుద్ధమొనర్పుము."

ఇది విని లవుడిట్లనెను:-" పుష్కలా! మేము క్షత్రియులము. మేము దానము నొనర్చెదము కాని దానమును గ్రహింపము. శత్రువొసంగిన రథమందెక్కి యుద్ధ మొనర్చుట వీరునకు శోభింపదు. నీవు చింతింపకుము. క్షణములో నేను నిన్నును రథహీనునిగా జేసెదను. కాచుకొనుము." ఇట్లు పలికి లవుడు పుష్కలునిపై బాణములను వదలెను. పుష్కలుడు చాల సేపటివరకు మంచివీరత్వముతో యుద్ధమొనర్చెను. కాని ఆతడు లవుని ప్రహారములను సహింపజాలకపోయెను. అల్ప కాలముననే ఆతని రొమ్మునకు బాణము తగులుటచే మూర్ఛితుడై భూమిమీద బడెను. హనుమంతుడాతని లేవనెత్తి శత్రుఘ్నుని సమీపమునకు గొనిపోయెను."

పుష్కలుడు మూర్ఛితుడగుటను గాంచగనే శత్రుఘ్నుని ఆశ్చర్యమునకు మేరలేకపోయెను. ఆతడిట్లనుకొనెను:-" కాలుడే బాలకరూపమున

రాలేదుకదా! బలవంతుడగు నీహనుమంతుడు కాలునిగూడ జయింపగల వాడు. కావున నాతడు పవనతనయునితో నిట్లనెను:—" అంజనానంద వర్ధనా! హనుమంతా! నీవా క్షుద్రవానిపై దయజూపకుము. ఆతడు భయానకుడుగ గనబడుచున్నాడు. నీవాతని నీగదచే జంపివేయుము."

శత్రుఘ్నుని యాజ్ఞను బొంది హనుమంతుడు మిక్కిలి వేగముతో దుముకుచు, గంతులిడుచు గిలకిల శబ్దమొనర్చుచు లవుని మీదకుబోయెను. పోయి యాతడు పర్వత శిఖరములనుండి గొప్ప గొప్ప వృక్షములతో లవునిపై బ్రహార మొనర్చుటకారంభించెను. ఆతడు పెద్ద పెద్ద ఫలపుష్ప సమన్వితములగు వృక్షములను వ్రేళ్ళతో బెల్లగించి లవుని శిరమున గొట్టుచుండెను. లవుడును వానిని లవమాత్రముగ దన దివ్యబాణములచే ఖండిచి వేయుచుండెను. ఈ విధముగ జాలసేపటివరకు భీషణ యుద్ధము జరిగెను. చివరకు హనుమంతుడును నా దుస్సహ ప్రహారములను సహింపజాలక మూర్ఛితుడై భూమిపైబడెను.

పవనకుమారుడు మూర్ఛితుడైనాడనిన విషయము వినగానే శత్రుఘ్నుని ధైర్యము సడలిపోయెను. ఆతడు వెంటనే అస్త్రశస్త్ర సుసజ్జితుడై సమరభూమికి వచ్చెను. సింహశాబకమువలె సైనికవేషమున వీరవరుడగు లవుడు సేనరాకకై ప్రతీక్షించు చుండుటనుగాంచి శత్రుఘ్నుడు పరమ విస్మితుడయ్యెను. పిల్లవానిని గాంచి యాతడు శ్రీరామచంద్రుని పుత్రుడనియే గ్రహించెను. నేను లవణాసురుని జంపబోవునపుడు సీతాభగవతి యిద్దరు పిల్లలను గన్నట్లు వినియున్నాను. ఇప్పటికి వారింతటి వయస్సు కలవారై యుండవలయును. ఈతని ఆకృతి ప్రకృతులు, నడకలు, వైఖరి యివన్నియును శ్రీరామచంద్రునకువలెనే యున్నవి. కాని యాతడొంటరిగా నున్నాడు. శత్రువై సమరమున నెదుట నిలిచియున్నాడు.

ఈతనిపై దయచూపుటెట్లు? తండ్రి కానిండు, పినతండ్రికానిండు, క్షత్రియుడు యుద్ధమందాతనికి దలను వంచరాదు. తండ్రి పుత్రునితోడను, అన్నతమ్ముని తోడనైనను యుద్ధమొనర్చును, ఇట్లాలోచించుకొని ఆతడు మిక్కిలి ప్రేమతో నిట్లనెను:— "వీరవరా! నీవెవరవు? నీవే వంశమున జన్మించితివి? నీవంటి పుత్రుని గనిన నీతల్లిదండ్రులు ధన్యులు. సమరమందు విజయశ్రీని బొందిన నీవు నిజముగ సౌభాగ్యశాలివి. కాని నా పేరు శత్రుఘ్నుడు. నాయెదుట నీవు విజయమును బొందజాలవు."

లవుడు గంభీరముగ నిట్లనెను:— "రాజా! వ్యర్థముగ ఒక వాదమొనర్చుటచే లాభములేదు. శూరవీరుడు పలుకడు, చేసి చూపించును. నా రణముననే నీకు నా విషయమంతయును తెలియగలదు. మంచిది, కాచుకొనుము."

ఇట్లుపలికి లవుడు శత్రుఘ్నునిపై ప్రహారమును గావించెను. శత్రుఘ్నుడు దీనికి సిద్ధముగనేయుండెను. ఆతడును లవునిపై బాణములను వదలెను. ఆతడు లవుని యుద్ధచాతురిని గాంచి పరమ విస్మితుడయ్యెను. లవుడు నిరంతరము బాణవర్షమును గురిపించుచుండెను. ఆతడెప్పుడు తూణీరము నుండి బాణమును దీయుచున్నాడో, యెప్పుడు ధనస్సున నెక్కించుచున్నాడో, యెప్పుడు విడుచుచున్నాడో యెవ్వరును నెరుగజాలకుండిరి. ఇట్లందరునుజూచుచుండగనే లవుడు ధనస్సు నుండి నిరంతరము బాణవర్షమును గురిపించుచుండెను. ఆతడు తన బాణములచే సేననంతను గప్పివైచెను. శత్రుఘ్నుని రథమును విరుగగొట్టెను. ధనస్సు యొక్క నారిని ద్రెంపివైచెను క్రొత్తరథమును దెప్పించుకొన్నను, గ్రొత్త ధనస్సులను ధరించినను నన్నిటిని లవుడు లవమాత్రములుగ చిన్నాభిన్న మొనర్చుచుండెను. చివరకొక తీక్ష్ణ బాణముచే శత్రుఘ్నుని వక్షః స్థలమున గొట్టగా నాతడు మూర్ఛిల్లెను.

శత్రుఘ్నుడు మూర్ఛిల్లగానే అతని వెంట నున్న సమస్త రాజ న్యులు ధర్మాధర్మ విచారమొనర్పక, అందరొక్కపెట్టున లవునిపైబడిరి. దీనిచే లవుడిసుమంతైన విచలితుడుకాలేదు. అతడు పది పది బాణములను సంధించి, అందరను రణమునుండి పారగొట్టెను. కొందరను మూర్ఛితుల నొనర్చెను. అందరను జయించి లవుడు రణగర్జనమును భయంకరముగ నొనర్చెను. ఆసమయముననే శత్రుఘ్ననకు మూర్ఛ తెలియుచుండెను. ఆతడు సావధానుడై యుద్ధమునకై లవుని యెదుట నిలిచెను. ఈ సమయమున నాతనికి మిక్కిలి కోపము వచ్చెను. ఒక్క బాలకునిచే నోడుట నాతని కాత్మగ్లాని కలిగెను. అందువలన నాతడే వైష్ణవ శరముచే లవణాసురుని జంపినాడో దానిని వింటెకెక్కించెను. దాని నెక్కిడగానే త్రిలోకములందు హాహాకారములు వ్యాపించెను. అది వచ్చి లవుని రొమ్మునకు గ్రుచ్చుకొనెను. వాల్మీకి మహాముని విద్యాశీర్వాద ప్రభావముచే నది లవుని ప్రాణములను దీయలేకపోయినదికాని దానిచే నాతడు మూర్ఛితుడై క్రిందబడిపోయెను. శత్రువు మూర్ఛితుడగుటను గాంచగనే శత్రుఘ్ననకు పరమ సంతోషము కలిగెను. ఆతడు శీఘ్రముగ రథమునుండి దిగి, లవుని లేవనెత్తి రథమునకు గట్టివైచెను."

చకిత చకిత దృష్టిచే జానకీదేవి ఋషికుమారులవైపు చూచుచు నిట్లనెను:- "నాయనలారా! లవుడా రాజునకేమి చెరుపు చేసినాడు?"

పిల్లలు తమకు తెలిసినంతవరకిట్లనిరి:— మాతా! ఆతడెవరో గొప్పరాజు. ఆతని వెంట గొప్పసేవయున్నది. చాల గుఱ్ఱములున్నవి. కొండలంత యేనుగులున్నవి. రథముల వరుసను గూర్చి చెప్పవీలులేదు. ఆతనికి మానసన్మానమును నధికముగగలదు. ఆతని గుఱ్ఱములు మీ లవుడు పట్టుకొనినాడు. తరువాత జాలమంది ఆతనితో బోరవచ్చిరి.

లవుడు మిక్కిలి వీరతతో వారినందరను నెదుర్కొనెను. చాలమందిని గొట్టిపడగొట్టెను. తర్వాత రాజువచ్చెను. రాజును గూడ గాయపరచెను. అంత నాతడులేచి ఒక్క బాణమును గొట్టి లవుని మూర్ఛితునొనర్చి తన రథమునకు గట్టివైచెను. వాల్మీకి భగవానుడును నాశ్రమమున లేడు"

ఇది వినగానే సీత పరమ దుఃఖితమయ్యెను. ఆమె యేడ్చుచు నిట్లనెను:— "అయ్యో! పుష్పపేశల శరీరముగల మా నాయనను గట్టి వేసిన నారాజెట్టి దయావిహీనుడు! పిల్లలపై నింతటి క్రోధము వనికి వచ్చునా? నాపుత్రుడగు కుశుడుకూడ యిచ్చటలేడే. ఉండియుండిన నాతని తమ్ముడగు లవుని విడిపించుకొని వచ్చియుండును."

తల్లి యీ విధముగ నేడ్చునంతలో గుశుడును నెచ్చటి నుండియో వచ్చెను. తన తల్లి యేడ్చుటను గాంచగనే కుశునకు మిక్కిలి దుఃఖము కలిగెను. ఆతడు దల్లికి నమస్కరించి యిట్లనెను:—"అమ్మా! నీ వింతగా నధీరురాల వయ్యెదవేల? నీవు నీ దుఃఖ కారణమును నాకు జెప్పుము. జననీ! నేనంతను జూడగలను గాని నీవు దుఃఖించు చుండుటను జూడ జాలను. అమ్మా! నీకు బాధను గలిగించిన వారెవరు?"

కుశుని వాక్యములను విని సీతామాత యిట్లచెను:— "నాయనా! నీ తమ్ముడగు లవుని నెవడో రాజు బంధించినాడు, నీవు శీఘ్రముగ బోయి ఆ రాజు నుండి నీ తమ్ముని రక్షించుము."

ఇది వినగానే కుశుని క్రోధమునకు మేరలేకపోయెను. ఆతడు తన తల్లికి ధైర్యమును జెప్పుచు నిట్లనెను :—"జననీ! నీవు చింతింపకుము. నేనిప్పుడే పోయెదను. ఆ రాజు చేసినదానికి ఫలమును రుచి చూపెదను. నా తమ్ముడగు లవుని బంధనము నుండి విడిపించి వానితో గూడుకొని వెంటనే నీ కడకు దిరిగి వచ్చెదను."

ఇట్లు పలికి కుశుడు తన ధనుర్బాణములను, అక్షయ తూణీరములను గైకొని క్రుద్ధ సింహముఖాతి కుపితుడై ఋషికుమారులు చెప్పిన మార్గమున సమరభూమికి బోయెను. అచ్చట నాతడు వేలకొలది సైనికులు నేలపై బడియుండుటను గాంచెను. కొందరి చేతులు తెగియుండెను. కొందరి తలలు పగిలి యుండెను. కొందరి శిరస్సులు తెగిపడియుండెను. కొందరు చచ్చిరి. కొందరు సగము చచ్చి నేలపైబడి కొట్టుకొనుచుండిరి. లవ కుమారుడు శత్రుఘ్నుని రథమునకు గట్టబడి యుండెను. కుశుడు సమర భూమికి జేరునప్పటికి లవుని మూర్ఛ తెలిసెను తాను శత్రువు రథమునకు బంధింపబడి యుండుటను, యుద్ధ భూమికి తన యన్నయగు కుశుడు వచ్చుటను గాంచగనే లవుని క్రోధమునకును నుత్సాహమునకును మేరలేకపోయెను. ఆతడు బంధనములను బలవంతముగ దెంపుకొని వెంటనే రథము మీదనుండి క్రిందకు దుమికి, తన సోదరుని పాదములపై బడెను. కుశుడు తన తమ్ముని లేవనెత్తి కౌగిలించుకొనెను. వారిద్దరొక్కటిగనే కనబడుచుండిరి. శత్రుఘ్నుడు వారిద్దరిని గాంచి వీరే శ్రీరామ చంద్రుని పుత్రులై యుందు రనుకొనెను. భగవద్వీర్యముచే గాక నిట్టి దుర్ధర్ష యుద్ధము నెవరు చేయగలరు? వీరిని యుద్ధమున నెవరును నోడింప జాలరు. వీరు గొప్ప బుద్ధిమంతులు, వీరులు ఉత్సాహులు. వీరు తమ యమోఘబాణములచే నే ముఖ్యవీరుని జంపలేదు. మూర్ఛితుల నొనర్చి వదిలిరి. వీరితో యుద్ధ మొనర్చుట నాకానందమగుచున్నది. వీరి రణ చాతురిని గాంచిన నాకు రోమరోమమున నిక్కమొడుచుచున్నది. నేను వీరిద్దరితో యుద్ధమవశ్యము చేయుదును.

'క్షత్రియు డే స్థితియందును యుద్ధ పరాఙ్ముఖుడు కాడు' అని యాలోచించుకొని శత్రుఘ్నుడా సోదరులిద్దరితో సమర మొనర్చసాగెను. ఈ యిద్దరు వీరులు శత్రుఘ్నుని సేననంతను బీచమడచిరి. ముఖ్యముఖ్య

వీరులపై బాణములను సంధించి మూర్ఛితుల నొనర్చిరి. శత్రుఘ్నుడు, పుష్కలుడు, సుగ్రీవుడు, హనుమంతుడు, సుదేవుడు, ఇతర వీరాగ్ర గణ్యుల నచేతనులగావించి నేలపై బరుండబెట్టిరి. మోహనాస్త్రమును వదలి అందఱను మోహితుల నొనర్చిరి.

అందఱును మూర్ఛపోగానే లవుడు మిక్కిలి యుత్సాహముతో నిట్లనెను :- "అన్నా! తల్లికి జూపించుటకై కొన్ని చిహ్నముల నేమైన గొనిపోవుదము." కుశుడు లవునిమాట నను మోదించెను. బాలసింహముల వలె నెగురుచు గంతులిడుచు లవకుశు లిద్దరును ముందుగా శత్రుఘ్నుని సమీపమునకు బోయిరి. బహుమూల్యమగు నాతని మకుట మణిని కుశుడు తీసికొనెను.

లవుడిట్లనెను :- "అన్నా! భరతపుత్రుడగు బుష్కలుని కిరీటము చాల సుందరముగ నున్నది. నాకు సరిపోవును. దీనినే నేను దీసికొందును" ఇట్లు పలికి మూర్ఛితుడై యుండిన పుష్కలుని గిరీటమును లవుడు గైకొనెను. ఇంకను మంచి మంచి ఆభూషణములను, శస్త్రములను దన స్వాధీనములోనికి దీసికొనెను. సమ్ముఖమున సుగ్రీవాంజనేయులు మూర్ఛితులై పడియుండుటనుగాంచి యిట్లనెను :— "ఈ వానరులిద్దరును బాగున్నారు.. వీరి నాశ్రమమునకు బట్టుకొని పోవుదము. మునిబాలకులు వీరిని గాంచి పరమానందమును జెందుదురు. వీరి తోకలను బట్టికొని చక్కగా నాడుకొన వచ్చును. ఇట్లనుకొని వారిద్దరును సుగ్రీవ హను మానులను గట్టి గుఱ్ఱపు తోకకు వ్రేలాడగట్టిరి. ఇద్దరును గుఱ్ఱమును దోలుకొని ఆశ్రమమునకు పోయిరి. ఆశ్రమమునకుబోయి వారు సర్వ ప్రథమముగ దమ మాతయగు సీతకడకుబోయి పాదపద్మములకు బ్రణా మము గావించి, అత్యంతోల్లాసముతో నిట్లనిరి :- "అమ్మా! అమ్మా!

మేమారాజును జయించి తెచ్చితిమి. అతని గుఱ్ఱమును గూడ తెచ్చితిమి. అమ్మా! నీవు గుఱ్ఱమును జూడుమెంత బాగుగా నున్నదో! ఇట్టిదే యింకొక్కటి దొరకినచో మేమిద్దరమును దానిమీద నెక్కెదము. అమ్మా! మేము రెండు కోతులనుకూడ పట్టి తెచ్చితిమి. అవి బాగుగా నున్నవి. వానితో మేమాడుకొందుము. కొన్ని శస్త్రములనుగూడ ఆరాజు సైనికుల నుండి హరించి తెచ్చితిమి. అమ్మా! నీవుపోయి ఆ గుఱ్ఱమును జూడుము. నాకదియే బాగున్నది దానిముఖమున నొక బంగారు ఫలకము కట్టబడి యున్నది. దానిమీద నయోధ్యాధిపతి రామచంద్రుడను రాజు గలడు. అతడొక అశ్వమేధయాగమును జేయుచున్నాడనియు, నిది ఆతని గుఱ్ఱమనియు గలదు. ఆతని తమ్ముడు శత్రుఘ్నుడనువాడు దాని రక్షణలో నున్నాడు. మేమాతని మూర్ఛబడగొట్టి ఆతని గుఱ్ఱమును దెచ్చినామమ్మా! మేము మంచిపని జేయలేదా?"

ఇది వినగానే జానకీదేవి కన్నుల నీరు రాగా బుత్రులను గసరి యిట్లనెను :— "అయ్యో! మీరిదేమి యనర్థమును గావించితిరి. మీరిప్పుడు పలికిన నామము గలవాడే మీ తండ్రి. శత్రుఘ్నుడు మీ పినతండ్రి. మీరు మంచి పని చేయలేదు. నాయనా! క్రోతులెవరో వారిని నాకు త్వరగా జూపింపుము."

ఇది విని పిల్లలు నిర్ఘాంతపోయి తమ తల్లిని బయటకు దీసికొని వచ్చిరి. సుగ్రీవ హనుమానులు గుఱ్ఱము తోకకు గట్టబడియుండిరి. భూమిమీద నీడ్వబడుటచే వారి శరీరములు దోకుకొనిపోయి యుండెను. ఇదిచూచి తల్లి శీఘ్రముగ నిట్లనెను :— "మీరిద్దరును బోకిరి వాండ్రురా! ఓరీ! వెఱ్ఱి కుంకలారా! మీరు వీరి నిద్దరి నెఱుగరటరా? వీరిద్దరును విశ్వ విజయులగు వీరులు. ఈ పెద్దవాడు వానరేశ్వరుడగు సుగ్రీవుడు. నిత్య

మెవని యశమును రామాయణములో గానము చేయుచుందుమో ఆ పవన కుమారుడే యీ రెండవ యాతడు. ఈతడు నా కెంతో యుపకార మొనర్చినాడు వీరియెదుట నేను దలనెత్తన యెత్తజాలను. మీరు వీరిని సాధారణ వానరులవలె బంధించి తెచ్చితిరి. ఛీ! ఛీ! మీరు చెడ్డపని యొనర్చినారు. వదలుడు. వదలుడు. వీరిని వెంటనే విడువుడు."

ఇట్లు పలికి జగదంబ జానకీదేవి సూర్యనారాయణుని వైపునకు జూచుచు నిట్లనెను :— "చరాచర జగత్సాక్షి! సూర్యనారాయణా! నేను మనోవాక్కాయముల శ్రీరామచంద్రున కనుగామిని నగునెడలను బర పురుషునెన్నడును జింతింపని యెడలను నీ శత్రుఘ్నుని సమస్త సేవతో జచ్చినవారును మూర్ఛితులును జీవించెదరుగాక!"

సీతాదేవి యిట్లనుకొనునంతలో యుద్ధ భూమిలో పురుషులందరును నిద్రలేచిన వారివలె లేచి కూర్చుండిరి. తెగిన యంగములన్నియును మరల అతుకుకొనెను. హనుమత్సుగ్రీవులకును మూర్ఛ తెలియుటచే లేచి నిలుచుండిరి. వారు చేతులను జోడించుకొని యెదురుగ నున్న సీతకు ప్రణామమును గావించిరి.

సీత యిట్లనెను:—"నాయనలారా! ఈ బాలకుల ధూర్తత్వమును మీరు మనస్సున బెట్టుకొనకుడు. ఈ వనమందైనను మీ యిద్దరను కుశల పూర్వకముగ జూడగలుగు చుండుట సంతోషించదగిన విషయము. నే నిప్పుడు పరిత్యక్తను. నా స్వామియే నన్ను విడిచినాడు. ఆతని కెవరిని గాంచిన సంతోషమో నాకును వారిని గాంచిననే సంతోషము. హనుమాన్ నీవు నన్ను లంకనుండి విడిపించి యేల దెచ్చితివి? నన్నచ్చ టనే చావనీయక పోయితివా? అట్లయిన నీ దుఃఖమును జూచియుండక పోవుదును కదా! ఈ దుఃఖమును భరింపజాలను. అయ్యో! ఇప్పుడు

నేను జావనైన జావజాలను. ఈ వనమందు నేను వాల్మీకి భగవానుని కృపావిశేషము చేతనే దినములను గడుపుచున్నాను. ఈ పసివారి ముఖములను గాంచుచు జీవించుచున్నాను నేను లేకున్న వీరల్లాడిపోదురేయని భావించుచుందును. కాకున్న నేనెప్పుడో మరణించి యుందును."

సీత యీ విధముగ దుఃఖించుటను గాంచి సుగ్రీవ హనుమానులు దుఃఖింపసాగిరి. హనుమంతుడిట్లనెను:-" అమ్మా! ఇదంతయును ప్రారబ్ధము. నీహృదయమున సదా రామచంద్రుడు నివసించు చుండెను. రామచంద్రునిలో నీవు నివసించు చుండెదవు. మీకిద్దరికి ఒక్క క్షణమయిన వియోగములేదు. దీనిని మీరు లోకమునకు జూపించుట కొరకును, కరుణా స్రవంతిని ప్రవహింపజేయుటకును నిట్టి లీలలొనర్చుచున్నారు. నేడు మేము నిన్ను బుత్రవతిగ గాంచుచున్నాము. ఇది యదృష్టము. లవకుశుల వలన బరాజితుల మగుట మాకానంద కారణమే. స్వామివలన నేవకులెప్పుడును బరాజితులగుదురు. వీరు మా స్వామి స్వరూపులు. ఆతని ప్రతికృతులు. రామునకు బ్రత్యక్షాత్మలు. ఇట్టి వీరపుత్రులను గని నీవు నిజముగ వీరమాతవైతివి. త్వరలోనే వీరు మాకు ప్రభువులుకాగలరు ఇప్పుడిక మాకాజ్ఞ నొసంగుడు. శత్రుఘ్నుడు మాకొరకు ప్రతీక్షించు చుండగలడు. నిన్ను శ్రీరామచంద్రునితో గూడియుండునపుడు చూచు దినమెంతో దూరమునలేదు." అని పలికి వారు జానకీదేవికి బ్రదక్షిణము కావించి, లవకుశులొసంగిన యజ్ఞాశ్వమును గైకొని సేనలోనికి వచ్చిరి. అప్పటికి శత్రుఘ్ననకును, సైనికులకును మూర్ఛతెలిసెను. అశ్వసహితులగు హనుమత్సుగ్రీవులను గాంచి శత్రుఘ్నుడు లజ్జితుడై సిగ్గుతో నిట్లనెను:-" ఆబాలకులిద్దరును గొప్ప శూరవీరులు. వారు మమ్మందరను బరాజితుల నొనర్చినారు. మీకీ యశ్వమెట్లు లభించినది.?"

అంత సమస్త వృత్తాంతమును జెప్పుచు సుగ్రీవు డిట్లనెను:- 'రాజా! ఇందు లజ్జింపవలసిన పనిలేదు. ఆబాలకుల కట్టి బలముండవలెను. వీరు శ్రీరామచంద్రుని వీర్యమున, సీతామాతయొక్క యుదరమున నుత్ప న్నమైనారు. వీరు మా ప్రభువులు. ప్రభువులవలన సేవకులెల్లప్పుడును నోడిపోవలెను"

ఇది వినగానే శత్రుఘ్నుని మనస్సులో మిక్కిలి యానందము కలిగెను. ఆతడు మరల నాశ్రమమునకు బోలేదు. అచ్చటి నుండి యజ్ఞా శ్వమును గైకొని అయోధ్యాపురికి దిరిగివచ్చెను. అశ్వము కుశలముగ దిరి గివచ్చుటను గాంచి శ్రీరామచంద్రుడు పరమానందమును జెందెను. ఆతడు విధ్యుక్తముగ యజ్ఞమును బూర్తి కావించెను. బ్రాహ్మణులకును యాచకుల కును గోరిక దానముల నొసంగెను. విశాలమగు యజ్ఞము చాల వైభవ ముగ సమాప్తమయ్యెను. యజ్ఞము సమాప్తి కాగానే అందరవభృథస్నాన మొనర్చిరి. అందరును దమతమ గృహములకు దిరిగిపోయిరి.

శ్రీరామచంద్రునకు శత్రురాజనువాడు లేనేలేడు. అంతరాతని కధీ నులై యుండిరి. యుద్ధావసరమే కలుగకుండెను. సీతావియోగ కారణ మున శ్రీరామచంద్రునకు రోజులు గడుచుటలేదు. ఆతనికి క్షణక్షణము గడుచుట కష్టముగ నుండెను. సీతయొక్క ప్రేమను నాతడెంత మరచెద మన్నను మరవజాలకుండెను. ఆతడెంతగా మరచుటకు బ్రయత్న మొన ర్చుచుండెనో అంత అధికముగ స్మరణకు వచ్చుచుండెను. అయోధ్యలోని సమస్తభవనములును నాతనికి సీతను స్మరింప జేయుచుండెను. ఈ భవన మందు మును ముందుగా వివాహానంతరమున సీత కలిసికొనినది. ఇచ్చట నామెతో నిట్టి సంభాషణము జరిగినది. ఈ ప్రసంగములన్నిటిని స్మరించి శ్రీరామచంద్రు డత్యంతము దుఃఖించుచుండెను. అయోధ్యను వీడి

యుంకెచ్చటనైన నుండ వలయునని ఆతడనుకొనెను. అతడిట్లనుకొనెను:- నైమిశారణ్యము పుణ్యభూమి. అచ్చట నెనుబది వేల మంది మునులు నిరంతరము తపస్సును జేయుచుందురు. వేలకొలది మునులు వచ్చుచు బోవుచుందురు. అది యజ్ఞమునకు ప్రధాన స్థలము. అచ్చటకుబోయి అశ్వ మేధ యజ్ఞ మొనరించుట మంచిది. దీనివలన మనస్సునకును నానందము కలుగగలదు. కాలమును గడుచును" అని యిట్లాలోచించుకొని భగవా నుడు నైమిశారణ్య మందశ్వమేధ యాగము నొనర్చుటకాజ్ఞ నొసంగెను. అచ్చట గోమతీనదీ తటమున యజ్ఞప్రయత్నము చాలవైభవముగ జరుగు చుండెను. సేవకులు ముందుగా బోయి పదియోజనముల విస్తీర్ణముకల భూమిని యజ్ఞముకొరకు చదర మొనర్చిరి. గడ్డి, రాళ్ళు రప్పలతో నిండి యుండిన నెత్తయినభూమినిగొట్టి సమతల మొనర్చిరి. భూమి సమతలమైన తరువాత నచ్చట వేలు, లక్షలు పూరి కుటీరములు నిర్మింపబడెను. చాల దేశాలు వగైరాలేర్పరుపబడెను. నలువైపులను గంచె లేర్పరుపబడెను. దేశదేశముల నరపతులాహ్వానింపబడిరి. అయోధ్యనుండి అన్నాది సమస్త సామగ్రులును, బండ్లమీదను, గుఱ్ఱములమీదను, నొంటెల మీదను, నెద్దుల మీదను, వచ్చుచుండెను. వేలకొలది యెద్దులమీద మంచి సన్నబియ్యము, వచ్చుచుండెను. లక్షలకొలది గోధుమ బస్తాలు, పదివేల బస్తాలు యవలు, బియ్యము, తిలలు, గుఱ్ఱములు, కంచరగాడిదలమీద వచ్చుచుండెను. పెద్ద పెద్ద పెట్టెలు ధనముతో నింపబడి ఒంటెలపై వేయబడెను. ఈ విధముగ వేరుశనగ, అలచందలు, పెసలు, మినుములు, కందిపప్పు, ఉప్పు, మిర్చి, ధనియాలు, జీలకఱ్ఱ, మెంతులు, పసుపు మెంతి, ఇంగువ. మిరియాలు, సోంఠి, అజామోదము, తమలపాకులు, జాపత్రి, జాజికాయ, పెద్దవియు జిన్నవియునగు నేలకులు, పిప్పళ్ళు, వక్కలు, చక్కెర, ఖండశర్కర, బెల్లము, ఇవిగాక ఈ మొదలగువానితో జేయబడిన పదార్థములు వేల కొలది బస్తాలలో నింపబడి బండ్లమీద వచ్చుచుండెను. సువర్ణ ముద్రికలు,

బంగారు, వెండి, ముత్యములు, పవడములు, మణిమాణిక్యాదులును, సుందరములగు బట్టుసంచులలో నింపబడి ఇనుపబండ్లమీద సైనికుల పర్యవేక్షణతో బోవుచుండెను. ప్రత్యేకముగ నొక కూపమును గట్టించి దానిలో నేయి నింపిరి. అట్టినేతి కూపములమీద నినుపమూత లేర్పాటు చేయబడెను. పెద్ద పెద్ద కొయ్యబానలలో బాలు పెరుగు నింపబడెను. వానిపై గొయ్య చెక్కలు మూతలేర్పరుపబడెను. వాని క్రింద బాత్రనుంచిన వానికవియే నిండిపోవున ట్లేర్పాటు చేయబడెను. వానిలో బియ్యమును బోసినచో నిముషములో క్షీరాన్నమగున ట్లేర్పాటు చేయబడినది. భోజనాలయము లేర్పరుపబడినవి. అందరకును యజ్ఞమునకు రావలసినదని యాహ్వానములు పంపబడినవి. బ్రదుకు తెరువుగ బరదేశములకు బోయిన వారికిని ఆహ్వానములు పంపబడినవి. సపత్నీక బ్రాహ్మణు లాహ్వానింపబడిరి. మేళగాండ్రును, నృత్య గీతాదు లొనర్చువారలును, నర్తకులును, స్తోత్రములొనర్చు సూతమాగధ వందీగణములును, నాటకసంఘములును, గీతాగానవాద్యము లొనర్చువారును, మల్లులును, యోధులును, గథావాచకులును, నుపదేశకులును, నామ సంకీర్తన మొనర్చువారలును, గథాకీర్తన మొనర్చువారలును, నింకను మనోరంజక కార్యములొనర్చు సంఘములును, పగటివేషములు వేయువారును బిలిపింపబడిరి. యజ్ఞసమాచారమును విని దూరములనుండి మునులును, బ్రాహ్మణులును, నభ్యాగతులును, యాచకులును, సమస్త వర్గములవారును నైమిశారణ్యమునకు వచ్చిరి.

భరత, లక్ష్మణ, శత్రుఘ్నుల భార్యలను బాలకీలలో గూర్చుండి బయలుదేరిరి. సువర్ణమయమగు సీతనుగూడ బాగుగా నలంకరించి తెచ్చుచుండిరి. బ్రాహ్మణులు యజ్ఞసామగ్రిని, పూజాసామగ్రిని గొనిపోవుచుండిరి. ధూపము, కర్పూరము, చందనము, గుగ్గులు, అగరు, జవ్వాజీ,

కస్తూరి, పాలమడ్డి. కుంకుమపువ్వు మొదలగు ద్రవ్యములు బస్తాలకు బస్తాలు బ్రాహ్మణులవెంట బండ్లమీద వచ్చుచుండెను. బంగారు, వెండి, రాగి, యిత్తడి, కంచు, లోహ, దారు, మృత్పాత్రలు చిన్నవి, పెద్దవి వేలకొలదులుగ నొంటెలమీదను, కంచర గాడిదలమీదను వచ్చుచుండెను. పట్టువి, నూలువి, ఉన్నవి వేలకొలది తానులగుడ్డలు యజ్ఞమునకు సంబంధించిన కార్యములకు బంపబడెను. సారాంశమేమనగా జీవనోపయోగమునకు బంపబడు సమస్త సామగ్రు లేవేవి యిచ్చట నుండి పోగలవో అవన్నియును వాహనముల మీద బోవుచుండెను. నిత్యమును దెచ్చుకొనవలసిన వస్తువులు అనగా పాలు. పెరుగు, ఫలపుష్పములు, పుష్పమాలలు, రౌకద్రవ్యములు, ఆకుకూరలు, కుశలు, సమిధలు, తులసీ, బిల్వపత్రములు, పంచగవ్యాదులు మాత్రము తెచ్చుట లేదు. వరుసగా శిబిరము లేర్పరుపబడెను. వేరుగా వ్యాపారుల దుకాణము లేర్పరుపబడెను. వచ్చిన రాజులుండుటకై ఆవాస స్థానములు వేరుగనిర్మింపబడినవి. అన్నిటిలోను భోజనసామగ్రి, జలమును, నితరములగు నవనర పదార్థములును వేరు వేరుగ నేర్పరుపబడినవి. ప్రకాశమునకు దీపాదుల యేర్పాటు అతి మనోహరముగనుండెను. రాత్రులందు పగలుగ దోచుచుండెను. అచ్చట పారిశుద్ధ్య విషయమున జాల జాగ్రత్త తీసుకొనబడుచుండెను. అయోధ్య నుండి ఊడ్చువారును, బాగుచేయువారును నచ్చటికి వచ్చియుండిరి. కొలది దినములలోనే నైమిశారణ్యమం దయోధ్యవలె బురమేర్పడెను. ఏ వస్తువు కావలయునన్నను నచ్చట నేమాత్రమును గొదువలేకుండెను. అశ్వమేధాది యజ్ఞములను జేయించుటలో విశేషముగ దెలిసినవారును, గొప్పగొప్ప రాజులచే ననేకాశ్వమేధాది యజ్ఞములను జేయించినవారునగు వశిష్ఠ, వామదేవ, జాబాలి, కశ్యపాది గొప్పగొప్ప మహర్షులు యజ్ఞమండపాదులను రచించిరి. శుభలక్షణములుగల పరమసుందరాశ్వము విడువబడెను. ఈసారి లక్ష్మణుడు దానికి రక్షకునిగా పంపబడెను. గుఱ్ఱమును వదలి శ్రీరాముడు

నైమిశారణ్యమందు నివసించుచుండెను. యజ్ఞమునకు సంబంధించిన యితరకార్యములు జరుగుచుండెను. శ్రీరామచంద్రుడు గొప్ప గొప్ప గాయకుల సభలో గూర్చుండి గానమును వినుచుండెడువాడు. శాస్త్ర చర్చలను జేయుచుండెను. కథావాచకులు వచ్చి పురాణకథలను జెప్పుచుండెడివారు. ఈ విధముగ యజ్ఞకార్యము చాల వైభవముగ జరుగుచుండెను. శ్రీరాముని సేవలచే సత్కరింపబడనివారీయజ్ఞమునకు వచ్చిన వారెవరును లేరు. సుగ్రీవ, హనుమద్విభీషణ, భరత శత్రుఘ్నులును, నితర రాజులును స్వయముగ దమచేతులతో వచ్చిన వారిని సేవించుచుండిరి. ఎవరు వచ్చి యేవస్తువును యాచించినను దానిని తక్షణ మీయవలయుననియు, నిక జాలు ననువరకు అవ్వారిగ నీయవలయుననియు, దనకడకు వచ్చి యెవడును విముఖుడై పోరాదనియు శ్రీరామచంద్రుని యాజ్ఞ.

భగవానుని సేవకులట్లే చేయుచుండిరి. వారు నిరంతర మిట్లనుచుందురు:- "మీకే వస్తువు కావలయునో దానిని దీసికొనుడు దేనిని దినదలచెదరో దానినిదినుడు. పచ్చివో, పండువో, ఫలహారములో, పిండి వంటలో మీకేది కావలయునో దానిని దినుడు. ఎండిన వరుగులు నితర శుష్కవస్తువు లేవికావలయునో వానిని దీసికొని పోవచ్చును." సారాంశ మేమనగా వారేవస్తువును లేదు కాదనలేదు. కల్పవృక్షమువలె శ్రీరామచంద్రుని కడ నెవరెది కోరిన వారికా వస్తువులు లభించుచుండెను. లక్షల సంవత్సరము లాయుస్సు గల మహర్షు లిట్లనిరి:- మేమనేక యజ్ఞములను జూచితిమి గాని యీ విధముగ వచ్చిన వారికి స్వాగత సత్కారము లొనర్చిన వారిని, అధిక దానములొనర్చిన వారిని, మేమెన్నడును జూడలేదు." దానిని జూచిన వారందరును తామేదో ఒక దివ్యలోకమున నున్నట్లనుకొనుచుండిరి.

ఎవరైనను గ్రొత్త మునులు వచ్చిరా అచ్చటికి వారికి స్వాగత సత్కారములొనర్చుటకై పరువిడు చుందురు. స్వాగతాధ్యక్షునకీ సంగతి తెలిసినే తెలియదు. వెంటనే ఆతనికి నివాసమునకు విడిదియును, ఆహార పానీయముల కేర్పాట్లును జరుగును. మునులుండుటకై కుటీరము లేకాంత మున నిర్మింపబడినవి. వానిలో దపస్వులకు గావలసిన సామగ్రులన్నియు నేర్పరుపబడినవి.

యజ్ఞము చాల వైభవముగ జరుగుచుండెను. యజ్ఞము యొక్క గొప్ప ప్రశంసను విని వాల్మీకి భగవానుడు తన శిష్య ప్రశిష్యులతోడను. అనుచరులతోడను, సాధువులతోడను యజ్ఞమును జూచుటకై వచ్చెను. అగ్నిహోత్రమును అగ్నిహోత్ర సామగ్రులు నున్నట్టి ఒక మండప మాతనికడ నుండెను. వాల్మీకి భగవానుని వెంట నాతని ప్రియ శిష్య ద్వయము కుశలవు లుండిరి. ఆయిద్దరిచేతను ముని రామాయణకావ్యము నంతను సంగీతముతో వల్లింపజేసి యుండెను. వారు లయ, తాళ, స్వర, మూర్ఛనాది సహితముగ రామాయణ గాన మొనర్చుటలో బరమ నిపుణులు. ఆమహా కావ్యమంతయును వారికి కంఠస్థమే. ముని యొక ఏకాంత కుటీరమునకు వచ్చివిడిసెను. సేవకు లాతడుండుటకై సమస్తములగు నేర్పాటులను గావించిరి. భోజన సామగ్రులన్నిటిని వారికి జేర్చిరి. ముని అగ్నిహోత్రాది నిత్య కర్మ లొనర్చుకొని, రాత్రియందు యజ్ఞమును గూర్చిన విషయములను వినుచు సుఖ పూర్వకముగ విశ్రాంతిని దీసికొను చుండెను.

ప్రాతః కాలమున నిత్యకర్మ లొనర్చుకొని వాల్మీకి మహాముని తన ప్రియ శిష్యులగు కుశలవులను బిలిచెను. వినయ శీలురగు నాబాల కులు చేతులు జోడించుకొని గురు సమ్ముఖమున నిలుచుండిరి. ముని

అత్యంత ప్రేమతో నిట్లనెను:—" పుత్రులారా! మీరీ మహా యజ్ఞమందు మీసుందర కావ్యము నందరకును వినిపింపుడు. ఇచ్చటికి గొప్ప గొప్ప రాజులును మహారాజులును ప్రతిష్ఠ గల పురుషులును వచ్చియుండిరి. ప్రపంచ మండలి మూల మూలల నుండియును, దశదిశల నుండియును, రాజులును, మహారాజులును, గుణగ్రాహులగు కళాకారులును నిచ్చటజేరి యున్నారు. మీరు చక్కని కంఠ స్వరములతో దాళ లయ స్వరాదులతో నీ మహా కావ్యమును వినిపింపుడు. బ్రాహ్మణులుండు చోటను, వీధు లందును, జేతిపనులొనర్చు చోట్లను రాజులుండుచోట్లను, సమస్త స్థాన ములందును నేను రచించిన మహాకావ్యమును గానమొనర్పుడు. వినిపిం చుటలో బ్రమాదపడకుడు. పాడుచు బాడుచు నలసిపోయినచో నొక్కచో గూర్చుండి కొంచముసేపు విశ్రాంతిని గైకొని, రసయుక్తములగు ఫలము లనుదిని, మీశ్రమను బోగొట్టుకొనుడు. ఆకలైనప్పుడే ఫలములను దినవల యును. తిని తిని బాగుగా బాడుడు. సరస, సుగంధిత ఫలములను దిను టచే మీకంఠములు మరల జక్కనగును. గానమొనర్చునపుడు సంకో చింపరాదు. ఋషులకడ జాలసేపాగి గానముచేయవలెను. అచ్చట నత్యంత మధుర కంఠముతో గానమొనర్పవలయును. రామచంద్రమహా రాజు మిమ్ములను బాడుడని పిలిచినచో శిష్టతతో వాని సమీపమునకు బోవలయును. ఆతడు మీతండ్రి. కావున నాతనికడ నేవిధమగు నశిష్టతా వ్యవహారమును గావింపజనదు. మేము మీ పుత్రులమని అతనితో జెప్ప రాదు. ఒకవేళ నాతడు మీపరిచయము నడిగినచో గేవలముమేము వాల్మీకి శిష్యులమని మాత్రమే చెప్పవలయును. శ్రీరాముడు మీకేదైన ధనమొసంగి నచో నేమాత్రమును గైకొనరాదు. ఏమైన నీయవచ్చినచో మేము వనములో నుండు మునులము, మాకు ధనముతో నేమిపనియని మాత్రము నమ్రతతో జెప్పుడు. నిత్యమిరువది సర్గలు గానమొనర్పవలయును. చక్కని స్వర

ములుగల వివిగో! రెండువీణలుగలవు. వీనిని వాయించుచు శ్రుతిలోగలిపి-
గానము చేయవలయును. గానముచేయునపుడు తప్పులు రానీయగూడదు."

ఈ విధముగ ముని తన శిష్యులగు కుశలవులకు వివిధములగు
శిక్షణల నొసంగెను. గురుని శిక్షణలను శిరసావహించి ఆపిల్లలు పాడు
కొనుచు బోవుచుండిరి, ఆసమయమున వారి శోభ మిక్కిలి అపూర్వముగ
నుండెను. ఇద్దరియొక్క రూపమును, రంగును, స్వభావమును, వ్యవ
హారమును, శీలసంకోచములును నొక్కటిగనే యుండెను. వారిద్దరకును
సుందరములగు జిన్నచిన్న స్వర్ణాభములగు జడలుండెను. అవి వాయు
వులో విరియబడి, వారి ముఖమండలమందు గదులుచు నత్యంత శోభా
యమానముగ నుండెను. ఇద్దరును బసుపు పచ్చని వస్త్రములను ధరించిరి.
ఇద్దరి చేతులలోను వీణలుండెను. ఇద్దరి కంఠములును మధురముగ నుం
డెను. ఇద్దరును నొక్కస్వరమున బాడుచుండిరి. వారిద్దరి స్వరములు
బాగుగా గలిసిపోయెను. గానముచేయుచున్న దిద్దరుగాక, ఒక్కరే చేయు
చున్నట్లుగ దూరమునుండి వినువారలకుండెను. వారినడకయు, వైఖరియు
జాల సుందరముగ నుండెను. వారి వీణయందును, రూపములందును,
గానము లందును, గూర్చుండుట యందును, నిలుచుండుట యందును
నాకర్షణముండెను. వారిద్దరి పాదములొక్కసారిగ లేచును. వారెన్నడును
దాళస్వరములను దాటిపోరు. వేలకొలది స్త్రీలును, బురుషులును, బాలకు
లును, యువకులును, వృద్ధులును వారికి నలువైపులను గుమిగూడిరి.
వారందరును వారిగానములను విని ధన్యుల మనుకొనుచుండిరి. వారొక
చోటునుండి వేరొకచోటునకు బోవుచుండిరి. జనులందరును వారివెంటబడి
పోవుచుండురు. వారి గానమునుగూర్చి అంతటను జర్చ జరుగుచుండెను.
అంతటను వెల్లడియయ్యెను. గాయకు లాశ్చర్య చకితులైరి. బ్రాహ్మణులు
విస్మితులైరి. రాజుల యానందమునకు మేరలేకుండెను. జరిగిన రామ

చంద్రుని చరిత్ర కనులకు గట్టినట్లుండెను. ఆ కుమారులిద్దరును బాడుచు శ్రీరామచంద్రుని ద్వారముకడకు వచ్చిరి.

శ్రీరామచంద్రుని కా బాలకులను జూడగానే హృదయము పొంగి పొరలిపోయెకు. దుఃఖ ముప్పొంగెను. వీరి గానమును వినగానే శ్రీరామ చంద్రు డాత్మ విస్మృతిని జెందెను. ఇంత చిన్న వయస్సునందు సంగీత నియమము లన్నిటిని సావధానముగ బాలించుచు దాళ స్వరము లతో నీ బాలకులు గాన మొనర్చుచున్నారు. దీనిని గాంచి శ్రీరామచంద్రు డును బరమ ప్రసన్నుడయ్యెను. లక్ష్మణుని ద్వారా ఆ బాలకులను బిలి పించి భగవాను డిట్లనెను:-"మీకు మాకు గానమును వినిపించెదరా?"

కుశుడు వినీత భావముతో నిట్లనెను:— "ఎందులకు వినిపింపము. మహారాజు వారి ఆజ్ఞయైనచో నవశ్యము వినిపించెదము"

ఇది వినగానే భగవానుడు రాజసభ కందరను బిలిపించెను. పురా ణముల నెరిగిన పండితులను, వ్యాకరణముల నెరిగిన వైయాకరణు లను, జ్యోతిర్విద్యా చార్యులగు జ్యోతిష విద్వాంసులను, గణితజ్ఞులను వృద్ధ బ్రాహ్మణులను, సంగీత మర్మజ్ఞులను, రస శాస్త్ర జ్ఞాతలగు రసికులను, లలిత కళల నెరిగిన గళాకారులను, వాచకులను, ఋషు లను, మునులను చాతుర్వర్ణులను. నింత ఎందులకు బాలురను, స్త్రీలను, సర్వులను ఆ కావ్య శ్రవణార్థమై పిలిపించెను. అందరకును యథా యోగ్యముగ గూర్చుండుట కాసనము లొసంగబడెను. అందరును గూర్చుండిన మీదట నా సోదరు లిద్దరును నిర్భయులై అత్యంత మధుర వాణితో గాన మారంభించిరి. పాడి పాడి తన్మయులయిరి. శ్రోతల నేత్రముల నుండి అశ్రువులు రాలుచుండెను. వారంద రానందాబ్ధిలో మునిగి ఆత్మ విస్మృతిని జెందిరి. బాలురు పాడి పాడి పొంగి పొరలి

ఆనందోద్రేకమున మునిగి తేలుచుండిరి. శ్రోతలు చిత్ర లిఖితులవలె మెదలక కూర్చుండి వినుచుండిరి.

ఆ సభయందెవరయినను గట్టిగా గాలిని బీల్చినచో వినబడు నంతటి శాంతి యుండెను. ఆ బాలకు లందర చిత్తముల నాకర్షించిరి. మొదటి నుండి వారిరువది సర్గలను గానమొనర్చిరి. గుర్వాజ్ఞ నిత్య మిరువది సర్గలను గానమొనర్చుట. కావున వారిరువది సర్గలను గాన మొనర్చి మెదలకుండిరి. వారి గానముచే శ్రీరామచంద్రు డత్యంత ప్రభావితు డయ్యెను. నగర వాసులును, దర్శకులు నిట్లనిరి:—వీరు శ్రీరామునకు ప్రతికృతులుగ నున్నారు. వీరు ముని వస్త్రములను ధరింపకుండినచో వీరికిని శ్రీరామునకును భేదము గోచరింపదు. శ్రీరామునకును వీరి యెడల నెట్టి సహజ స్నేహము గలదు !"

బాలకులు రామాయణమును గానమొనర్చి యూరకుండగానే శ్రీరాముడు తన తమ్ముడగు భరతునితో నిట్లనెను :—"భరతా ! ఈ పరమ గుణవంతులగు ఋషి కుమారులకు తొమ్మిది తొమ్మిది వేల సువర్ణ ముద్రలను వెంటనే యొసగుము. ఇవి గాక వారింకేమైన వస్తువుల నడిగినచో వానినిగూడ యొసంగుము."

శ్రీరామచంద్రుని యాజ్ఞను బొంది భరతుడు పదునెనిమిది వేల సువర్ణ ముద్రలను దీసికొని వచ్చి ఈ బాలకుల కీయబోయెను. బాలకులు వినయభావముతో నిట్లనిరి ,—"రాజా ! మేము వనవాసులగు మునులము. ఈ సువర్ణ ముద్రలను గొనిపోయి యేమి చేయగలము. మాకేమియు నక్కరలేదు."

త్యాగము వలన మానవున కాదరము పెరుగును. గ్రహణమున కంటే త్యాగమునం దధికమగు నాకర్షణము గలదు. ఇంత చిన్న పిల్లల కిట్టి నిస్పృహత యుండుటను గాంచగనే శ్రీరామచంద్రునకు లోలోన మిక్కిలి శాంతి గలిగెను. అతడత్యంత ప్రేమతో మమత్వము నంతను గుమ్మరించుచు నా బాలకులతో నిట్లనెను :—"బాలులారా ! అత్యంత సుందరమైన యీ కావ్యమును మీ రెచ్చట బఠించితిరి ? దీనిని రచించిన దెవరు ? మీ రెవరి శిష్యులు ? యీ కావ్య మెంత గొప్పది ? ఎవరివలన మీ రీ కావ్యమును బఠించితిరి ? ఆ ముని ఎచ్చట నివసించును ? ఈ సమయమున నెచ్చట నున్నాడు ?"

కుశు డిట్లనెను :— ప్రభూ ! ఈ మహాకావ్యమును వాల్మీకి భగవానుడు రచించినాడు. లౌకిక ఛందస్సులో నున్న కావ్యములలో నిది మొట్ట మొదటిది. అందువలన నిది యాదికావ్యమైనది. దీనిలో మీ చరిత్ర మున్నది. దీనికి రామాయణ మను పేరు వచ్చినది. ముని దీని నారు కాండలలో సమాప్తము కావించిరి. ఏడవదగు నుత్తర కాండము తరువాత రచింపబడును. దీనిలో నిరువది నాలుగు వేల శ్లోకములు గలవు. దీనిని బఠించుటచే ధర్మార్థ కామ మోక్షములు ప్రాప్తింప గలవు. దీనిని రచించిన వాల్మీకి భగవాడును మీ యజ్ఞమునకు వచ్చియున్నారు. వారు ఋషుల కుటీరములకు సమీపముననే ఏకాంత స్థానమున విడిసియున్నారు."

లవకుశుల మాటలను విని శ్రీరామచంద్రుడు పరమ ప్రసన్నుడై మహాతేజస్వియును, తపోధనుడును, మహాత్ముడు నగు వాల్మీకి మహాముని సమీపమునకు బిల్లలతో గూడి వెడలెను. ఆతని విధ్యుక్తముగ బూజించి శ్రీరాము డాతని తపస్సును గూర్చియు, శిష్యులను గూర్చియు, ఆశ్రమ పశు పక్షులను గూర్చియు, వృక్షములను గూర్చియు గుశలము నడిగెను.

మునియును శ్రీరామచంద్రుని రాజ్య, పరివార, కోశ, సేనామాత్య, సోదరుల కుశలమును గూర్చి అడిగెను. తదనంతరము శ్రీరాముడు చేతులను జోడించుకొని యిట్లనెను :—"స్వామీ! మీరు దయ చేసినారు. ఇది నా భాగ్యము. మీ పాద ధూళిచే నీ పందిరి యంతయును బరమ పావనమయినది. మహాత్మా! మీరు రచించిన కావ్య మలౌకికమైనది. దీని రచన మలౌకిక రీతిని జరిగినది. మీరు దీనిని సమస్త ఘటనములను సమాధిలో గాంచి సమాధి భాషలోనే రచించితిరి. ఈ బాలుర కంఠమును మిక్కిలి మధురముగ నున్నది. నేను మీతోడను, సమస్త మునులతోడను ఋషుల తోడను నీ మహాకావ్యము నంతను మీ యొక్క యీ సుయోగ్య శిష్యుల ముఖమున వినదలచుచున్నాను, రేపటి నుండి మీరును సభకు దయ చేయు శ్రమను జేయుడు."

ఇది విని వాల్మీకి భగవానుడు ప్రసన్నుడై యిట్లనెను :—"రఘునందనా! నేడు నా శ్రమము సఫలమైనది. రామునకు ప్రియమైనదియే రచనము. అదియే వాస్తవమగు రచనము. ఎ రచనయందు రామ రూపము, రాముని యశము, రామ చరిత్రము, రామనామ మహత్త్వము వర్ణింపబడియున్నదో ఆ రచననే రసగ్రాహకులగు రసిక మహానుభావులు ప్రశంసించెదరు. విద్వాంసులాకృతినిగూర్చి ప్రశంసించుటయే లేఖకునకు తనకృతి కొనర్చిన పరిశ్రమ ఫలితము. కళాకారుని కళను కళామర్మజ్ఞుడగువాడు గొప్పగ బ్రశంసించినచో వానిపరిశ్రమము సఫలమగును. రేపు నేను మీసభకు దప్పకరాగలను. పిల్లలందర సమ్ముఖమున బ్రతిదినమిరువది సర్గలను మాత్రము గానమొనర్పగలరు.

ఇదివిని శ్రీరామచంద్రుడు ప్రసన్నుడయ్యెను. అతడు మునికి బ్రణామ మొనరించి సర్వవిధముల సేవలొనర్పవలయునని సేవకుల నాదేశించి తననివాస స్థానమునకు బోయెను.

రెండవ దినమున మరల సభకూడెను. కుశలవుల సంగీత ప్రశంస సర్వత్ర వ్యాపించెను. యజ్ఞమునందింతవరకును జరుగుచున్న ఆటపాట లన్నిటి నాపివేయించిరి. అందరును సమస్త కార్యములనువీడి కుశలవుల సంగీతమును వినుటకు రాజారాముని సభకు రాసాగిరి. శ్రీరామచంద్రు డును రాజసింహాసనమునువీడి మునుల మధ్య సాధారణులవలె సంగీత మును వినుచుండెను. కుశలవులు చిన్నవారగుటచే దూరదూరమున గూర్చున్నవారును బాగుగాజూచుచు వినగలుగునటుల నెత్తైన యాస నముపై గూర్చుండ బెట్టబడిరి. దీనివలన బుత్రులు యోగ్యులుకాగానే బుద్ధిమంతుడగు రాజు వారి కొరకై సింహాసనమునువదలి దూరముగ నున్నట్లుండెను.

ఈ విధముగ నిత్యమును రామాయణగానము జరుగుచుండ శ్రోతలందరును నాశ్రుతిమధుర, సుందరకావ్యమును మిక్కిలి యుత్కంఠతో శ్రవణము చేయుచుండిరి. దానిలో నవరసముల వర్ణనమునుగలదు. దానిలోని పదములు సుందరములనియు నర్థగాంభీర్యమును నలౌకికముగ నుండెననియు వినగానే శ్రోతలందరును గ్రహించు చుండిరి. రామాయణ మునంతను వినిన మీదట శ్రీరామచంద్రుడును, సమస్త శ్రోతలును సీలవ కుశులు సీతాపుత్రులని గ్రహించిరి. రామాయణమందు వీ రందరి వర్ణన మును వచ్చినది. ఈ యశ్వమేధయాగమువరకు జరిగిన వృత్తాంతమందు గానము చేయబడినది. తరువాత కథను వినిపింపవలదని ముని నిషేధించి యుండెను.

అంతిమ దినమున వాల్మీకిభగవానుడు సభకు రాలేదు. అప్పుడు భగవానుడు సభాసదులందరును వినుచుండ నందరి సమ్ముఖమున దన తమ్ముడగు లక్ష్మణునితో నిట్లనెను:—“ సౌమిత్రీ! నీవు రామాయణమందు

వింటివిగదా! ఈ సుందర కుమారులిద్దరును సీతాపుత్రులనియు ఈకావ్య శ్రవణముచే సీత సర్వథా శుద్ధయనియు తోచుచున్నది."

ఇది విని శ్రోతులందరును నేకకంఠమున నిట్లనిరి:-"ఈకుమారులిద్దరును మాకు ప్రభువులు. వీరురఘువంశకీర్తిని వృద్ధిపొందించువారు. వీరు సీతాభగవతీ పుత్రులు. సీతామాత సర్వథా శుద్ధ. ఆమెను విడుచుట ఘోరమైన అన్యాయము. మేమీ యజ్ఞమందు జగజ్జనని జానకిని దర్శింప దలచు చున్నాము."

ఇది విని శత్రుఘ్నుడు చేతులు జోడించి నిలుచుండి యిట్లనెను:- "మధువనమునకు లవణాసురుని జంపబోయినపుడు నేనొక రాత్రి వాల్మీకి భగవానుని ఆశ్రమమున నిలిచితిని. ఆ దినమున సీతామాత నే నచ్చట నున్న రోజుననే యమళ పుత్రులను గనినది. వీరు సీతాదేవి పుత్రులు. అందరును జూచుచున్నారు.

శ్రీరామునకును, వీరి రూపములకును భేదములేదు. దానంతట అది బయటబడు వరకును నెవరికిని బయట బెట్టరాదని శ్రీవాల్మీకి భగవాను డాదేశించియుండెను."

అంత నేడ్చుచు లక్ష్మణు డిట్లనెను:—"నేను మీయాజ్ఞచే మాతను విడుచుటకు వెడలినపుడామె యేడ్చుచు నిట్లనెను :—"లక్ష్మణా! నీవు నాయుదరమును జూచుచుబొమ్ము. నేను గర్భిణిని. తరువాత నామీద నపవాదములు పెట్టరాదు. ప్రపంచము బహుముఖముగ నుండును."

ఇది వినగానే అందరును నేడ్వసాగిరి. అందరు నేక స్వరమున నిట్లనిరి:-"సీతాదేవి గంగాజలమువలె శుద్ధ. ఆమెను గూర్చి చెడ్డగాబలికిన యేడల్ల నాతని జిహ్వ రాలిపోవుగాక!"

అంత హనుమంతుడులేచి నిలుచుండెను. ఆతడిట్లనెను:—" రఘు నందనా! వీరు తప్పక మీపుత్రులే. ప్రపంచమందు నేటి వరకెవ్వడును నన్ను బరాజితుని గావింపలేదు. కాని యీ యిద్దరు పిల్లలు మాసేన నంతను హతమార్చినారు. మమ్ముల నందరను మూర్ఛితుల నొనర్చి, సాధారణ వానరులవలె గుర్రపు తోకకుగట్టి ఆశ్రమమునకు గొనిపోయిరి. అచ్చట సీతామాత మమ్ములను విడిపించి యేడ్చుచు మాతో నిట్లనినది.— "నాప్రభువు తన కీర్తిని రక్షించుకొనుటకై అపరాధము లేకయే నన్ను త్యజించినాడు. నేనాతని దాననే. ఆతనికీర్తి రక్షణకై నేనుపయోగపడినచో నింతకంటె నాకు సౌభాగ్య కారణమేమి యుండును. నానాథుని కొరకై నేను సమస్త విడంబనలను సహింపగలను." సుగ్రీవుడును హనుమంతుని వాక్యములను నిలుచుండి సమర్థించెను.

అందరిమాటలను విని రుద్ధకంఠముతో శ్రీరాముడు లక్ష్మణునితో నిట్లనెను:— "సుమిత్రానంద వర్ధనా! లక్ష్మణా! సోదరా! అందరి కిష్టమగుచో నీవు వాల్మీకి భగవానుని సమీపమునకుబోయి, వారికుచితమని తోచినచో సీత నిచ్చటకు బిలిపింపుమనుము. సీత అందరి సముఖమున దన శుద్ధత విషయమై శపథ మొనర్చుగాక!"

ఇది విని అందరును "అయ్యో! అయ్యో!" అనసాగిరి. వారిలో వారిట్లనుకొనిరి:-" శ్రీరామచంద్రుడత్యంత కోమలస్వభావుడే, ఎందులకో గాని సీతయెడల నింతటి కఠోరమును వహించినాడు. గంగాజలము వలె విశుద్ధయైన యామె అందరి సమ్ముఖమున దన విశుద్ధతనుగూర్చి శపథ మెట్లు చేయగలదు?" అందరును సీతను ప్రశంసింపసాగిరి. లవకుశుల యెడల సమ్మానమును బ్రదర్శింపసాగిరి.

లక్ష్మణుడును భగవానుని యాజ్ఞను శిరసావహించి వాల్మీకి భగ వానుని నివాసమునకు వచ్చి ఇట్లనెను:-"ప్రభూ! సమస్త ప్రజల కోరికచే.

శ్రీరాముడు సీతను నింద సభలో నందరి సముఖమున జూడగోరు చున్నాడు. మీకుచితమనితోచి, ఆజ్ఞయొసంగినచో, జానకిని యిచ్చటికి రప్పింపుడు. మీరు మీ శిష్యులనుబంపి సీతను మీకడకు బిలిపింపుడు."

వాల్మీకి భగవానుడిట్లనెను:—" సీత శుద్ధ. శ్రీరాముడు నరనాట్య మొనర్చుచున్నాడు. మంచిది వారి యిష్టము. వారికెట్లానందముగనుండిన అటులనే. ఇది సీతావిడంబనము. ఇది ఆమెకు గొప్ప అవమానము. కాని పతివ్రతయగు స్త్రీ పతి ప్రసన్నతకొరకు సమస్తమును సహించును. రాముడు కోరినచో సీతను; కాని శిష్యులద్వారమునగాదు. సీతను నీవే వదలివచ్చితివి. నీవేరాముని ఆరథమునే తీసుకొని పోయి ఆమెను బిలుచు కొని రమ్ము. ఆమె రాగలదనియే నా విశ్వాసము."

ముని యాజ్ఞను శిరసావహించి లక్ష్మణుడు రథమును దీసికొని స్వయముగ వాల్మీకి మహాముని ఆశ్రమమునకు వెడలెను. అచ్చట దపస్వి నులతో పరివేష్టింపబడి, వల్కల వస్త్రమును ధరించి, రామవిరహమున దుర్బలయైయున్న సీతకూర్చుండి యుండెను. లక్ష్మణుడు దూరమున నుండియే భూమి మీదబడి ఆమెకు ప్రణామమును గావించెను.

లక్ష్మణ్మునిగాంచి సీత యిట్లనెను:—"రామానుజా! లక్ష్మణా! చెప్పు నాయనా! నీకు కుశలమేనా? మీప్రభువు బాగున్నారా? మీ యజ్ఞముబాగుగా జరుగుచున్నదా? కులపతియగు వాల్మీకియును దన శిష్యులతో మీ యజ్ఞ మును జూచుటకు వెడలియున్నారు. వారును సమస్త మునులతో కుశ లముగ నున్నారా? నీవు రథమునెక్కి యెచ్చటికిబోవుచున్నావు? అభాగిని నగు నేను నీకెట్లు జ్ఞాపకమునకు వచ్చినాను? నీవు దారితప్పి యిచ్చటికి రాలేదుకదా?"

లక్ష్మణుడేడ్చుచు నిట్లనెను:-" అమ్మా! నీవు నన్ను లజ్జితు నౌనర్పకుము. సేవకుని ధర్మము చాల కఠోరమైనది. నేను శ్రీరాముని కఠోర శాసనమువలన నీ దర్శనమునుగూడ చేయజాలక పోయితిని. శ్రీరామచంద్రుడు నిన్ను జూడ గోరుచున్నాడు. ఆతడు దేశదేశాంతరముల రాజుల సమ్ముఖముననను, సమస్త ఋషిమునుల సమ్ముఖముననను, ప్రజల లోని ఆబాలవృద్ధులగు నరనారీ సమ్ముఖముననను నీయొక్క విశుద్ధను జూపింపదలచు చున్నాడు."

ఇది విని అశ్రువులను దుడుచుకొనుచు సీతాదేవి యిట్లనెను:- "సుమిత్రానంద వర్ధనా! లక్ష్మణా! ఇప్పుడు నన్ను మీస్వామి యేమి చూడగలడు. ఇప్పుడు నేను ధర్మార్థ కామ హీననై భిక్షువునై యీవన మందున జీవితమును గడుపుకొనుచున్నాను. నావలన వారి కేమి సేవ జరుగగలదు? స్వర్ణసీతతో వారు యజ్ఞమును బూర్తిచేసుకొనుచున్నారు. ఇప్పుడు నేనెట్లు వారిప్రక్కన యజ్ఞమండపమునకువచ్చి కూర్చుందును. బయటనుండి వచ్చినరాజుల సమ్ముఖమున నాముఖము నెట్లు చూపింప గలను? నాతండ్రియును యజ్ఞమునకు వచ్చియుండును. ఆతని యెదుటకు నేనెట్లు పోగలను? లక్ష్మణా! నన్ను సిగ్గుపరచుట కచ్చటికేల గొనిపోయె దవు? వివాహసమ్యంమునను‌న్న శ్రీరామచంద్రుని మనోహరమూర్తి హృదయపటలమందంకితమైనది. అది మరణ పర్యంతము మాసిపో జాలదు. దానినే నిరంతరమును జింతించుచు, రామనామ జపమును జేసి కొనుచు దపస్సుద్వారా నాశరీరముకు విడిచెదను. ఇప్పుడు నన్నాటబొమ్మ గానేల జేసెదవు? మహారాజు నా కేమి యాజ్ఞాపించినాడు?"

లక్ష్మణుడిట్లనెను:-" దేవీ! నాకు శ్రీరామచంద్రుడు నీ కొరకేమి యును నాజ్ఞాపింపలేదు. వాల్మీకి భగవానుడిట్లు చెప్పెను:-"ఆతడు

చిత్తమనితోచిన సీతను బిలిపించుకొనవచ్చును" ముని నాతో నిట్లనెను:- "నీవు పోయి సీత వచ్చెదనని దీసికొనిరమ్ము. వారి ఆజ్ఞచే నేనిచ్చటకు వచ్చితిని. ఇప్పుడు నీవేమి యాజ్ఞాపించిన దానినే చేయుదును. నాపని అందరి యాజ్ఞలను బరిపాలించుటయే. మా అన్నదమ్ములందరిలో నేనే యభాగ్యుడను. ఇట్టి కఠిన కార్యములను నేనే చేయవలసి వచ్చుచున్నది."

ఇది విని అత్యంత దీనతాస్వరమున జానకి యిట్లనెను:-" నేను నీపాదములమీద బడెదను. మహారాజువారి ఆజ్ఞయగుచో నేను తలబరువుగ రావలసియుండును. నాయిచ్ఛచే నేను రాదలచుటలేదు. అచ్చటికి నన్నిప్పుడు తీసికొని పోవలదు. స్త్రీలకు ముఖ్యప్రయోజనము పుత్రోత్పత్తియే. శ్రీరామునకా యీ ప్రయోజనము సిద్ధించినది. ఆతని తేజస్సుచే నిద్దరు పుత్రులు కలిగిరి. వారు మీ యజ్ఞమందుండనే యుండిరి. వారిని వారు విశుద్ధులుగ భావించుచో దమసమీపమున నుంచుకొననిండు. నేను దాసివలె లాలన పాలనమొనర్చి వారినింతవారిగా జేసినాను. ఇప్పుడు వారు రాజ్య కార్యముల నిర్వహింపయోగ్యులైరి. మహారాజు కార్యములకు సహాయ పడగలరు. ఇప్పుడు నన్నిచ్చటనే పడియుండనిండు. ఎన్నడైన సీత చచ్చినదని వినగానే అప్పుడు నీవు కొంచెముగ గన్నీటిని వదలుము" ఇప్పుడిది నాచివర సమావేశమని గ్రహింపుము. మరదీ! నేను నిన్ను దోష మెంచుటలేదు. నా ప్రారబ్ధదోషము. నేనెట్లు శ్రీరామాజ్ఞకధీననో అట్లే నీవును. నీవుపోయి మహారాజు చరణములకు నాప్రణామములను జెప్పుము. యజ్ఞమునకు విచ్చేసిన పూజ్యజనులకు నాకు బదులుగా బ్రణామము లాచరింపుము. నా తోడుకోడండ్ర కుశలమడుగుము. నా బిడ్డలకు నాప్రేమాశీర్వాదమును జెప్పుము. నన్ను తలవవలదని వారికి జెప్పుము. నేను వారికి దాసినని."

ఇది వినగానే లక్ష్మణుడేడ్వసాగెను. ఆతనికి సిగ్గు బిడియములు పోయెను. ఆతడు బాలకునివలె వెక్కి వెక్కి రోదనము చేయుచుండెను. ఆతని నోదార్చుచు సీతయిట్లనెను:—" లక్ష్మణా! నీవు పురుషుడవయ్యు నింత యధీరుడవైతివేల? నేనబలనయ్యు నాహృదయము రాయిచేసికొని పతివియోగము నిన్నాళ్ళనుండి సహించుచుంటినే. పొమ్ము. భగవంతుడు నీకు మేలొనగూర్చుగాక! అందరతో నాసందేశమును దప్పక జెప్పవల యును సుమా!"

ఇది విని లక్ష్మణుడు జానకికి బ్రణామమును గావించి, ఆమెకు బ్రదక్షిణమొనర్చి, రథముపై నెక్కి శ్రీరాముని సమీపమునకుబోయెను. అచ్చటకువచ్చి సమస్త వృత్తాంతమును జెప్పెను. విని శ్రీరాముడు స్తంభితుడై కొంచెము సేపు గంభీరముగ నాలోచించి, చివర కిట్లనెను:- "లక్ష్మణా! నీవుమరలబొమ్ము. ఈసారి సీతకు నా సందేశమును జెప్పవల యును. ఇట్లు చెప్పుము:-"దేవీ! వనమందుండి తపస్సుద్వారా నీవు నన్నే పొందగోరుచున్నావు. నేనుగాక నీకింకొక గతియున్నదాయేమి? గర్భవతి విగా నుండగా నీవే వనమునకు బోవలయునను కోరికను బ్రకటించితివి. వనములోని తపస్వినులను మునిపత్నులను బూజింపవలయునని నీవేకోరు కొంటివి. నేను నీ కోరిక ననుసరించియే వనములకు బంపియుంటిని. ఇప్పటికి చాల దినములనుండి నీవు మునిపత్నులసేవ యొనర్చితివి. వన ములో నివసించి అచ్చటి యానందమును జూరగొంటివి. ఇప్పుడు నేనే నిన్ను మరల బిలుచుచున్నాను. నీవురమ్ము. నేను మానసికముగ నీయె డల సంతోషముగనే యున్నాను. నాకు నీయెడల బూర్వమువలెనే బ్రేమ యుండుటయేకాదు, నీయొక్క తపస్సు, వ్రతము,తీర్థ సేవనము, దానము, ధర్మము, దయా దాక్షిణ్యా త్యాగాదులవలన యింకను నధికమైనది. పతివ్రతలగు బత్నులకు పతియేగతి, పతియేవారికి సర్వస్వమును. వారింటిలో

నుండినను, వనమందుండినను, పతియే వారి కారాధనీయుడు. ఇప్పుడు నేను నిన్ను బిలుచుచున్నాను. వాల్మీకి భగవానునితో గూడ నీవు నిస్సంకోచముగ నా సమీపమునకు రమ్ము."

లక్ష్మణుడు శ్రీరాముని వాక్యములను శ్రద్ధగా వినెను. వానిని ధారణచేసికొని, ఆతని యాజ్ఞచే మరల యథాప్రకారముగ రథముపై గూర్చుండి వాల్మీకి భగవానుని ఆశ్రమమునకు వచ్చెను. మరల లక్ష్మణుడు వచ్చుటనుగాంచి సీతాదేవి యీసారి తప్పక వెళ్ళవలసివచ్చునని గ్రహించెను. లక్ష్మణుడు చేతులను జోడించుకొని స్ఖలిత వాక్కులతో భయపడుచు శ్రీరామచంద్రుని సందేశమునంతను వినిపించెను. ఆతని శరీరము కంపించుచుండెను. నేత్రములనుండి నిరంతర మశ్రువులు ప్రవహించుచుండెను. సీతాదేవి ఆతని వివశతను. ఆత్మగ్లానిని దెలిసికొనెను. ఆమె యేమియును ప్రత్యుత్తరమీయక 'మంచిది వచ్చుచున్నా' ననెను.

కుటీరములోనికిబోయి ఆమె కుటీరముయొక్క అధిష్ఠాతృ దేవతకు ప్రణామము గావించి, ఆశ్రమములోని పెంపుడు జంతువులను బుజ్జగించి, వృక్షముల వైపునకు సతృష్ణా నయనములతో జూచి, పెద్దవారును, వృద్ధులునగు దపస్వులకు నమస్కరించి, మాటిమాటికిని మునిపత్నులను గలిసికొని, ఆమె వెళ్ళుటకు బయలుదేరెను. ఆమెకు హృదయమున దుఃఖముప్పొంగెను. తపస్వినులగు మునిపత్నులామెను దూరము వరకు బంపి వచ్చిరి. వారు మాటిమాటికిట్లనిరి:—సీతా! మరలనెప్పుడు కలియుదము. ఇప్పుడిక మరల రాణివయ్యెదవు. మరల నింక నీవనమున కేలవచ్చెదవు? ఇక మమ్ములను మరచిపోయెదవు." జానకిదేవి విని యేడ్చుచుండెను. ఆమె వాక్కులాగిపోయెను. ఆమె ఒక్కమాటైన మాటలాడజాలకుండెను. ఆశ్రమము బయటకువచ్చి ఆమె మరల నొకసారి సమస్తాశ్రమమునకును

నంతిమ ప్రణామమునుగావించి రథమునపై నెక్కెను. లక్ష్మణుడు రథమునుదెచ్చి వాల్మీకి మహాముని నివాసముకడ నాపివైచెను. కుశలవులు తమతల్లి వచ్చుటనుగాంచి పరుగెత్తుకొని రథము సమీపమునకువచ్చి "అమ్మా అమ్మా!" యని ఆమెను జుట్టుకొనిరి.

సీతాదేవి లజ్జించుచు ముందుగా వాల్మీకి భగవానునకు ప్రణామము కావించి పిదప సమస్త మునులకు జరణవందనమునుగావించి, ఒక ప్రక్కన సిగ్గుతో ముడుచుకొని కూర్చుండెను. లక్ష్మణుడు సీతనచ్చట దించి మునియాజ్ఞను గైకొని వెడలిపోయెను. సమస్త సమాచారమును నాతడు శ్రీరామచంద్రునకు నివేదించెను. శ్రీరామచంద్రు డిట్లనెను:-" సీతాదేవి రేపు మునితో నిండుసభలోనికివచ్చి తన శుద్ధతాసంబంధమున నందర సముఖమున ధర్మపూర్వకముగ శపథమొనర్పవలయును." ఆతడు సేవకులద్వారా యీ సందేశము వాల్మీకి భగవానుని సమీపమునకు బంపెను. తపోధనుడగు మహర్షి దీనిని సహర్షముగ నంగీకరించెను. నేడు లవకుశులు మిక్కిలి యుల్లాసముతో దల్లికి యజ్ఞమంటలి సమస్త సమాచారమునుజెప్పి మరియు నిట్లనిరి:-" తండ్రిగారు మా గానమును మిక్కిలి ప్రేమతో విని, మమ్ముల మిక్కిలి ప్రేమించినారు."

ఇదివినగానే సీతాదేవికి పరమ సంతోషము కలిగెను. ప్రాతఃకాలమయ్యెను. ఋషి నిత్యకర్మలనుండి నివృత్తు డయ్యెను. ఇచ్చట శ్రీరామచంద్రుడును నేడందరు ఋషులను, మునులను, రాజులను, మహారాజులను, ప్రజలలోని సమస్త వర్గములవారిని విశేషరూపమున బిలిపించెను. సభనిండిపోయెను. దానిలోనికి బ్రవేశించుట కెవరికిని నాటంకములేదు. అందరకును స్థానము లేర్పరుపబడెను. అందరును నుత్సాహముతో సీతాదేవి యాగమనమునకై ప్రతీక్షించుచుండిరి.

హఠాత్తుగ నొకగొప్ప కోలాహలము జనసమూహమునుండి బయలు దేరెను. అగాధ సముద్రములో సుడి బయలుదేరినట్లును, తుఫాను చెల రేగినట్లును నాకోలాహలముండెను. కొందరు తలలెత్తి చూడసాగిరి. కొందరు నిలుచుండిరి. కొంద రరపసాగిరి. కూర్చుండుడు, కూర్చుండు డనుచు గేకలిడుచుండిరి. రాజ సింహాసనమునకు సమీపమున వశిష్ఠ, వాసుదేవ, జాబాలి, కాశ్యప, విశ్వామిత్ర, దీర్ఘతపా, దుర్వాస, పులస్త్య, శక్తి, భార్గవ, వామన, మార్కండేయ, మౌద్గల్య, చ్యవన, శివానంద, భరద్వాజ, గౌతమ, సువ్రభ, నారద, పర్వతాది ఋషులును, మహర్షులును, దేవర్షులును, రాజర్షులును, మునిపుత్రులు, శిష్య ప్రశిష్యులచే బరివేష్ఠింపబడి కూర్చుండి యుండిరి. పరమ తేజస్వి ప్రచేతసుని పుత్రుడగు వాల్మీకి భగవానుడు గంభీరముగ రాజ సభయందు బ్రవేశించుట నందరును గాంచిరి. ఆతని ముందు కుశలవు లిద్దరును జేతులలో వీణలను గ్రహించి రామాయణమును గానముచేయుచుండిరి. వారు ఉత్తరాకాండమందు సీతా పరిత్యాగ ఘట్టమును గానము చేయుచుండిరి. లక్ష్మణుడామెను నిర్జనవన మున వదలివైచెను. జానకీదేవి యేడ్చుచు బతిదేవునకు దన భక్తిని బ్రక టించు చుండెను. మునియొక్క శాంత గంభీర ముఖమండలమం దొక యపూర్వమగు ప్రకాశము వెల్లివిరియుచుండెను. ఆతడు తన తేజస్సుచే నపరసూర్యునివలె బ్రకాశించు చుండెను. కుశలవులు తన్మయముతో వీణా ధ్వని యందు తమ సుమధుర స్వరమును గలిపి నిర్భయులై గానము చేయుచుండిరి. మునివెనుక లజ్జచే గ్రుంగి ముడుచుకొని, ముసుగువైచుకొని చేతులు జోడించుకొనుచు సీతాదేవి వచ్చుచుండెను. ఆమె యెవరి వైపున కును దలయెత్తి చూచుటలేదు. రామరూపమును జింతించుచు, నోట మెల్లమెల్లగా రామమంత్రమును జపించుచు, నేత్రములనుండి అవిరళముగ నశ్రువులను గార్చుచు సీతాదేవి ముని ననుగమించు చుండెను. ఆమె

బ్రహ్మవెంట శ్రుతి వచ్చుచున్నట్లును, బృహస్పతివెంట బలినివియోగముచే దుఃఖితయైన శచీదేవి వచ్చుచున్నట్లును, సాక్షాత్తుగ సజీవ శాంతరసము వెనుక గరుణారసము వచ్చుచున్నట్లును నుండెను. సీతనుగాంచి అందరును సాధుసాధు అనిపలుకసాగిరి. అందరును నేడ్వసాగిరి. కొందరు రాముని ధైర్యమును బ్రశంసించుచుండిరి. కొందరిద్దరియొక్క ప్రేమ, గుణగాన మొనర్చుచుండిరి. చాటుననుండిన భరత, లక్ష్మణ, శత్రుఘ్నుల పత్నుల తమ పెద్దతోడుకోడలను దాతసీ వేషముఁగాంచి వెక్కివెక్కియేడ్వదొడ గిరి. రాజాంతః పురస్త్రీలు బిగ్గరగ నేడ్చుచుండిరి. ఆసభయందు ధైర్యము సడలని వారొక్కరైనను లేరు. కేవల మొక్క రామచంద్రుడే అత్యంత గంభీరతతో నిర్వికారుడుగ మెదలక కూర్చుండెను. ముని నాద రించుటకును, జగజ్జననికి సత్కారమొనర్చుటకును నందరులేచి నిలు చుండిరి. శ్రీరామచంద్రుడు సింహాసనము మీదనుండి లేచి మునికిస్వాగత మొసంగెను. వారు కూర్చుండుటకై ఒక దివ్యమగు నాసనము నొసంగెను. ముని బాలకుల నిద్దరను సమ్ముఖమున గూర్చుండబెట్టుకొని, సమస్తమును లకును గృతజ్ఞతను బ్రకటించుచు గూర్చుండెను. సీతాదేవి ముఖమును గప్పుకొని, యేడ్చుచు. కొంచము వంకరగా ఒరిగి ముని సింహాసనమును బట్టుకొని వెనుకను నిలుచుండెను ఆమె లోలోన దన యారాధ్యదేవుని చరణకమలములకు బ్రణామము గావించెను. ఆమె తన ముసుగునుండియే శ్రీరామచంద్రుని దర్శింపదలచుచుండెను; కాని ఆమెనేత్రద్వయము నిరంతర మశ్రుపూర్ణమైన కారణమున శ్రీరామచంద్రుని బాగుగా జూడజాలక పోవు చుండెను. ముని పిల్లలిద్దరితో నిట్లనెను:—" నాయనలారా. మీరెబోయి మీతండ్రికి బ్రణామ మొనరింపుడు." ముని యాజ్ఞచే బిల్లలిద్దరును సింహా సనము సమీపమునకు బోయి, తలవంచి శ్రీరామచంద్రుని చరణములకు బ్రణామము కావించిరి. మర్యాదా పురుషోత్తముడగు రాముడా పిల్లలను

స్పర్శింపలేదు. పిల్లలు మరల వచ్చి ముని చరణకమలములకడ గూర్చుండిరి.

వెనుక నేడ్చుచు నిలుచుండిన సీతను గాంచి ముని గద్గద వాక్కులతో "అమ్మా ! కూర్చుండు మమ్మా !" యనెను.

ముని యాజ్ఞానుసారముగ బిల్లలకు క్రిందుగా ముని చరణముల కడ కూర్చుండెను. ఆమె నిరంతరము భూమివైపునకే చూచుచుండెను. తన పాదాంగుష్ఠముతో తనకొరకై వివరమును వెదకుకొనుచున్నదా యను నట్లామె భూమిని త్రవ్వుచుండెను. కోలాహలము శాంతింపగనే అందరును యథాయోగ్యముగ గూర్చుండగనే వృద్ధ ముని తన సింహాసనము నుండి లేచి నిలుచుండెను. ముని లేవగానే కోలాహలము సర్వథా శాంతించెను. ఆ సమయమున నొక సూది క్రిందబడినను దాని శబ్దము వినబడు వినబడుచుండెను. అందరును మిక్కిలి యుత్సాహముతో మహా ముని యగు వాల్మీకి భగవానుని ముఖమువైపు చూచుచుండిరి. అందరును నాతని ముఖమున సీతా సంబంధమున నేమి వెలువడునో వినవలయునని మిక్కిలిగ నువ్విళ్ళూరుచుండిరి. ముని శ్రీరామచంద్రుని సంబోధించుచు మేఘ గంభీర భాషణముల దన యభిప్రాయమును వ్యక్త మొనర్ప నారంభించెను.

ముని యిట్లనెను:—"రాఘవా ! ఈమె నీ ధర్మపత్ని యగు సీత. ఈమె పవిత్ర, నిర్దోష, ఈమె నీ ధర్మచారిణి, తపస్విని. ఈమె గొప్ప గొప్ప వ్రతములను బాలించినది. నీవు లోకోపవాద భయముచే నీమెను బరిత్యాగము కావించితివి. నీ కీమె పవిత్రతత విషయములో నే మాత్రము సందేహము లేకున్నను, లోక దృష్టిచే నీమెను బరిత్యాగము కావించితివి.

ఈమె గర్భిణిగా నుండగా నీమె లక్ష్మణుని ద్వారా మా యాశ్రమ సమీప మున వదలబడినది. ఆ మా యాశ్రమమున నుండి ధర్మపూర్వకముగ జీవనమును గడిపినది. ఈ పిల్లల నిద్దరను గనినది. వీరు ధర్మపూర్వక ముగ నీకు బుత్రులు. సీత విశుద్ధ. ఈమెలో నేమాత్రము దోషములేదు. అందరును వినుడు. నన్ను వాల్మీకి యందురు. నేను గంగాతటమున నివసించు చుందును. ప్రచేతసుల పదవ పుత్రుడను. నేను నాకు తెలిసి యున్నంతవరకు నవ్వటాలకైనను నబద్ధమాడినట్లు గుర్తు లేదు. నేను వేలకొలది సంవత్సరములు తపస్సును జేసియున్నాను. సీతా పాతివ్రత్య విషయమున నేమయినను సందేహము లున్నయెడల నా తప స్సంతయును నాకు జెందకుండుగాక ! సీతయందేదైనను దోషమున్నచో నసత్యమును బలుకువారి కే నరకములు ప్రాప్తించునో అవి ప్రాప్తిం చును గాక ! నేను మనో వాక్కాయములచే నెన్నడును బాపము నొనర్ప లేదు. సీత పాపిని యగుచో నాకీ ధర్మాచరణమువలన నేమియును ఫలము కలుగకుండుగాక ! నేను గొప్ప గొప్ప యజ్ఞానుష్ఠానముల నొనర్చితిని. సీత పాపరహిత కానిచో నవియన్నియును నిష్ఫలములగుగాక! నాతపః ప్రభావముచే నేను భూత భవిష్యద్వర్త మానములను దెలిసికొనగలను. సీత మొట్టమొదట మా యాశ్రమ నికటమున గనబడినప్పుడు నేను సమాధిద్వారా ఆమెయొక్క పవిత్రతను దెలిసికొంటిని. అందువలననే నే నీమెకు మా యాశ్రమమున నాశ్రయమిచ్చితిని. రాఘవా! సీత ధర్మ చారిణి దశరథపుత్రా! నీ తండ్రి నన్నెక్కువగ సమ్మానించెడువాడు. సీత గంగాజలమువలె బవిత్రయని నేను నీకు విశ్వాసమును గలిగించు చున్నాను. ఈమె నిన్నే తన యిష్టదైవముగను, సర్వస్వముగను దలచు చుండును. ఈమె స్వయముగ మీ అందర సమ్ముఖమున దన పాతి వ్రత్యమును గూర్చి విశ్వాసమును గలిగింపగలదు."

ఇట్లుపలికి ముని యాసనమున గూర్చుండెను. ముని కూర్చుండగానే చేతులను జోడించుకొని శ్రీరామచంద్రుడు సింహాసనమును నుండి లేచెను. ఆతడు భయపడుచుండెను. ఆతని శరీరము కంపించుచుండెను. ఆతని శబ్దము స్పష్టముగ వచ్చుటలేదు. ఆతడు వాల్మీకి భగవానుని సంబోధించుచు సీతవైపు చూచుచు నిట్లనెను:- "ప్రభూ! మీరు చెప్పినది పూర్తిగా సత్యము. మీ వచనముల మీద నాకు బూర్ణ విశ్వాసము కలదు. సూర్యుడు పశ్చిమమున నుదయించుగాక. చంద్రుడగ్నిని వెడలగ్రక్కుగాక. జలము తన శీతలతాగుణమును వదిలిన వదలునుగాక, కాని మీరసత్యమాడుట సంభవింపదు. మునివరా! నేనత్యంత మభాగ్యుడను. మీవంటి తపోధనులు సీతాశుద్ధతా సంబంధమున నాసమ్ముఖమున నింతటి గొప్ప గొప్ప శపథము లొనర్చినారు. స్వామీ! ఈ నా భార్య పతివ్రత యను విషయము నాకు బాగుగాదెలియును. ఈమె కెన్నడును దోషము సంభవింపలేదు. లంకయందు వైదేహి సమస్త దేవతల సమ్ముఖమున నగ్నియందు ప్రవేశించి తన పవిత్రతను ప్రకటించుకొనినది. దేవతలు చెప్పుటచే నేను పాపరహితయగు నాపత్నినింటికి దెచ్చుకొంటిని. అయినను నాదౌర్బల్య కారణమున లోకాపవాద భయముచే నేనీమెను బరిత్యజించితిని. మీరు తలచుకొనిన నీయపరాధ కారణమున నాకు శాపమొసంగి భస్మము చేసియుందురు, కాని మీరు నా యీ యపరాధమును గమనింపనే లేదు. నన్ను క్షమించితిరి. ధర్మచారిణియగు జనక కుమారికాశ్రయ ప్రదానము కావించితిరి. ఈమె మీ చరణచ్ఛాయ యందుండి ధర్మపూర్వకముగ నుండెను. మీరీమెకు తండ్రివంటివారే. మీరు నాకు తండ్రికి మించినవారు. ప్రభు! మాతండ్రి వడిలోనుండి మేము మీ యుపదేశము లను వినుచుండెడువారము. తండ్రిగారు మమ్ములను మీచరణములందు బడవైచినపుడు మీరు మమ్ము ప్రేమ పూర్వకముగ వడిలోనికి దీసికొనెడు వారు. మమ్ములను ముద్దిడుకొని ప్రేమించెడువారు. మీరుమాతండ్రిగారికిని

బూజసేయులు. నేను మీయాజ్ఞను శిరసావహించెదను. లోకాపవాదమునకు భయపడియే నేను బతిప్రాణయు, నయో నిజయునగు జానకిని బరిత్యాగము కావించితిని. వీరిద్దరును నా పుత్రులే, ఈవిషయము నాకు బాగుగాదెలియును. సీత యశుద్ధయని నే నెన్నడును దలపలేదు. ఇప్పుడును దలచుట లేదు. అయినను నేడందరును సీతశుద్ధయనిననే గ్రహించెదను. ఒక్కని మనస్సులోనైనను నీమెయెడల సందేహము కలిగినయెడల నేనీమెను గ్రహింపను. సీత అందర సమ్ముఖమున దన శుద్ధతా విషయమున శపథ మొనర్చునుగాక! అందరీమెను శుద్ధయని భావించినచో నీమె మరల నట్లే నాకు ధర్మపత్నిగానుండగలదు."

శ్రీరామచంద్రుడు పలికిన నీకఠోర వాక్యములను విని అందరు నయ్యో! అయ్యో! యని యేడ్వసాగిరి. అందర చిత్తములు దుఃఖమును జెందెను. అందరు నేడ్వదొడంగిరి. అప్పుడు వాల్మీకి యెదురుగా గుడిబొమ్మవలె సిగ్గుతో ముడుచుకొని కూర్చుండిన సీతతో సరళముగ నిట్లనెను:– "అమ్మా! నీవందరముందర నీపాతివ్రత్య విషయమున శపథము నొనర్పుము నీవు బూర్ణముగ శుద్ధవని ప్రపంచమంతయును దెలిసి కొనుగాక!"

లజ్జాకారణమున శిరస్సును బైకియెత్తనిదియును, ఆత్మ గ్లాని కారణమున నెవరికిని దన ముఖమును జూపింపదలపనిదియును, సంకోచముచే జుట్టుకొని పోయినదియు; విపశతా కారణమున దనశరీరమందే తాను విలీనమగు ప్రయాస మొనర్చుకొనునదియునగు భూజాతయగు సీత లేచెను. ఆమె కాషాయ వస్త్రమును ధరించియుండెను. ఆమె కష్టముగ లేచెను. ముని చరణములకు బ్రణామ మొనరించి ఆమె రామచంద్రుని వైపునకు నడచెను. సభికులు కనురెప్పలార్పక సీత వైపుననే చూచుచుండిరి. కొంచెము ముందుకుబోయి, భూమికి శిరస్సునుమోపి దూరమున

నుండియే జానకి తన హృదయ ధనమగు శ్రీరాముని చరణములకు మ్రొక్కి ఆమె ఉత్తరముఖముపెట్టి నిలుచుండెను. శ్రీరాముడు తూర్పు ముఖముగ గూర్చుండియుండెను. వాల్మీకి భగవానుని ముఖము పశ్చిమముగ నుండెను. మధ్యలో దక్షిణమునకు వీపునుబెట్టి జానకిదేవి నిలుచుండెను. ఆమె పాదములు తడ బడుచుండెను. ఆమె రెండుచేతులను జోడించుకొనియుండెను. వాయుప్రసారముచే నామె కాషాయవస్త్రము కదలుచుండెను. కమలదళ సదృశములగు నామె నేత్రములందు జలము నిండి యుండెను. ఆమె తనపుత్రులకు గొంచెము దూరములో నిలుచుండెను. ఆమె యెవ్వరిని సంబోధింపలేదు. ఆమె భూమి వైపునకు జూచుచు నాగి యాగి యిట్లనెను:- "నేను శ్రీరాఘువునిగాక యెన్నడైన స్వప్నమందైన, మనస్సులోనైన పరపురుషుని జింతించి యుండనిచో దేవీ! విష్ణుపత్నియగు నోభూదేవీ! నన్ను నీ వడిలోనికి గైకొనుము. ఇతరులకు జెరుపు దలపని వాడొక్కడును నీ ప్రపంచమున నుండబోడు, ఒక్కవ్యక్తి నామీద గళంకమాపాదించినను నన్ను స్వీకరింపరట. ఈనిందా ప్రియమగు ప్రపంచమందుండుట యోగ్యముకాదు. నిజముగ నామీద నసత్య కళంకమునే ఆపాదించియుండినచో నాకు నీలో స్థానమొసంగుము, నేను సర్వదా, సర్వత్ర, సమస్తావస్థలందు మనో వాక్కాయ కర్మలచే శ్రీరామునే పూజించుచుండినచో శ్రీరామునిదప్ప నేనెవరిని మనస్సులోనైన గోరకుండినచో అమ్మా! ఇప్పుడు నన్ను శాశ్వతముగ నీలోజేర్చుకొనుము. ధరణీ! నీవందరను ధరించుదానవు. అంతము నందందరకును నీవేగతి, అందరును నీపైననే పుట్టుదురు. నీలోననే కలియుదురు. నేను నిజముగ రామునే నాయిష్టారాధ్యముగను సర్వస్వముగను దలచి యుండినచో, నన్ను బవిత్ర పుత్రిగా భావించి స్వీకరింపుము"

ఈవిధముగ సీత భూమివైపునకు జూచి యీ మాటలను బలుకు నంతలో, నాసమయమున నందరు నొక ఆశ్చర్యజనకమగు దృశ్యమును గాంచిరి. సీతాసమ్ముఖమున నందరును జూచుచుండగా భూమి బ్రద్ద లయ్యెను. దానిలోనుండి ఒక సువర్ణమయ దివ్యాద్భుత సింహాసనము ప్రకటమయ్యెను. అదివ్య సింహాసనమును జూడగనే అందరకును విస్మయము కలిగెను. తలలందు దివ్యమణులను ధరించిన పెద్దసర్పము లాసింహాసనమును మోయుచుండెను. ఆసమయమున రెండు దివ్య హస్తములు బయటకువచ్చి సీతా సాధ్వి నత్యంత ప్రేమముతో నెత్తి సింహాసనము మీద గూర్చుండబెట్టెను. తలవంచుకొని సీతాదేవి ఆసింహాసనమున గూర్చుండగా బ్రపంచా ధిష్ఠాతృదేవియా యను నట్లుండెను. మెల్ల మెల్లగా సింహాసనము భూమిలోనికి జారిపోసాగెను. లవకుశులు తమ తల్లి భూమిలోనికి బోవుటనుగాంచి పరువిడి వచ్చిరి. సీతాదేవి అచ్చటనుండియే మునిని సంబోధించి యిట్లనెను :- "తండ్రీ! మీరీపిల్లలను బోషించుడు." రోదనము చేయుచున్న ముని పిల్లలను బట్టుకొనెను ఆకాశమునుండి నిరంతరము పుష్పవర్షము కురిసెను. సీతాభగవతి అపుష్పములచే గప్పబడెను. ప్రజలందరును సాధు, సాధు ధన్యధన్య అనిపలుకసాగిరి. చాలమంది మూర్ఛితులై క్రిందబడిరి. చాలమంది వికలులై యేడ్వనారంభించిరి, ఆకాశమందు దేవదుందుభులను మ్రోగించుచు దేవతలిట్లనిరి:- "దేవీ! నీవు ధన్యవు. నీశీలమును, పాతి వ్రత్యమును ననుకరణీయమైనది. అందరును జూచుచుండగనే సింహాస నము భూమిలోనికి దిగిపోసాగెను. అందరకును ధైర్యము సడలెను. శ్రీరామచంద్రుడు సీతను బట్టుకొనుటకు బరువిడు నంతలో సీతాదేవి భూమిలో బ్రవేశించెను. ఆమె జడవెండ్రుకలు మాత్రము కొంచెముగను పైన నుండెను.

భగవానుడు వానినే పట్టుకొనెను. దానివలన సీతాఫలపు చెట్టుత్ప
న్నమయ్యెను. అది సీతాదేవియొక్క భూప్రవేశమునకు గుర్తుగానుండెను.
డు సీత ప్రత్యక్షముగ భూమి మీదలేదు. కాని యాసీతయొక్క పృష్ఠ
మునుజూచి పశువులకు బచ్చిగడ్డిని దెచ్చు పశువుల కాపరులు మిక్కిలి
సంతోషముతో నృత్యమొనర్చెదరు.

## సీతకై శ్రీరాముడు శోకించుట

శ్లో॥ తచ్ఛ్రుత్వా భగవాన్ రామో రుంధన్నపి ధియాశుచః।
స్మరం స్తస్యా గుణాంస్తాంస్తా న్నాశక్నోద్రోద్ధు మీశ్వరః॥
స్త్రీపుం ప్రసంగ ఏతాదృక్సర్వత్ర త్రాసమావహః।
అపీశ్వరాణాం కిముత గ్రామస్య గృహచేతసః॥

శ్రీ భాగ. ౯ స్కం. ౧౧ అ. ౧౬, ౧౭ శ్లో॥

మన ప్రేమ మనవెంట నిత్యముండిన నావ్యక్తి మహత్వము తెలి
యదు. ఆ వ్యక్తి మనకు సాధారణవ్యక్తిగా గోచరించును. ఆవ్యక్తితో
వియోగము కలిగినచో నావెనుక నా వ్యక్తి గుణములు స్మరణమునకు
వచ్చును. ఆస్మృతిలో హృదయమేడ్చును ప్రేమస్రోతస్సు పెల్లుబుకును.
కలిసికొనుటకు తీవ్రేచ్ఛ కలుగును. కలిసికొనినప్పుడు మునుముందుగా
నెట్లు కలిసికొందుము. ఏమేమి మాటలు మాట్లాడుదుము? అని యీ విధ
ముగ ప్రేమాలాపము లాడుదుము ఎట్లు హృదయమునకు హృదయము
హత్తుకొన జేయుదము? అని యీ విధముగ నెన్నోవిధము లనుకొను
చుండును. కలిసికొనిన తరువాత నన్నియును మరపునకు వచ్చును.
నోటినుండి మాటరాదు. శరీరము శిథిలమగును. కేవలము హృదయములో

ఘనీభవించిన భావము కరగినీరై కన్నులద్వారా ప్రవహించును. అట్టి వారితో శాశ్వత వియోగముగలిగెనా అప్పుడు సాహసము సడలిపోవును. సుదృఢమగు ధైర్యసేతువు బ్రద్దలగును. కలిసి కొనినప్పుడెవరి వలన నెవని కెంతటి సుఖము కలుగునో వియోగమున నంతటి దుఃఖము కలుగును. ఈ సంయోగ వియోగ శృంఖలా కారణముననే సంసార చక్రము తిరుగుచున్నది. సంయోగ సుఖమందు రాగము, వియోగ దుఃఖమునందు ద్వేషము లేకుండినచో సందరును ముక్తులు కాక మరల నీ సాంసారిక అవాగమనమునందుపడి ప్రాణు లడుగడుగ నకు త్రాసము నేల నెదుర్కొను చుందురు ? వారు మరల మరల జన్మించుటెందులకు? ఇట్లు మరల మరల జన్మించి కాలమునకు గబళము గుటెందులకు? స్త్రీ పురుష సమ్మేళనేచ్ఛచేతనే, మిథున ధర్మమందనురక్తి యుండుటచేతనే సంసృతి కలుగుచున్నది. క్లేశము కలుగుచున్నది. ఆవాగమన జనన మరణముల దుఃఖము కలుగుచున్నది.

సూతుడిట్లనెను:- "మునులారా! సీతాదేవి వెంటనే భూవివరములో లీనమయ్యెను. శ్రీరాముడు సింహాసనమును బట్టుకొని కొయ్యబొమ్మవలె నిలిచిపోయెను. ఆతడేమియును నిర్ణయించుకొనజాలక పోయెను. సీతా వియోగకారణమున నాతని యంతఃకరణమందు తుఫాను జెలరేగెను. ఆతడు క్రోధముచేతను రోషముచేతను గంపించుచుండెను. ప్రియురా లంతర్హితురాలగుటచే నరంతర మేడ్చుచుండెను. తనయొక్క వివేకబుద్ధిచే వృద్ధిని బొందుచుండిన కోపము నాపుకొనుటకు బ్రబల ప్రయత్న మొన ర్చుచుండెను. కాని యాతడాపుకొనజాలకుండెను. జానకీదేవిమీద బ్రేమ అధికముగ నుండుటచే నాతడు తన భావమును జీర్ణింపజేసికొనజాలక పోవుచుండెను. ఈశ్వరుడయ్యు దన్ను తాను నియంత్రణము కావించుకొన జాలకుండెను. అతడు క్రోధోద్రిక్తుడై, బాణమునెక్కిడి పృథివిని సంబో ధించి యిట్లనెను:- "ధరా! నీవంతవరకు ధరించుదాననవందురు. మేదినీ!

నీనిర్మాణమశుద్ధమగు మేదస్సుచేనైనది. వసుంధరా! నీవెంతో ధనమును నీలో ధరించి యుంటివి. నాకు ధనము నాప్రియురాలే. నీవు నా ప్రియురాలిని నీలో నేలదాచుకొన్నావు? నేనామె నెంతగా ప్రేమించుచున్నానో నీ వెరుగవా? రాక్షసేశ్వరుడగు రావణుడామెను లంకుగొనిపోయినాడు. వానిని బరివార సహితముగ జంపి, నేనచ్చటి నుండి సీతను దెచ్చితిని ఇంక బాతాళమునుండి తెచ్చుట నాకెంపని? నేను సీతలేక నిలువజాలను. నీవు నాసీతను నాకిమ్ము, లేదా నాప్రాణవల్లభ యెచ్చటనున్నదో అచ్చటికి నన్ను గూడ కొనిపొమ్ము భూదేవి! నిన్ను నేను క్షమింపజాలను. నీవు నా మాటను మన్నింప కుండినచో నేను వన, పర్వత, నద, నదీ, నగర, సర్వప్రాణి సహితమగు నన్ను దలక్రిందుగ జేసెదను. ముక్కలు ముక్కలుచేసి నిల్చు విసరివైచెదను. సీత నీకడుపుననే పుట్టినది. ఆమె నీకు పుత్రి; కాని ఆమెను బెంపుడు తండ్రియగు జనకుడామెను నాకిచ్చియుండెను. ఇప్పుడు నీకామెమీద నధికారములేదు. ఆమె నాయది. ఆమెను బట్టియే నీవు నాకు తల్లివంటిదానవైతివి.

ఆత్మయని భావించియే నేను నిన్ను సమ్మానించుచున్నాను. నీ మీద బాణమును వేయుటలేదు, కాని నీవు నన్నవమానించుచున్నావు. నన్ను లక్ష్య పెట్టకున్నావు. నేను నిన్ను జంపక విడువను. నిన్ను రసాతలమునకు బంపెదను. ప్రళయమువలె ప్రపంచమును జలమయ మొనర్చెదను. నేను నారోషము నాపుకొనుటకు బొత్తుగా నసమర్థుడనై యున్నాను. నేను నా భావమును సంవరణము కావింపజాలకున్నాను. సీతను బొందుటకై సమస్తమును జేయగను. నీవు నాపలుకుల నుపేక్షింపరాదు. అవిలంబముగ నాసహధర్మచారిణిని దిరిగి యొసంగవలయును. నాబాణములమోఘములు. నాశక్తి అపారమైనది నాబలమునకంతు లేదు. నేను సమస్తమును జేయ సమర్థుడను. సీత యెచ్చటనుండిన నచ్చటనుండి

ఆమెను దెచ్చెదను. నాబాణవేగము నెవరును సహింపజాలరు. నా ముందు రణమున నెవ్వరును నిలపజాలరు. నేను సీతకొరకు వెఱ్ఱివాడనైనను నేనెవ్వరిని లక్ష్యపెట్టను. సీతను బొందియే నేను విశ్రమించెదను." ఈ విధముగ క్రోధోద్రేకుడై శ్రీరామ చంద్రుడు పృధివిని దిరస్కరించుచు ధనస్సునందు బాణము నెక్కిడి పృథివిని రసాతలమునకు బంపుట కుద్యుక్తుడయ్యెను.

శ్రీరామచంద్రుడు క్రోధమును జెందుటనుగాంచి లోకపితామహుడగు బ్రహ్మ, బ్రహ్మలోకమునుండి దిగి వెంటనే నైమిశారణ్యమునకు వచ్చెను. ఆతడు హంసమీద గూర్చుండియే ఆకాశమందునుండి యిట్లనెను: "రామా! రామా! మహానుబాహూ! నీవు చేయబోవునదేమి? నీవిది యేమి యలౌకిక నరనాట్య మొనర్చుచున్నావు ప్రభూ! నీవు నీ సత్యరూపమును స్మరించు కొనుము నీవే సూకరావతారమును ధరించి రసాతలమునకు బోయి యీ పృథివి నుద్ధరించితివి. ఇప్పుడు దీనిని మరల రసాతలమున కేలబంప దలచు చున్నావు ప్రభూ! నీవు రక్షకుడవు శరణాగత ప్రతిపాలకుడవు. సంహారకార్యమును నీవు శంకరున కప్పగించితివి. ఉత్పత్తి కార్యమును నొసంగితివి. నీవు సనాతన సచ్చిదా నందఘన సర్వేశ్వరుడవు. సీతాదేవి నీకు నిత్యానపాయిని. ఆమెతో నీకొక్కక్షణమైనను వియోగము కలుగ గలదా? ఇంకను ప్రళయ సమయ మాసన్నము కాలేదు. నీవు క్రోధమును విడువవలయును జానకీదేవి నాగలోకమున సుఖముగ నున్నది. ఆమె స్వర్గమందు మరల నిన్ను బొందగలదు. నీవీ కుశలవులను ప్రేమపూర్వ కముగ బాలించుము. ఆతరువాత జరుగవలసిన వృత్తాంతమును వినుడు. ప్రభూ! ఇప్పుడు నీ లీలల నుపసంహరించు సమయముకూడ ఆసన్న మైనది."

ఇట్లు పలికి బ్రహ్మ తన సత్యలోకమునకు బోయెను. శ్రీరామ చంద్రుడధికముగ దుఃఖించెను. ఆతడు తన రోషము నాపుకొనెను.

అతడు నిరంతర మేద్చుచుండెను యజ్ఞమును బూర్తికావించి ఆతడ యోధ్యకు దిరిగి వచ్చెను. సీతాదేవి లేక ఆతని చిత్తము నిరంతరము చింతతోనుండెను. అతడు చాల కష్టముతో దన ప్రియలేక కాలమును వెడలబుచ్చు చుండెను.

ఇది విని అశ్రువులను దుడుచుకొనుచు శౌనకుడిట్లనెను:- "సూతా! భగవానుడిట్టి కరుణాపూర్ణమగు లీలనేల నొనర్చెను. భగవానుడయ్యు నాతనికి దన ప్రాణప్రియ యొక్క వియోగమును సహింపవలసివచ్చినది. భగవానునకు గర్మబంధనములేదు కదా! అట్టియెడ నాతడు జీవితకాల మంతయును దుఃఖిగానేలయుండినాడు. ఏల నొక్కతుచ్ఛరజకుని కొరకాతడు తన యానందమును నాశముచేసికొనినాడు అజ్ఞానులపకత వకలు వాగుచునే యుందురు. వాగనిండు. ఆనందముగి సీతతో విహార మొనర్చవచ్చునుగదా! ఇష్టము వచ్చినప్పుడు స్వధామమునకు సుఖముగ బోవచ్చునుగదా! ఈ విధముగ సదా దుఃఖిగానుండుచు, శ్రోతలను, వక్తలను, బాఠకులను, లేఖకులనుగూడ దుఃఖపరచినాడేల?"

ఇది విని గంభీరముగ సూతుడిట్లనెను:- "స్వామీ! భగవానునకు సుఖదుఃఖములెక్కడివి? ఆతడు కర్మబంధనమునకును సుఖదుఃఖము లకును బరుడు, సీత ఆతని నిత్యశక్తి. ఆమెతో నాతని కొకక్షణమైనను వియోగముండబోదు. ఆతడు ప్రాణుల అంతకరణమును శుద్ధమొనర్చు టకై, హృదయ మాలిన్యమును గరుణానీరముచే గడుగుటకై యిట్టి కరుణాపూర్ణమగు లీలల నొనర్చినాడు. దానివలన హృదయ మాలిన్యము నీరై నేత్రములనుండి వెడలుచు ఆతడు తన ప్రతిరీలవలనను జీవులకు శిక్షణ మొనర్చుచున్నాడు."

శౌనకుడిట్లనెను :- "ఈ కరుణాపూర్ణ కథానకముచే నేమి శిక్షణ లభింపగలదు ?

సూతుడిట్లనెను:- "స్వామీ! శిక్షణమేమనగా మానవుడు వివాహము కొఱకెంతో సువ్విళ్ళూరు చుండును. పిల్లపేరు వినగానే ఆతని హృదయములో జక్కిలిగింత కలుగుచుండును. నేటికెన్నో వివాహములు జరిగినవి కదా! వివాహము చేసికొనిన మాకు సదా సుఖము లభించినదని యెవరైనను జెప్పినారా? క్షణకాలము సుఖముగ గోచరించును. మిగిలినదంతయును దుఃఖమే కదా! ఈ పొలతుల పొత్తుచే నేవ్యక్తి సుఖమును బొందినాడు? ఈగడ్డములు మీసములు గల ద్విపాద పశువుల పొత్తుచేసి యే పొలతి పూర్తిగ సుంఖించినది? మునులారా! మీరీవివాహజాలము నుండి బాగుగనె తప్పించు కొంటిరి. భగవానునకు మీమీద గొప్ప కృపయున్నది. గృహిణీయను సంకెళ్ళు ఏ పాదములకుబడి యుండినచో నిచ్చట నీవిధముగ వేలకొలది సంవత్సరములు నిశ్చింతులై రసపత్తరములైన నీభగవత్కథలను వినజాలియుండరు. నూనె తీసుకొనిరమ్ము, ఉప్పు తీసుకొని రమ్ము, పసుపును దీసికొనిరమ్ము. కట్టెలను దీసికొనిరమ్ము. బొగ్గులను తెమ్ము. విసన కఱ్ఱలను దెమ్ము, తమలపాకులను దెమ్ము. ఇంకేవేవో తెమ్మనుచునే యుందురు. భగవత్కథ వినుట కవకాశమే లభింపదు. కథాకాలక్షేపములో గూర్చుండినను నిన్న గృహిణి తనచీర చినిగినదన్నది. తనకొక హారమునుగూడ చేయించుమన్నది. తనరు తలనొప్పియట; యేదైన మందును దెప్పింపుమని కోరినది. నాకు సినిమా చూపించుడు' అని యిట్లెన్నో విధముల దన భార్యపలికిన పలుకులే జ్ఞాపకమునకు వచ్చును. శరీరము మాత్రము కథకడనే యుండునుగాని మనస్సు మాత్రము మానినీచింతలో మసలుచుండును. మునులారా! స్త్రీల కడ నేదైన సుఖమున్నదనుకొనిన నది క్షణికమగు జిహ్వోపస్థలసుఖమే మిగిలిన దంతయును జింతయే. పిల్లలు పుట్టినచో వారిలాలన పాలనచింత. స్వామీ! వయస్సువచ్చిన పిల్ల తండ్రికామె వివాహము విషయములో గలుగు చింతనుగూర్చి చెప్పవీలులేదు. పిల్లమాడలాడదు. ఆమె సంకోచ

కారణమున నెదుటకే చాల తరచుగ వచ్చుచుండును; కాని తండ్రి లోలోన దిగులుపడుచుండును. రాత్రులందాతనికి నిద్రపట్టదు. ఏదో విధముగ యోగ్యుడగు వరుడు పిల్లకు లభింపవలయునను చింతలో నాతనికి భోజనమును రుచింపదు. ఈ దుఃఖమే ఆతనిని పీడించును. ఎవరితో మాటలాడిన బాపము కలుగునో వారివద్ద వినయముగ నుండ వలసి యుండును ఆతడు పలికిన బదిమాటలను వినవలయును. ఆడపిల్లకు తండ్రియగుచో నందర సమ్ముఖమున దలను వంచవలసి యుండును. ఇంటికి రాగానే గృహిణి యిట్లనును:—"పిల్ల పెద్దదైనది. మీ కేమాత్రమును జింతలేదేమండీ! ఇరుగు పొరుగు వారు నానోట నుమియుచున్నారు. అనరాని మాటలనుచున్నారు. మీరేమియును విచా రింపరు" ఏమి చెప్పుదును! అప్పుడు భార్యపై జాలగగోపము వచ్చును. నేను చింతలో బడి సతమతమగు చుండగా నిది నీకు చింతగాలేదను చున్నది. వరుడు మట్టితో జేయబడు వాడుకాడు. అట్టిట్టివానికి జాతియు జూడకయు నీయవీలులేదు, మంచియింటివాడు కావలయును. కులీనుడు కావలయును. అట్టివాడు దొరకినచో వివాహము కాగందు. వివాహమునకు ధనము కావలెను. ధనమా నావద్దలేదు. అడిగిన ధనమెవరీయగలరు? ధనమిచ్చెడు వస్తువుగాదు ప్రాణములకు దెగించి, చాలగ గష్టపడి సంపాదించిన ధనమును దమకు దామెవ రీయగలరు? ధనమును వత్తిడి యుండిననే యిచ్చెదరు. నావద్ద బలములేదు, తేజములేదు; ప్రభావము లేదు; ప్రజల నానందపరచు కళలేదు. అట్టియెడ నాకు ధనమెవరొసంగె దరు?" ఈ విధముగ దల్లిదండ్రులకు బిల్ల వివాహమునకు ముందెంతో చింతయుండును. వివాహము కాగానే తల్లిదండ్రులను మరచెదరు. ఒక రింకొకరిని సుఖపెట్టుటకై, తాను సుఖపడుటకై ప్రయత్నించును. కాని సుఖమెక్కడిది? భార్య అత్యంత సుందరియగుచో నామెరక్షణ చింత. కురూపయగుచో దనకు నిరాశయును, లోకుల యెగతాళిని సహింపవలసి

యుండును. ఆమె గుణవతియగుచో నామె చెప్పినట్లు వినవలసివచ్చును. నిర్గుణయగుచో రాత్రింబవళ్ళులోలోన గుమిలిపోవలయును. చెప్పినమాట విననది యగుచో నామె మోహమునబడవలసి వచ్చును. గయ్యాళి యగుచో నిత్యమును పోట్లాటలను, దెబ్బలాటలను నెదుర్కొనవలసి వచ్చును. సారాంశమేమనగా నేవిధముగ జూచినను సుఖములేదు. రోగిణి యగుచో రాత్రింబవళ్ళామె సేవాశుశ్రూషలు చేయవలసి వచ్చును. అలంకారప్రియ యగుచో వస్త్రాభూషణములు తెచ్చు చింతయుండును. కర్కశయగుచో నామె వియోగమును గాంక్షించు చుండును. ఈలోకమున లోకలజ్జను దృష్టిలో పెట్టుకొనవలసి యుండును. సారాంశ మేమనగా నీస్త్రీ ప్రసంగ మేవిధముగ జూచినను సర్వత్ర బాధయే. స్త్రీవలన నెవనికి సుఖమబ్బినది? సాధారణుల విషయమును వదలివేయుడు. ఈశ్వరుని విషయమునే చూడుడు. సతీదేవితో సుఖముగ గాలమును గడుపవచ్చునని శివుడనుకొనెను. సతీదేవివచ్చి కొన్ని దినములున్నది. ఆమె రాగానే శివుని స్వతంత్రతకు విఘ్నమొనర్చి యిట్లనెను:-"నన్ను నా పుట్టినింటికి గొనిపొండు." లక్షవిధముల జెప్పెను. కాని స్త్రీహఠమును విడువలేదు. శంకరుడు కొంచెము చిక్కులోబడి వినలేదు. అప్పుడు సతీదేవి మొండిపట్టుబట్టి ఒంటరిగాబోయెను. అచ్చట దండ్రి పలుకనైనబలుకలేదు. అందులకామెకు గోపమువచ్చెను. ఇప్పుడు శివునకు చిక్కుస్థితికలిగెను. చచ్చిన సతీదేవి శవమును వీపుపైన వైచుకొని, పిచ్చివానివలె నాట్యమొనర్చుచు, గాన మొనర్చుచు, నేడ్వసాగెను. త్రిలోకములును గంపించెను. విష్ణుభగవానుడు మధ్యవచ్చి ఆ సతీశవమును ముక్కలు ముక్కలొనర్చెను. కొన్నిటిని దగులబెట్టెను. శివుడు దిగంబరియయ్యెను. సతీ దేవియొక్క చితాభస్మము నలముకొని శోకమున నేడ్వనారంభించెను.

విష్ణుభగవానునకును లక్ష్మీదేవివలన దక్కువ దుఃఖము కలుగలేదు. జలంధరుడును సముద్రమున బుట్టెను. లక్ష్మీదేవియును దానిలో

నుండియే పుట్టినది. జలంధరు దండరకును బాధకలిగించు చుండెను. విష్ణువాతని జంపబోయెను. లక్ష్మీదేవి దారికడ్డువచ్చి నిలిచెను. "స్వామీ! మీరు నాసోదరుపై జేయిచేసికొంటిరా, ఇక నేనున్నాను, మీరున్నారు." అనెను.

పాపమాతడేమి చేయగలడు. అతడిట్లనెను:—"సరియే నేను జంపను." భార్యకొరకై బావమరది కోరవలసివచ్చెను. మాయలోబడి పోయెను. ఇట్లనెను:— "వరమిడుగుమయ్యా!" ఆతడిట్లనెను:—"నీవు నాయింటిలోనే యుండుము ఇదిపశ కిల్లింటివాడై సముద్రములో నివసించు చుండెను. ఇప్పుడు బావమరది రాజధానిలో నుండవలసి వచ్చినది. అలి యెట్లాశిన నట్లాశవలసియుండును తరువాత బృందవలన నేమైనదో భగవానుడెట్టి క్లేశము లనుభవింపవలసి వచ్చినదో అందరెరిగి నదే. ముదరనిచ్చిన నేమి ప్రయోజనము. లక్ష్మీదేవిని మెడకు గట్టు కొనుటచే నన్నిటికి నోర్చుకొనవలయును కాకున్న చంచలవలననే సుఖ మునుండదు సరిగచా క్రొత్త క్రొత్త మాటలు వినవలసి వచ్చును. అహల్య వలన గౌతమునకెట్టిదుర్దశ కలిగినదో అందరెరిగినదే. కశ్యపునకీ పది మంది పుత్రికలెట్లివారైనదియును, చంద్రుడు భార్యవలన నెట్లు కుష్ఠరోగి యైనదియు మీకుదెలిసినది. ఎవరైనన భార్యవలన సుఖములభించినదని పలికితిరా చూడుడు. బ్రహ్మతన శరీరమును వాణీదేవి కర్పింపవలసి వచ్చినది. కాని అంధపరంపరచే నెవ్వరును బెండిలి చేసికొనకమానరు.

స్త్రీల విషయములోను నింతే. ఈ పురుషులు స్త్రీల యెడల నేమంత మంచిగా ప్రవర్తించినారు. తమ స్వార్థము కొరకు వీరు స్త్రీలచే సమస్త కార్యములను జేయించుకొందురు. శ్రీరామునే సర్వస్వముగ నెంచుకొని, తన నాతని పాదములకు సమర్పించుకొనిన సీతను శ్రీరాముడొక చాకలి వాని మాటకొరకై యింటినుండి పాలలోబడిన నీగను బారవైచినట్లు

విడిచివై చెను. అహల్యవలన బొరపాటున నపవాదము సంభవించినది. ఆమెను రాయిగాజేసి వైచిరి. వేలకొలది సంవత్సరములు ప్రతిమయై పడియుండెను. శూర్పణఖ ప్రేమప్రస్తావము కావించినది. దానికి బదులుగా నామెను ముక్కు చెవులు లేనిదానిగాజేసిరి. కావున నెన్నడును స్త్రీవలన బురుషునకు సుఖము లభింపలేదు. పురుషునివలన స్త్రీకిని సుఖము లభింపలేదు ఎట్లు లభింపగలదు. సుఖము చైతన్యమందున్నది. ఏరూపమును గాంచి స్త్రీపురుషుని మీదను, పురుషుడు స్త్రీమీదను బరస్పరమాసక్తిని జెందుదురో ఆరూపము బాహ్యమైనది. మాంస, మేదో, రక్తాస్థులకు గారణమైనది. ఏనేత్రముల కొరకై మానవులు చచ్చుచున్నారో వానిలో నేమున్నది. వెండ్రుకలు, యెముకలు, మాంసము, రక్తము, స్తనములు మాంస పిండములు. వీనియందు సుఖమున్నదని భావించువారు చాల పొరబడుచున్నారు. ఇనుమునదైలమును బిండజూచుచున్నారు. కావున స్త్రీ పురుషుల ప్రసంగమున సుఖములేనేలేదు. కేవలము దుఃఖమే. ఈశరీరమనిత్యము, క్షణభంగురమని భావించి ఆత్మను ప్రేమించువారు సుఖులగుదురు.

శ్రీరామునకు సీతయెడల నాత్మీయ సంబంధమేగలదు. దానికి వియోగము సంభవింపనే సంభవింపదు. శరీర సంబంధ మనిత్యమైనది. క్షణభంగురము, దుఃఖదాయకమైనది. ఈ విషయమై శిక్షణ మొసంగుటకు గాకున్నచో శ్రీరామచంద్రుడీవిరహ నాటకము నాడెడువాడేకాడు. వాస్తవముగ జూచినచో నాసుఖ స్వరూపు డగు భూమాపురుషునకు దుఃఖమెక్కడిది, సుఖమెక్కడిది? సంయోగమేమి? వియోగమేమి? ఆతడు సచ్చిదానంద ఘనుడు. నిత్య, శుద్ధ, బుద్ధ, ముక్తుడు. ఆనందరాశి. సీతాదేవి సూర్యునకు బ్రభవలె సదా ఆతనికి వెంటనే యున్నది."

ఇది విని శౌనకుడిట్లనెను:- "సూతా! ఇదంతయును భగవల్లీల, క్రీడయే. తరువాత నేమైనదో ఆకథను జెప్పుము"

సూతుడు నిట్టూర్పును విడిచియిట్లనెను:- "ఇప్పుడు స్వామీ! తరువాత నేమైనదందురా? తరువాత నాటయంతయును సమాప్తమైనది. మంచిది. వినుడు. తరువాత కథను జెప్పెదను."

## ప్రభు లీలా సంవరణ ప్రస్తావన

శ్లో॥ తత ఊర్ధ్వం బ్రహ్మచర్యం ధారయన్న జుహోత్ప్రభుః।
త్రయోదశాబ్ద సాహస్ర మగ్నిహోత్ర మఖండితమ్।

శ్రీభాగ. ౯ స్కం. ౧౧ అ ౧౮, శ్లో॥

కాలస్వరూపుడగు భగవంతుని విధానము ముందుగనే యేర్పరుప బడి యుండును. ఈప్రాణి పృథివియందెంత కాల ముండునో ఎప్పుడు వీని క్షేత్రానమందు, ఎవనిద్వారా, ఎట్లే సమయమున నంతయు కలుగు నదియు నప్పటికప్పుడు కలుగునవి కావు. జన్మించుటకుముందే ప్రారబ్ధ మేర్పడును. భూమిపై నెన్ని దినములుండవలయును? ఎచ్చటెచ్చట నేయేకార్యము లొనర్పవలయును? ఎప్పుడు తన లీలలను సంవరణము కావింప వలయును? అనునవన్నియును ప్రభుని అవతారమునకు బూర్వమే నిశ్చయింపబడును. ఇవన్నియును నాతని సునిశ్చిత యోజన ములే. గొప్ప గొప్పవారి భోజనాశయనాదులును, భజన పూజనాదు లన్నియు నాయావేళలకు నిర్ణయమై యుండును. వారికి గుర్తుండును. అయినను సేవకుల ధర్మము వారికి జ్ఞాపక మొనర్చుట ఏలననగా సేవ

లొనర్చుటయే సేవకుని ధర్మము. సేవకుడా జ్ఞాపింపడు, శిక్షణ యొసంగడు, బలపంత మొనర్పడు. నమ్రతా పూర్వకముగ జ్ఞాపకమొనర్చును స్వామి దీనివలన సేవకునియెడల ప్రసన్నుడగును భగవకతుడేది చేయదలచినాడో దానికి భూమికను ముందుగనే యేర్పరచుకొనును. ఏయాటనాడ దలచినాడో తదనుసారముగనే ముందుగనే రూపము నేర్పరచుకొనును. దీనిని గార్భప్రస్తాపన మందురు.

సూతుడు శౌనకాది మహర్షులతో నిట్లనెను:- "మునులారా! సీతాదేవి భూవివరమున బ్రవేశించినది. స్వయంభూ బ్రహ్మ చెప్పుటచే సచ్చిదానంద ఘనుడగు శ్రీరాముడు శాంతుడయ్యెను. ఆతనయోధ్యకువచ్చి రాజ్యమును జేయుసాగెను శత్రుఘ్నుడు మధురలోనే యుండెను. ఇది భగవానుని యాజ్ఞ. శేషుడగు లక్ష్మణుడును, భరతుడును నయోధ్యయందేయుండి ఉత్తమశ్లోకుడగు శ్రీరామచంద్రు నుపాసించుటయందే నిరంతరము నిమగ్నులై యుండిరి. భగవానుడు నిత్యమును సావధాన నగ్నిహోత్రమును జేయుచుండెను. ఆతని అగ్నిహోత్రమందలి అగ్నులు సదా పూజితములై యుండెడివి. ఆతడు సదా ప్రజలకు న్యాయమొనర్చుచుండును. ప్రజలు సంతోషించుటకై ఆతడు సమస్తమును జేయుటకు తత్పరుడై యుండెను. త్రేతాయుగమును వర్ణాశ్రమధర్మములే ప్రధానములు. ఆసమయమున ఘోరతపంబొనర్చుట బ్రాహ్మణ క్షత్రియులకే విహితమైయుండెను. కృతయుగమందు కేవలము బ్రాహ్మణులే తపంబొనర్చెడువారు. క్షత్రియ, వైశ్య, శూద్రులు స్వధర్మ పాలన మొనర్చుచు దమతమ కర్మలందు లగ్నులై యుండెడిదివారు. త్రేతాయుగమందు బ్రాహ్మణ, క్షత్రియులిద్దరకును దపంబున కధికారము ప్రాప్తించినది. ద్వాపరయుగమందు వైశ్యులును దపంబొనర్చుటకవకాశము కల్పింపబడినది. కలియుగములో సమస్త వర్ణములవారును, దపంబొనర్పవచ్చును.

ఇట్లు సదాచార పూర్వకముగ వర్తించుచు భగవద్భక్తిని సర్వకాలము లందును సమస్తయుగములందును సమస్త వర్ణముల వారును సమస్తాశ్రమ ములవారును స్త్రీ పురుషులును జేయవచ్చును. ఈవిధానమంతయు నిట్టి తపంబునకే ఇట్లొనర్చుటచే మానవుడు ప్రాకృత నియముల నుల్లంఘించి సశరీరముగ స్వర్గాదిలోకములకు బోవచ్చును. యుగమునకు విరుద్ధముగ నాచరించుట యుగావతారమునకు విరుద్ధాచరణ మొనర్చుటయే కాగలదు. అవతారములలో ననేక భేదములు కలవు. కొన్ని కల్పావతారములు. కొన్ని మన్వంతరావతారములు, కొన్ని యుగావతారములు, కొన్ని అంశావతార ములు, కలావతారములు, ఆవేశావతారములు చాలవరకు కరణావతార ములు నాలుగుయుగములందురు. సదా ఆయా యుగావతారములుండును. కపిలుడు కృతయుగావతారము. కృతయుగము వచ్చినప్పుడెల్ల గపిల భగవానుడవతరించి జ్ఞాన ప్రచార ప్రసారములను గావించును. శ్రీరాముడు త్రేతాయుగావతారము. త్రేతాయుగము వచ్చినప్పుడెల్ల శ్రీరాముడవతరించి వర్ణాశ్రమ ధర్మమర్యాదను స్థాపించును. కృతయుగ మందు ధర్మము నాలుగుపాదముల బూర్ణ స్వస్థముగ నుండును. తప, శౌచ, దయా, దానములే ధర్మమునకు నాలుగు పాదములు. త్రేతాయుగ మందు ధర్మమునకు మూడు పాదములేయుండును. తపస్సు తగ్గిపోవును. ద్వాపరయుగమందు దయాదానములను రెండుపాదములే మిగులును. కలియుగమందు కేవలము దానములేక సత్యమును నొక్క పాదమే మిగులును. అదియును జివరకు నశించిపోవును. దీని ననుసరించియే అవతారములును గలుగుచుండును. కృతయుగమందు తపమునకు ప్రాధాన్యముకలదు. తపమే ఆయుగమునకు ప్రధానధర్మము. కావున దపస్వియగు గపిలరూపమున భగవానుడవతరించి తపస్సునుగూర్చి ప్రచార ప్రసారము లొనర్చెను. త్రేతాయుగమందు వర్ణాశ్రమ ధర్మ మర్యాదయును, పవిత్రతయును నావశ్యకమై యున్నది. అందువలన

మర్యాదా పురుషోత్తముడుగ రాముడవతరించి ప్రథమముగ మర్యాదాపాలన మొనర్చుచుండెను. మర్యాద భంగము కాకుండుటకై చేయరాని పనులను గూడ చేయుచుండెను. సీతను త్యజించుటకు ప్రధానకారణము కేవలము మర్యాద రక్షణమే కాకుండిన సతియగు సీత పరమపవిత్రయని యాత యెరుగడా? కాని తన యాచరణము అన్యస్త్రీలకు చెడ్డ ఆదర్శము కాగూడ దను భయముచే శుద్ధయైనను సీతను త్యజించెను. ఆమె విషయము గతోరుకయ్యెను. ద్వాపరయుగమందు ధర్మముయొక్క తపశ్శౌచము లను నీరెండుపాదములు నిర్బలములగును. కేవలము దయ, దానములను రెండు పాదములే సబలములగును. ఆసమయమున వైదిక యజ్ఞయాగాది విస్తారము తగ్గిపోవును. తాంత్రిక పూజాపద్ధతి ప్రచారమధికమగును. ప్రజల బుద్ధులల్పములగును. వారధిక జ్ఞానమును ధారణచేయుట యందసమర్థులగుదురు. అందువలన వ్యాసభగవానుడై భగవానుడు వేద విభాగము కావించును. పురాణ ప్రచారమును గావించును. వ్యాసదేవుడు ద్వాపర యుగావతారము ప్రతిద్వాపరయుగమందును వ్యాసు డవతరించు చుండును. కలియుగమందు తపశ్శౌచదయలను నీ మూడు పాదములు నష్టప్రాయములగును. కేవలము సత్య, దానములచేతనే ధర్మము నిలుచును. చివరకదియును నష్టమగును. అప్పుడు భగవానుడు కల్క్యావ తారమును ధరించి దుష్టులను సంహరించి మరల ధర్మమును స్థాపించును. అంత కృతయుగ మారంభమగును. ఇదేవిధముగ నీయుగక్రమ మనాది కాలమునుండియు అనంతకాలము వరకును జరుగును. ఇందులో బరివర్త నములేదు. నూతనత్వములేదు, తగ్గించుటయును హెచ్చించుటయును లేదు. ఆతనిమాయ, లీల, క్రీడ, వినోదము. కూర్చుండి మనోరంజన మొనర్చు కొనుటయే.

భగవంతుడు మర్యాదా రక్షణముకొరకే యింతటి కఠోరకార్యము లొనర్చెను వానిలో సీతాపరిత్యాగ మత్యంత కఠోరమైనది. ఇట్టి నిర్ధ

యత్నా పూర్ణమగు కార్యముచు శ్రీరాముడొక శూద్ర తపస్విని హత్య యొనర్చుటలో జేసియుండెను.

శౌనకుడిట్లనెను:-"సూతా! భగవానుడు శూద్ర తపస్వి నేల జంపినాడు."

అంత సూతుడిట్లనెను:—"స్వామీ! మునులారా! నేనీ కథను సంక్షేపముగ జెప్పెదను. ఒక దినమున నొక తేజస్వియగు వృద్ధబ్రాహ్మణుడు చనిపోయిన తన పుత్రునిదీసికొని శ్రీరామచంద్రుని సన్నిధానమున కువచ్చి యేడ్చుచునిట్లనెను:-"రాఘవా! నా యీ పసిపాప నాయెదుటనే అకాలమందు కాలకబళితుడెట్లయ్యెను? తండ్రి యెదుట గొడుకు చచ్చుట పాపఫలమే. నేను నాకు జ్ఞాపకమున్నంతవరకు పాపమునుజేసియుండలేదు. నిశ్చయముగ నిది రాజపాపపరిణామమేయై యుండవలయును. ఏరాజు రాజ్యమందు అధర్మాన్యాయములు జరుగునో, ఆరాజ్యమందకాల మృత్యువులును. ధర్మవిహీనములగు కార్యములును జరుగును. మీరు నాపిల్లవానిని బ్రదికింపవలయును, లేదా మీద్వారమున బ్రాయోపవేశమొనర్చి ప్రాణ పరిత్యాగ మొనర్చెదను. అప్పుడు నీవు బ్రహ్మహత్యనుబొంది సుఖముగ నుండవచ్చును."

ఇది వినగానే భగవానుడు భయపడెను. ఆతడు వెంటనే యెనిమిది మంది వేత్తలునగు విద్వాంసులతో నొకనిర్ణయసమితి నేర్పరచెను. మార్కండేయ, మౌద్గల్య, వామదేవ కశ్యప, కాత్యాయన, జాబాలి, గౌతమ నారదులను నీయెనిమిది మందిని సమితి సదస్యులుగా నేర్పరచెను. భగవానుడు వెంటనే వారితో దమ సహైతుక నిర్ణయ మొనర్ప బ్రార్థించెను. ఆసమితికి సంభవతయా నారదుడే సభాపతిగా నయ్యెను. అందరనడిగి తెలిసికొని ఆతడిట్లు నిర్ణయమొనర్చెను:-"రాఘవా! నీరాజ్య

మందుయుగధర్మమునకు విరుద్ధముగ శూద్రుడు సశరీరముతో స్వర్గము నకు బోవుటకై ఉగ్ర తపస్సును జేయుచున్నాడు. ఆతని ఘోరతపస్సుచే వాతావరణ మశాంతమైనది. ఆ శూద్రతపస్వికలియుగమందిట్టి తపస్సును జేసియుండిన న్యాయయుక్తముగ నుండియుండెడిది. ఆతడిప్పుడు చేయు చుండిన ఘోరతపస్సును కృతయుగమందు క్షత్రియుడొనర్చినను నాతడు వందనీయుడయ్యెడువాడు. రామచంద్రా! ఎప్పుడెప్పుడేయే కోరిక లుండునో అప్పుడదియే శోభించును. చలికాలములో గంబడి, ఉన్ని వస్త్రములు సుఖకరముగ నుండును. వైశాఖ జేష్ఠములందెండలలో నవియే బాధను గలిగించును. చూచెడు వారికిని బాగుండదు. రాజు ప్రజలనుండి పన్నులను గైకొనుచున్నాడు కావున వారిపుణ్యపాపముల ననుభవింప వలసివచ్చును. కావుననిది నీదోషముగానే భావింపబడుచున్నది. అశూద్రుని దపస్సునుండి మరలింపుము. అంగీకరింపకున్నచో వానిని జంపివేయుము. అప్పుడుమాత్రమే బాలకుడు జీవింపగలడు."

ఇది వినగానే భగవానుడు వెంటనే తన పుష్పక విమానమును దెప్పించి, దానిపైనెక్కి-త్వరమని శంబూకుని సమీపమునకు జేరెను. ఆత డొక సుందర సరోవర సమీపమున దలక్రిందులుగ వ్రేలాడుచు ఘోర తపంబొనర్చు చుండెను. రామచంద్రుడాతని పరిచయమడిగెను. ఆతడు సమస్తవృత్తాంతమును సత్యముగజెప్పెను. శ్రీరాముడిట్లనెను:-"అయ్యా! ఇది యుగధర్మమునకు విరుద్ధము." ఆతడిట్లనెను:-రాఘవా! నేను సత్యప్రతిజ్ఞుడను. అబద్ధమును జెప్పను. నేనే శరీరమును వదలకయే సశరీరముగ స్వర్గమునకు బోవలయునని పట్టుదలతో నున్నాను." రామ చంద్రుడివ్పుడేమి చేయగలడు. వెంటనే ఆతడు తళతళలాడు ఖడ్గమును దూసెను. చేతులు కంపింపసాగెను. భగవంతుడిట్లనెను:—"ఓహో స్తమా! లోకరంజనముకొరకు దోషరహితయగు సీతాదేవిని శాశ్వతముగ విడిచి

వైచితివి. అట్టియెడ నీతపస్వియందేల దయనుజూపెదవు. నీవెత్తంత కఠోరవు." అని యీ విధముగ మనస్సునకు సంబోధించి చెప్పి, భగవానుడు మనస్సులో నిట్లనుకొనెను:—"వీరీతపస్వి స్వర్గమునకుపెళ్ళుట కిష్టపడకుండినచో నీతపస్విని శరీరముతో స్వర్గమునకు బంపకుండవచ్చును. నేను వీనికి స్వర్గమునకుమించిన మోక్షము నొసంగెదను. నాయస్త్రముచే జచ్చిన వారందరును నాపరమధామమునకు బోగలరు. వీనిని నేను వెంటనే నాధామమునకు బంపెదను" అని తలచి ఖడ్గముచే వానిశిరస్సును ఖండించెను. శంబూకుడు భగవానుని భువనమోహన రూపమును దర్శించుచు శరీరత్యాగము కావించి భగవద్ధామమునకు బోయెను"

ఇది విని శౌనకుడిట్లడిగెను:—"సూతా! శబరికూడ శూద్రయేకదా! ఆమెను భగవానుడేల జంపలేదు. పాపమీ శూద్రుడేమియును బాపమును జేయలేదు. తపస్సునే చేసికొనుచున్నాడే. భగవద్భజనమునే చేయుచున్నాడే. ఇట్టి యన్యాయమును భగవానుడేల జేసినాడు?"

ఇది విని సూతుడు పకపక నవ్వి యిట్లనెను:—"స్వామీ! న్యాయాన్యాయములు భగవంతునకే తెలియవలయును. న్యాయమేమి? అన్యాయమేమి? కాని మీరు ధ్యానపూర్వకముగ జూడుడు. చాల విషయములొక్కొక్కప్పుడు మంచిగాదోచునవి యింకొక్కప్పుడు చెడ్డగాదోచును. పూర్వము రాజులు జూదమాడుట ధర్మముగ భావించెడువారు. యుద్ధమునకుగాని, జూదమునకుగాని కవ్వించినచో నవి యొనర్చుట ధర్మముగ భావింపబడు చుండెడిది. ధర్మావతారకుడగు యుధిష్ఠిరుడీయాచారమున నడచియే వనములందు దిరుగవలసివచ్చెను. నేడు శకునివలె నన్యాయజూదమునాడి ధనాపహరణమును గావించినచో గారాగృహమందు గాలయాపనము చేయవలసివచ్చును. మధ్యయుగమందు విదేశములందు ధర్మాచారమునకు విరుద్ధముగ నడచినచో బ్రతికియుండగానే కాల్చి

వేసెడువాడు. నేడు ప్రత్యక్షముగ విరుద్ధముగమాటలాడినను నెవ్వరేమి యును బలుకరు. ఈ విధముగ యుగధర్మమెల్లప్పుడు నుండుచుండెడిది. ఇప్పుడునుగలదు. ముందును నుండును. శబరి క్రింద నగ్నిని వెలిగించు కొని తలక్రిందుగ వ్రేలాడుచు గాయక్లేశముతో దపస్సుచేయలేదు. ఆమె దీక్షతను వహించి భగవద్భక్తినొనర్చెను. ఆతని నామమును స్మరించు చుండెడిది. ధనమును జూచియు, ప్రతిష్ఠనుగాంచియు మానవుడీర్ష్యను వహించు చుండును. మంచిమంచి కులీనులగు స్త్రీలు మావర్గమునకే లభింపవలయుననియు, భూమినంతను ననుభవింప వలసినది తామే యనియు, నందరకంటే శ్రేష్ఠులము తామేనను భావము ప్రభావశాలురగు వ్యక్తులకు గలుగుచుండును. వీనికి విఘ్నము కలిగించినచో రెండవ పక్షము వారు వానిసంత మొనర్చెదరు. వానిని బట్టుకొని కారాగృహమున బంధించి వేసెదరు. చాలమంది ప్రాణములనుగూడ తీయుదురు. ఎవడు దీనతను ధరించినాడో, తాను చరాచరములకు సేవకుడని భావించినాడో ఆతనినెవరు విరోధింపగలరు? అందువలన భగవద్భక్తిలో నందరకును నధి కారముకలదు. సమస్తకాలములందును సమస్త దశలయందును సర్వులును సదా భగవద్భక్తిని జేయవచ్చును. స్వర్గమొక విధమగు ప్రతిష్ఠ. అదియును బంధనమే. భగవంతుడు బంధనమును ఖండించు చుండెడివాడు. కావున శంబూకునిజంపి యాబ్రాహ్మణుని బ్రసన్నుని గావించెను. వానికిని మేలా నర్చెను. భగవంతుని కార్యములలో నందరకును హితమిమిడియుండును. మనము మన యజ్ఞానవశమున దానిని గుర్తింపజాలము."

భగవంతుని యందు పక్షపాతముండదు. ఆతడందఱి మొఱలను వినగలడు. అతడా బ్రాహ్మణుని మొరనెట్లు వినెనో అట్లే ఒక దుక్క మొఱనుకూడ బ్రాహ్మణునకు విరుద్ధముగ వినెను.

శౌనకుడిట్లనెను :— "సూతా! కుక్క బ్రాహ్మణునకు విరుద్ధముగ నేయభియోగమొనర్చినది? దానిలో భగవానుడే నిర్ణయమును గావించి నాడు. కృపతో నా కథనుగూడ వినిపింపుము."

సూతుడిట్లనెను :— "వినుడు స్వామీ! ఒక దినమున నొక్కకుక్క యేడ్చుచు మొత్తుకొనుచు శ్రీరామచంద్రుని ద్వారముకడ నిలుచుండగా లక్ష్మణుడుకాంచెను. అది శ్రీరామచంద్రుని దర్శించుట కుత్సాహమును బ్రకటించు చుండెను." లక్ష్మణుడుపోయి శ్రీరామచంద్రునితో నిట్లు నివేదించెను:- "ప్రభూ! ఒకకుక్క మీదర్శనమును గోరుచున్నది. దానిదొక అభియోగము కలదు "

భగవానుడిట్లనెను:— "లక్ష్మణా! వెంటనే ఆ కుక్క నిటు పిలుచు కొనిరమ్ము. దుఃఖితుల దుఃఖమును వినని రాజు నరకమున బడగలడు,"

ఇది విని లక్ష్మణుడు వెంటనేపోయి, ఆకుక్కను దీసి కొనివచ్చెను. కుక్కయేడ్చుచు మానవ భాషలో నిట్లనెను:- "ప్రభూ! ఈ బాహ్మణుడు నన్ను తెగబాదినాడు. కొట్టి కొట్టి నానడుమును విరుగగొట్టినాడు. నేనాతని కేయపరాధమును జేయలేను. నే నాతనియొక్క యే వస్తువును నోట గరచుకొనలేదు."

భగవానుడాతని పిలిపించి అడిగెను. ఆతడు నిజమును నిట్లు చెప్పెను:- "ప్రభూ! ఇది నాకేమియు నపరాధ మొనర్పలేదు. ఇది నా యెదుట నాలుకనుజాచి రొప్పుచున్నది. నా కేదో విషయములో గోపము వచ్చినది. నేనా కోపమును దీనిపై జూపించినాను. ఒక్కకఱ్ఱతో బాదితిని నడుము విరిగినది. దీనికి మీరే దండనమును విధించిన దానినంగీక రించెదను "

ఇది విని భగవానుడొక నిర్ణయ సమితి నేర్పాటుచేసి, ఆ బ్రాహ్మణు నకు దండమును నిశ్చయింపవలయునని ఆసమితి కాదేశించెను. ఇంతలోనే కుక్క యిట్లనెను:—"ప్రభూ! మీరు నా ప్రథమ సలహాను వినుడు. తరువాత నిర్ణయసమితిని నియోగింపవచ్చును. నే నీతనికొక దండనమును జెప్పెదను."

భగవానుడుత్సాహముతో నిట్లనెను :— "సరియే. సరియే. నీవేది చెప్పిన నా దండము నొసంగెదను."

కుక్కయిట్లనెను:— "ప్రభూ! ఈతని ఫలాని మఠమునకు మఠాధీశ మహంతుగ నొనర్పుడు."

ఇది విని యందరును నవ్వి యిట్లనిరి:— "ఇది దండమా? లేక పురస్కారమా? ఆమఠమందు లక్షలకొలది సంపత్తి కలదు. వేలకొలది రూపాయలాదాయముకలదు. దానికి మహంతుగా నొనర్చినచో నన్ని సుఖముల ననుభవింపగలడు కదా!"

కుక్క ఇట్లనెను:—"దానినేస్వామీ! మీనేను కోరుకొనుచున్నాను. పూర్వ జన్మమున నేనొక మఠాధీశుడగు మహంతును. మంచి మంచి వస్తువుల ననుభవించెడువాడను. శిష్యులచే నడుమును బాదములను బిసికించు కొనెడువాడను. ఇంటింటదిని తిరుగుచుండెడువాడను. రహస్యముగ బాప మొనర్చెడువాడను. ఆ పరిణామ స్వరూపముగ నా నడుము విరిగినది. ముక్కుముక్కనుచు బాధవడుచున్నాను. మహంతైనచో సుఖమెక్కడిది? గొప్పవాడగుట మంచిదికాదు. గొప్పవాడైన గష్టములు చాల గలవు. ముందుగా నీటిలో ముంచెదరు. తరువాత వాడు పొంగిపోవును. తరువాత వాని చర్మమును వలిచెదరు. రాళ్ళబట్టిలోబడవైచి నూరెదరు. వేడినూనెలో వేయించెదరు. అప్పటికీ పెద్దవాడగును, లోకులప్పుడు మెదలక దిని

యుదురు. చూచుటకీ పెద్ద పొట్టలవారికి సుఖమేకాని వాస్తవమున వీరు గొప్ప దుఃఖితులు. మీరీతని మఠాధీశునిగ జేయుడు."



భగవానుడు కుక్క నిర్ణయము నంగీకరించి ఆతనిని గొప్పవైభవముతో నేనుగుపై నెక్కించి ఒక్క గొప్ప మఠమునకు నధీశునిగ నొనర్చెను. ఈవిధముగ భగవానుడు నిత్య నూతన లీలలొనర్చుచుండెను.



ఒక దినమున నొకమహర్షి రాజద్వారముకడకు వచ్చెను. అతడు గొప్పతేజస్వి, ప్రకాశవంతుడు, ప్రభావశాలి, గంభీరుడు. రాగానే ఆతడు గంభీరముగ లక్ష్మణునితో నిట్లనెను. "కుమారా! నేను మహామహిముడును, పరమ తేజస్వియు, మహర్షియునగు నతిబలుని దూతను. శ్రీరామచంద్రుని గలిసికొనదలచు చున్నాను. నాకు మహారాజుని ఆజ్ఞయేమి? నీవు శీఘ్రముగ వారికడకుబోయి నివేదింపవలయును."



మంచిది స్వామీ! నేనిప్పుడే పోవుచున్నాను అని పలికి లక్ష్మణుడు వెంటనే రామచంద్రుని కడకుబోయి యిట్లనెను: "ప్రభూ! మహర్షియగు నతిబలునిదూత పరమ తేజస్వియును తపస్వియు నగువాడు మిమ్ములను గలిసికొనదలచు చున్నాడు, వారికేమియాజ్ఞ?"



మహర్షియొక్క ఆగమమును విని శ్రీరాముడిట్లనెను; "వెంటనే ఆఋషిని నా సమీపమునకు దీసినికొరమ్ము.?

ఆజ్ఞపొందగానే లక్ష్మణుడు మరలవచ్చి, ఆదరముతో నిట్లనెను: "స్వామీ! దయచేయుడు. మహారాజు మిమ్ములను బిలుచుచున్నారు."

లక్ష్మణుని మాటలనువిని అతిబలమహర్షి శిష్యుడాతని వెనువెంట రాజమహలునకుబోయెను. శ్రీరామచంద్రుడు లేచి ఆతని నాదరించెను,

సువర్ణ సింహాసనముపై సాదరముగ గూర్చుండబెట్టి సరళముగా శ్రీరామ చంద్రుడాతనితో నిట్లనెను:—"స్వామీ! మీకు స్వాగతము. నేను మిమ్ముల నభినందించుచున్నాను. అతిబలమహర్షి నాకొరకే సందేశమును బంపి నాడో తెలిసి కొనగోరుచున్నాను. మీవంటి దపస్విని నాతడు దూతగా బంపినాడు. దీనినిబట్టి కార్యమేమో గొప్పమహత్వపూర్ణమైనదని కొనుచున్నాను."

శ్రీరామచంద్రుని మాటలనువిని మహర్షియిట్లనెను:—"అవును ప్రభూ! నేనొక ముఖ్యమును మహత్వపూర్ణమునగు కార్యముకొరకై వచ్చి నాను. మీకు వినవలయునని యుండిన జెప్పెదను?"

భగవానుడిట్లనెను:—"అయితే చెప్పుడు"

మహర్షి రహస్యభరిత దృష్టితో నటునిటుజూచి యిట్లనెను:—"విష యము చాల రహస్యమైనది. అది సర్వథా ఏకాంతములోనే చెప్పదగినది. మనయిద్దరయొక్క యీ విషయము నెవరును వినరని నీవు ప్రతిజ్ఞ నొనర్చుము. మనమిద్దరమును మాటలాడుకొనుచుండగా మధ్యలో నెవ రైన వచ్చినను మనమాటలను విన్నను, మన యిద్దరమధ్యకు వచ్చినను నీవు వానిని వధింపవలయును. ఈ యాశ్వాసనము లభించినసే నేను నివేదించెదను."

ఇది విని భగవానుడు లక్ష్మణునితో నిట్లనెను:—"లక్ష్మణా ద్వారముననున్న ద్వారపాలకుని దొలగించుము. నీవు స్వయముగ ద్వార పాలునికార్యము నొనర్పుము. చూడుము, జాగ్రత్తగా బనిచేయవలయును. నేనును మునియును మాటలాడునంతవరకు లోపలికెవ్వరిని రానీయవలదు. లోపలికెవరైన వచ్చినచో వానిని నిశ్చయముగ వధించెదను. నేను ముని ముందు సత్యప్రతిజ్ఞ నొనర్చుచున్నాను."

లక్ష్మణుడు తలనువంచి భగవానుని ఆజ్ఞను శిరసావహించెను. ఆతడు భగవానునకు ప్రణామమును గావించిపోయెను. ద్వారముకడకు బోయి ద్వారపాలకుని దొలగించి స్వయముగ ధనుర్బాణములను ధరించి, మిక్కిలి తత్పరతతో ద్వారమును రక్షించు చుండెను.

సూతుడిట్లనెను:—"మునులారా! ఈముని యెవ్వరోకాదు స్వయముగ సాక్షాత్కాలుడే మునివేషముధరించి శ్రీరామునకు బరమధామమునకు దయచేయవలసినదని జ్ఞాపకమొనర్చుటకు వచ్చియుండెను. ఏకాంతముగ జూచుకొని యముడు తనయభిప్రాయమును ప్రకటమొనర్ప నారంభించెను.

## లక్ష్మణుడు శ్రీరాముని బరిత్యజించుట

శ్లో॥ నవైస ఆత్మాత్మవతాం సుహృత్తమః
సక్తస్త్రిలోక్యాం భగవాన్ వాసుదేవః ।
నస్త్రీకృతం కశ్మలమశ్నువీత
నలక్ష్మణం చాపి విహాతు మర్హతి॥

శ్రీ భాగ. ౫ స్కం. ౧౯ అ ౬ శ్లో॥

ఇంకెవరైనను ప్రమాదపడగలరేమోకాని కాలుడు మాత్రము ప్రమాదపడడు. ఆతడప్రమత్త భావముతో దనకార్యము లొనర్చుచుండును. ప్రపంచమంతయును గాలాధీనము. కాలునకు విరుద్ధముగ నేవిధముగను నెవడును నేమియును నొనర్ప సమర్థుడుకాడు. కాలుడు బలవంతులందరలో శ్రేష్ఠడగు బలవంతుడు. శాసకులందరలో శ్రేష్ఠడగు

శాసకుడు, ఆతనియాజ్ఞ నుల్లంఘింపగల వారెవ్వరునులేరు. కాలుడు భగవత్స్వరూపుడే. భగవదిచ్ఛచేతనే కాలుడుకార్యము లొనర్చుచుండును. భగవంతునిజూచి, ఆతని యభిప్రాయముననుసరించి వ్యవహారము లొనర్చుచుండును. భక్తుడును, భగవానుడు తప్పితే మిగిలినప్రపంచ మంతయును గాలాధీనమే.

సూతుడిట్లనెను:—“మునులారా! ఏకాంతమున మునిరూపమున నున్న కాలుడు భగవానునితో నేదోమాటలాడ బోవుచుండెను. లక్ష్మణుడు ద్వారముననుండి కావలిగాయుచుండెను. కాలునకును గాపత్సునకును జరుగు గుప్తవిషయము లెవరును వినజాలకుండునట్లును, వీరిద్దరును మాటలాడుకొనుచుండగా మధ్యలో నెవరును దగ్గరకు రాకుండునట్లును జూచుచుండెను.

కాలుడిట్లనెను:—“ప్రభూ! నేను గాలుడను. బ్రహ్మాజ్ఞచే మీ సన్నిధానమునకు వచ్చితిని. బ్రహ్మయిట్లనెను —“మీరు నన్ను సృష్టికార్యమున నియోగించితిరి. కావున నేను యాజ్ఞను పాలించుచున్నాను. మీరు రావణాది రాక్షసులయన్యాయముచే బీడితయైన వృథివీభారమును దీసివేయుటకై కొంతకాల నియమముతో నవనిపై నవతరించితిరి. మీరనుకొనిన గాలనియమము పూర్తియైనది. నేను మిమ్ము బలవంతమొనర్పను. ఆజ్ఞాపింపను. మీరు కాలునకును గాలురు. కేవలము స్మరణమాత్రముచే ననుగ్రహించెదరు. మీకిచ్ఛయున్నచో మీనరలీల నుపసంహరించి నిత్యసనాతన ధామమందుండి నిత్యక్రీడల నొనర్పుడు. ఇంక గొన్నాళ్ళుండవలయు నను గోరికయున్నచో మీరు కొన్నాళ్ళు ప్రజలను దనుపుడు.”

భగవానుడిట్లనెను:— “ధర్మరాజా! నాకు జ్ఞప్తియున్నది. బ్రహ్మ యెట్లు తలచిన నట్లే కాగలదు. ఇప్పుడు నేను నా లీలల నుపసంహరించెదను.”

సూతుడిట్లనెను:—"మునులారా! ఇచ్చటగాలునకును గమనుత్మున కును నీసంభాషణము జరుగుచున్నంతలో నటు ద్వారమున మహాక్రోధి యును, రుద్రావతారుడునగు దుర్వాసుడు తన జడలను విరియబోసికొని వచ్చెను. ఆతనినిగాంచి లక్ష్మణుడులేచి శ్రద్ధాభక్తులతో నాతని చరణము లకు బ్రణామమును గావించెను."

అధికార స్వరమున దుర్వాస మహాముని యిట్లనెను :—"సౌమిత్రీ! నేను రాజారాముని గలిసికొనగోరుచున్నాను. నీవు వెంటనే పోయి నారాకనుగూర్చి చెప్పుము."

లక్ష్మణుడత్యంత వినీతభావముతో మధురవాక్కులతో నిట్లనెను:- "స్వామీ! శ్రీరాముడీ సమయమున నిత్యంతావశ్యకమైన నొక కార్యమందు వ్యస్తుడై యున్నాడు. మీకేదైన పనియుండిన నాతో జెప్పుడు. నేను సర్వ కార్యములను నిర్వర్తించుటకు సిద్ధముగనున్నాను."

గద్దించి దుర్వాసమహాముని యిట్లనెను:-"నీవు గొప్ప యవజ్ఞతను గావించుచున్నావు. నేను చెప్పితిని కదా! నాకు రామునితో బని యున్నదని, నేను నీకు చెప్పను. పొమ్ము! రామునితో నా యాగమును గూర్చి చెప్పుము."

వణుకుచు లక్ష్మణుడిట్లనెను:-"ప్రభూ! మీరొక్కక్షణమాగుడు. మహారాజు అత్యంతావశ్యకమగు దన స్వకార్యమున నేకాంతమున నున్నారు."

ముని పెదవులను గొరకుచు బండ్లు పటపట కొరకుచు, గన్ను లెఱ్ఱజేసి గుడ్లనురిమి అత్యంత క్రోధముతో నిట్లనెను:-"ఓరీ క్షత్రియా ధమా! నీవు నాతపస్తేజములనుగూర్చి బొత్తుగా నెరుగనట్లున్నావు. అందు

వలననే నీవిట్టి ధృష్టతను గావించుచున్నావు. తెలిసికొనుము, నాపేరు దుర్వాసుడు. శాపమే నాకస్త్రము, నన్ను గొంచెపువమానింపగా నింద్రుడు శ్రీహీనుడై దేశములు తిరుగవలసి వచ్చినది. నీవు నాయెదుట నిలిచి ప్రత్యుత్తరమొసంగు చుంటివా? నీవిప్పుడే రామునికడకు బోకున్నచో నీరాజ్యమును, నీసపస్తపురిని, నీపిల్లలను జల్లలను, రాముని, నందరను నేను శపించి భస్మమొనర్చెదను."

ఇది విని లక్ష్మణుడు భయపడెను. ఆతడు బలాబల విచారము కావించెను. ఆతడిట్లాలోచించెను:–"క్రోధియగు నీముని కేదియు నసంభవముకాదు. ఈతడేమైనను జేయగలడు నేనుపోకున్నచో రాజ్యము నంతను భస్మమొనర్పగలడు. పోయినచో గేవలము నన్నే శ్రీరామచంద్రుడు వధింపగలడు. ఒకడు చచ్చి చాలమందిని బ్రదికింపగలిగినచో నొకడే చావవలయును. కావున నేనుపోయి శ్రీరామునకు జెప్పెదను."

ఇట్లాలోచించుకొని ఆతడు చేతులను జోడించుకొని యిట్లనెను:– "సరియే స్వామి! మీయాజ్ఞానుసారమే, నేను మహారాజుకడకు బోయి మీయాగమన వృత్తాంతమును జెప్పెదను."

ఇట్లుపలికి ఆతడు లోనికిబోయెను. మునివేషమున గాలుడు శ్రీరామునితో మాటలాడుచుండెను. వెంటనే లక్ష్మణుడు మధ్యలో వచ్చుట నుగాంచి ఆతడూరకుండి, రహస్యభరిత దృష్టితో లక్ష్మణునివైపు చూచుచుండెను. లక్ష్మణునిపై గాలుని దృష్టిపడినది కాని ఆతడాతనివైపునకు జూడకయే శ్రీరామచంద్రునితో నిట్లనెను:–"ప్రభూ! దుర్వాసమహాముని ద్వారమున నిలుచుండి మిమ్ములను గలిసికొనుట కత్యంతోత్సాహముతో నున్నాడు."

దుర్వాసుని పేరు వినగానే కాలునకు కంపము కలిగెను. ఆతడు లోలోన నిట్లనెను:— "నాపని పూర్తియైనట్లే" భగవానుడును దుర్వాస మహాముని పేరు వినగానే భయపడెను. ఆతడిట్లనెను:– "మహామునిని వెంటనే నాకడకు దీసికొనిరమ్ము."

ఆజ్ఞకాగానే లక్ష్మణుడు దుర్వాసుని గొనిరాబోయెను. ఇచ్చట శ్రీరాముడు వెంటనే కాలుని పిడ్కొలిపెను. శ్రీరామాజ్ఞచే ముని వేషధారి యగుడు కాలు వెడలి పోయెను. లక్ష్మణుడు దుర్వాసమునితో నిట్లనెను: "ప్రభూ! దయచేయుడు. మహారాజు మిమ్ములను బ్రతీక్షించుచున్నాడు.

ఇది వినగానే రోషభరితుడగు దుర్వాసుడు వెడలెను. చేతులను జోడించుకొని లక్ష్మణుడాతని వెనువెంట నేపోవుచుండెను. క్షణమైనాగ వీలులేని కార్యమీమునికేమున్నదో తెలిసికొనవలయునని ఆతడుత్సహించుచుండెను. ఏదో ఆవశ్యకకార్యముండి యుండవలెను. అందులకే ఆతడు నాకు చెప్పుటలేదు."

ఈవిధముగ భావించుకొనుచు లక్ష్మణుడు మునిని గొని ఇనకులోత్తమునికడకుజేరెను. మునిరాకనుగాంచి భగవానుడు పాదములను గడిగి, పూజించి కుశలప్రశ్నలనడిగి, ఆతనిరాకకు కారణమడిగెను.

శ్రీరాముని పూజను విధ్యుక్తముగ స్వీకరించి దుర్వాస మహాముని యిట్లనెను:– "రాఘవా! నేను సహస్రవర్షము లుపవాసవ్రతమును గావించితిని. నేడావ్రత సమాప్తి దినము. కావున నేను నీభోజనమును యాచింపవచ్చితిని. ప్రత్యేకపుటేర్పాటు లేమియును బనిలేదు. మీ వంటయింటిలో నీసమయమున కేమాత్రము సిద్ధమైయున్నదో దానినిబెట్టి తృప్తి గావింపుము."

ఇది వినగానే లక్ష్మణునకు నవ్వువచ్చెను. ఆతడు నెత్తిబాదుకొని యిట్లనెను:- "మునిబుద్ధి యెంతటి విచిత్ర మైనది. భోజనము సదుపగం సియుండిన నాకుజెప్పవచ్చును గదా! నేను భోజనమును బెట్టింపలేనా యేమి? ఈచిన్న విషయమునకై నాప్రతిజ్ఞను భంగమొనర్చినాడు. మునియొక్క యీ విషయమునకు లక్ష్మణునకొక కథ జ్ఞాపకమునకు వచ్చెను. ఎవరో ఆతనికి జెప్పియుండిరి. సరయూనదీ తీరమున నొక గొల్లవాడు గొఱ్ఱెలను మేపుకొనుచుండెను. రెండవగొల్ల ఆవలియొడ్డు నుండెను. శ్రావణ భాద్రపదము లందు సరయూనది పొంగియుండెను. అగాధజలము. ఈవల నున్నగొల్ల ఆవలగొల్ల నిట్లు కేకవైచెను. "ఏమోయీ!ఇచ్చటికి రమ్ము. నీతో నొక అవసరమైన విషయమును జెప్పవలసియున్నది."

అతడిట్లనెను:- "ఎట్లు రాగలనయ్యా! మధ్యసరయూ ప్రవాహము కలదుకదా! నీవడుగదలచినదేదో అచ్చట నుండియే అడుగుము."

ఈవలనున్న గొల్ల యిట్లనెను:- "కాదయ్యా! పని చాల అవసర మైనది. నీవెట్లుంటివో అట్లే నావద్దకు రమ్ము. చెవిలో జెప్పదగిన రహస్యము. పాపమా గొల్లవాడేమి చేయగలడు? ఏదోవిధముగ నాతడు సరయూనదినిదాటి వానికడకువచ్చెను. యిట్లనెను:—"చెప్పుము, ఏమడుగ దలచితివో?"

ఆతడీతని చెవిలో నిట్లనెను:- అడుగదలచిన దేమనగా "రేపు గొఱ్ఱెలమంద నేవైపునకు మేపబోయెదవు?"

ఆగొఱ్ఱెలకాపరికి చాలకోపమువచ్చి యిట్లనెను:- "బుద్ధి లేనివాడా! ఇదేమి రహస్యపుమాట. అచ్చటనుండియే అడుగవచ్చును గదా! నాకు వృథాగా నింతటి శ్రమను గలిగించితివి."

లక్ష్మణుడు చింతించుచుండెను. ముని నేమనగలడు? భోజనము కొరకింత గడబిడచేసినాడు. శ్రీరాముడు వెంటనే మునికి మిక్కిలి ఆదరముతో షడ్రస భోజనము బెట్టెను. తృప్తిపూర్వకముగ భగవత్ప్రసాదనమును గ్రహించి, ఆనందముతో ముని ప్రభువువద్ద ననుమతిని గ్రహించి, తన యాశ్రమమునకు బోయెను.

ముని వెడలిపోగానే భగవానునకు దన ప్రతిజ్ఞ స్మరణమునకు వచ్చెను. ఆతనికి జగత్తంతయును శూన్యముగ దోచుచుండెను. అతడిట్లను కొనెను:- "ఈచేతులు సీతను నిర్వాసనము కావించినవి. తపస్వియగు శంబుకుని శిరస్సును ఖండించినవి, ఇప్పుడు నాప్రాణముల కంటెను ప్రియుడగు సోదరునివధ నీచేతులతో జేయవలసి వచ్చుచున్నది. ఆహా! కాలమెంత నిర్దయమైనది! చేయరాని పనులను నాచే జేయించుచున్నది. నన్ను ఛాయవలె సదా దుఃఖసమయమునను వదలకుండినవానిని, నెన్నడును సుఖమునదెట్టిదో యెరుగని వానిని జీవితకాలమంతయును నిద్రాలస్యములనువీడి నన్ను సేవించినవానిని నేడాతని సేవకు బురస్కారముగ శిరమును ఖండింపవలసి వచ్చుచున్నది. ఇట్టి క్రూరకార్యము నావలన గాదు. ప్రతిజ్ఞ భంగమైన గానిమ్ము" అని యిట్లనేకవిధముల నాలోచించుచు శ్రీరామచంద్రుడత్యంత దుఃఖితుడయ్యెను.

ఆతడు దుఃఖించుటనుగాంచి నవ్వుచు లక్ష్మణుడిట్లనెను:- "ప్రభూ మీరు మీప్రతిజ్ఞను రక్షించుకొనుడు. అనార్యుడగువాడు తన ప్రతిజ్ఞను! నెరవేర్చుకొనజాలకుండిన నాపాపి రౌరవాది నరకాగ్నిలో నిరంతరము త్రేల్చబడును. ప్రభూ! మీరు నిశ్శంకులరై నన్ను మీచేతులలో వధింపుడు. నాకానందమే. ఏలననగా నావధచే గులమంతయు రక్షింప బడగలదు."

ఇది విని యినకులేశ్వరుడింతయు నధికముగ దుఃఖితుడయ్యెను. అతడు తన జాబాలి, కశ్యప, వశిష్ఠాది వేదజ్ఞులగు మంత్రులను ఋషులను బిలిపించెను, సభా సమాచారమును విని అందరును సిర్ఘాంత పోయిరి. ఒక్కరి నోటను నిశబ్దమును వెలువడలేదు. ఆ నిస్తబ్ధతను భంగమొనర్చుచు వశిష్ఠ భగవానుడిట్లనెను :— "రామా! ప్రతిజ్ఞాపాలనమే ధర్మము. నీవు సత్యప్రతిజ్ఞుడవు. నీవు నీ ప్రతిజ్ఞను వీడకుము. నేటి వరకు నీవలన ధర్మవిరుద్ధమగు కార్యము జరిగియుండలేదు. నీవు నీ ప్రతిజ్ఞ నెన్నడును వీడలేదు. ఇప్పుడు కాలము సమీపించినది. నేను నా దివ్యదృష్టిచే దానిని చూచుచున్నాను.

శ్రీరామచంద్రుడేడ్చుచు నిట్లనెను :— "ప్రభూ! నేను నా ప్రాణముల కంటెను ప్రియుడైన నా తమ్ముడగు లక్షణునెట్లు వధింపగలను?

అంత వశిష్ఠుడిట్లనెను :— "రామభద్రా! వినుము. శాస్త్రము వధను వధయనదు. రాజాజ్ఞను భంగమొనర్చిన రాజవధయైనట్లే. స్త్రీని శయ్యమీదకు రానీయకుండిన నామెను వధించినట్లే. బ్రాహ్మణుని దలను గొఱిగించి, ధనహీనుని గావించి దేశమునుండి వెడల నడిపినచో నది అతనికి వధయే. ఈ విధముగనే తన సుహృదుని సోదరుని బరిత్యజించుట ఆతనికి వధతో సమానమే. నీవు లక్ష్మణుని బరిత్యజింపుము. నీవు లేక లక్ష్మణుడు బ్రతికియుండజాలడు."

ఇది విని యేడ్చుచు హృదయమును గఠిన మొనర్చుకొని శ్రీరామచంద్రుడు తన తమ్ముడును సుమిత్రానంద వర్ధనుడునగు లక్ష్మణునితో నిట్లనెను :— "సౌమిత్రీ! నేను నా ప్రతిజ్ఞను సత్యమొనర్చుకొనుటకై నిన్ను బరిత్యజించితిని. ఇప్పుడు నీవు నీ యిష్టము వచ్చిన చోటుకు బోవచ్చును."

ఇది వినగానే లక్ష్మణుని నేత్రములనుండి రెండశ్రు ధారలుప్రవ హించెను. యేడ్చుచు నాతడు శ్రీరామచంద్రునకు ప్రదక్షిణమును గావించి చేతులను జోడించికొని, భూమిపైబడి ప్రణామమును గావించి భవనము నుండి వెడలెను. అతడు సరిగా సరయూతటమునకు వచ్చెను. తనయింటి లోని వారినెవ్వరిని గలిసికొనపోలేదు. సరయూతటమునకు వచ్చి ఆహార పానీయములను గ్రహింపక సరయూజలమందు సమాధినిజెంది కూర్చుం డెను. ఆతడూపిరిని బీల్చుట బొత్తిగా నిలిపివైచెను. అతడు రామరూప మును జితించుచు దన్మయుడయ్యెను. ఇంద్రుడాతనిని సశరీరముగ విమానముమీద గూర్చుండబెట్టుకొని స్వర్గమునకు గొనిపోయెను. అయోధ్యావాసులైన స్త్రీలుగానిండు, పురుషులుగానిండు ఇంద్రుడు కొని పోవుటను జూడలేదు. ఎంత వెదకినను సరయూనదిలో నాతని శరీరము దొరకలేదు. ఎట్లు లభింపగలదు? అది చిన్మయైపోయెను.

సూతుడిట్లనెను :— "మునులారా! ఈ విధముగ శ్రీరామచంద్రునిచే బరిత్యజింపబడిన మీదట లక్ష్మణుడు సశరీరుడై పరలోకమునకు బోయెను. శ్రీలక్ష్మణుని తిరోభానమును విని శ్రీరామచంద్రు డత్యంత దుఃఖమునుజెంది, దీర్ఘ విశ్వాసములు విడువసాగెను.. అతని ధైర్యము సడలిపోయెను. అతనికి ప్రపంచమంతయును శూన్యముగ దోచుచుండెను."

## భగవానుని పరమధామ గమనము

శ్లో॥ స్మరతాం హృదివిన్యస్య విద్ధ దండక కంటకైః ।
స్వపాదపల్లవం రామ ఆత్మజ్యోతిరగాత్తతః ॥

శ్రీభాగ. ౯ స్కం. ౧౧ అ ౧౯ శ్లో॥

జీవునకు సహజ సుహృదుడు శ్రీరాముడు. రామునివదలి కాలము నకు వశీభూతులై, యెవరు విషయసంగమున రమించెదరో వారెనుబది

నాలుగులక్షల జన్మపరంతరలతో బడుదురు. మరల దాము సంసారాగమ గమున బడకుండుటకై యోగులు కన్నులు, చెవులు మొదలైన యింద్రి యములను మూసుకొని యేకాంతమున నేమియునుజూడక యేమియును వినక, ఆహారపానీయములను గొనక కూర్చుండెదరు. వారు శాశ్వతముగ నీజనన మరణములను వదలిపోవలెనని కోరుకొనుచుందురు. దీనికొరకై వారు ఘోరతపము నొనర్చెదరు. సంసృతికి గారణము శరీరమే. శరీర సుఖముకొరకే సంసారమున బడవలసి వచ్చుచున్నది.

ఇంద్రియములకు విషయసంబంధముండెనా యవి విషయము లందాసక్తిని జెందును. ఆసక్తియే బంధమునకు బ్రధానకారణము. అందు వలన యోగిగణము మనస్సుతో విశుద్ధ వ్యవహారమును గావించు చుందురు. ఇంద్రియములకు విషయాహారమునొసంగక వానిని నిర్బలము గావించెదరు. ఈ విధముగ మిక్కిలి కష్టముతో వారు సాధనమొనర్చుచు ననేక జన్మములకు బరమ పదాధికారులగుదురు. ఇట్లుగాక భక్తుల మార్గము సరళమైనది. వారడవులకుబోరు. ఆహారమును విడువరు. కేవ లము తమ సమస్త కార్యములను శ్రీరామచరణములకే అర్పణ మొనరించె దరు. వారేదిచేసినను రాముని ప్రసన్నతకొరకే చేయుదురు. వంటజేసిన రామునికొరకే పూలను దెచ్చిన రామునికొరకే. ఇంత యెందులకు రామునిరూపమును స్మరించుచు మరణించెదరు. వారు విషయముల నన్నిటిని విడువరు. విషయోత్పాదకుడగువానిని గట్టిగా బట్టుకొందురు ఆతనికి గట్టుబడియుందురు. ఆతని కేదిగతియో మనకు నదియేగతి యగును. ఆతడేగతి దాత. ఆతనికి గతియేమిటి? గొప్ప గొప్ప యోగుల కేమి గతియో వీరికినదియే గతియగును. తపసులును బోవుగతికే వీరును బోవుదురు.

సూతుడిట్లనెను:-"మునులారా! లక్ష్మణుడు పరమ ధామమునకు బోయెను. ఇప్పుడు రామునకేమియును దోచకుండెను. ఆతడు లక్ష్మణుని ఆధారమున బ్రదుకుచుండెను. ఆతడే ఆతనికాధారము. ఆతని వియోగముచే శ్రీరాముడు తానాశ్రయ విహీనుడనని భావించు చుండెను. ఆతడు సీతావియోగమును మరచెను. ఆతనికి లక్ష్మణ స్మృతి క్షణక్షణమునను దుఃఖమునొసంగు చుండెను. వెంటనే ఆతడు మంత్రులను, బురోహితులను, నగరనివాసులను బిలిపించి యేడ్చుచునిట్లనెను:-"సోదరులారా! లక్ష్మణుడులేని యీ పురమును, భవనమును, సమస్త ప్రపంచమును నన్నుఖండింప వచ్చుచున్నట్లుండెను. నాతమ్ముడగు లక్షణుడు లేక నేను రాజభవనమున క్షణమైనను నిలువజాలను. లక్ష్మణుడెల్లప్పుడును నా వెంటనుండెడువాడు. నేనును వానివెనువెంట నాతడు పోయిన లోకమునకు బోయెదను. నేడు భరతుని అయోధ్యకు రాజ్యాభిషేక మొనర్పుడు. ఈ కార్యమందాలస్యము జరుగరాదు. నాయాజ్ఞ నవిలంబముగ బాలింపవలయును. నేను నాతమ్ముడు పోయిన మార్గము ననుసరించెదను. నాకెక్కువగ నవకాశములేదు. సమస్త సామగ్రులను శీఘ్రముగ దేవలయును. కుమారిణులగు కన్యకలను బిలిపింపవలయును. వీధులలంకరింపవలయును." వెంటనే రాజ్యాభిషేక ప్రయత్న మొనర్పబడవలయును.

శ్రీరామచంద్రుని యీ దృఢ వచనములను వినగానే అందఱకును హార్దిక దుఃఖము కలిగెను. అందరేడ్వసాగిరి. ఎవ్వరి నోటినుండి ఒక్క శబ్దమైన వెలువడలేదు. భరతుడిది వినగానే మూర్ఛితుడయ్యెను. వెంటనే కుశలవులు లేచి తమ పినతండ్రిని లేవదీసి, పైన సుగంధిత జలములను జిలుకరించి వీవనతో విసరిరి. కొంచెము చైతన్యమురాగానే యేడ్చుచు భరతుడిట్లనెను :— "ప్రపంచములో నందఱికంటె నభాగ్యుడను నేనే.

తమ్ముడగు లక్ష్మణుడే భాగ్యశాలి. అతడు వనమునకు శ్రీరామునకు ఛాయవలె ముందు నడచుచు శథమును బహిష్కరించుచు బోయెను. ఇప్పుడు పరలోకమునకును ప్రభువుకంటె యిందుగా జేరుకొనెను. నేను పూర్వజన్మమున నేమి పాపము నొనర్చితినోగాని యీ రాజ్య సింహాసనము నన్ను వదలలేదు. శ్రీరామ విహీనమైన అయోధ్యలో బదునాలుగు వత్సరములు నేనెన్ని కష్టములతో రాజకార్యములను జక్క పెట్టవలసి వచ్చినదో దానిని నేను తప్ప యింకెవరు తెలిసి కొనగలరు? ఇప్పుడును శ్రీరాముడు నాకేవప్పగించి పరలోకమునకు బోవుచున్నాడు. రాఘవా! నాకాజ్ఞోల్లంఘన మొనర్చిన పాపములభించిన లభించునుగాక, నేను మహాఘోరవాది నరకములం దనంతకాలమువరకు యాతన లనుభవించిన ననుభవింతునుగాక, నేనీయాజ్ఞను బాలించుటకు సర్వథా అసమర్థుడను. ప్రభూ! నాపై గృపజూపుడు. నా కట్టి కఠోరాజ్ఞ నొసంగకుడు అశరణ శరణా! నేను నిజముగ శపథ మొనర్చి చెప్పుచున్నాను. నేను మీరులేక యొక్క క్షణమైనను భూమిపైనుండజాలను. నాయభిషేక విచారమును మీరు వీడుడు. నన్ను రాజుగానొనర్చుట ధర్మ, న్యాయముల రెంటిచేతను ప్రతికూలమైనదే. ఇది నాకు ఘోర న్యాయము కాగలదు. చిరంజీవులగు కుశలవులు యోగ్యులు, శూరవీరులు. న్యాయతః వీరిద్దరే యీరాజ్యమున కధికారులు. కావున గోసలమునకు కుశుని, నుత్తర కోసలమునకు లవుని మీరు రాజ్యాభిషిక్తులుగ నొనర్పుడు. నేను మీ వెనువెంటనే వచ్చెదను."

భరతుని దృఢ ప్రతిజ్ఞనుగాంచి, శ్రీరామచంద్రుడాతని మాటకంగీకరించెను. లవకుశులకు రాజ్యాభిషేక ప్రయత్నములు జరుగుచుండెను. ఆసమయమున సమస్త ప్రజలు నేడ్చుచు మొత్తుకొనుచు హా రామా! హా రామా! యని కేకలువేయుచు శ్రీరాముని సమీపమునకు వచ్చిరి.

వారందరును వెక్కి వెక్కి యేడ్చుచుండిరి. చాలమంది మూర్ఛితులై క్రిందబడిరి. వారియొక్క యీదయనీయ దశనుగాంచి దయాళుడగు వశిష్ఠ భగవానుడు శ్రీరామచంద్రునితో నిట్లనెను:— "ప్రభూ! నీవు మీ ప్రజలలోని స్త్రీ పురుషుల వినతులను విని వారి దుఃఖములను దూర మొనర్పుము. వారి హార్ది కేచ్ఛను గమనించి వారి కనుకూలమగు నాచరణ మును గావింపుము. నీవు వీరి దుఃఖముల నెల్లప్పుడును దూరమొనర్చు చుంటివి."

తనగురుదేవుని మాటనువిని శ్రీరాము డిట్లనెను: "సరియే! స్వామీ! మీరెట్లాజ్ఞాపించిన నేనట్లాచరించెదను. నా ప్రజలు దుఃఖించుటను నేను జూడజాలను. వీరి చివరకోరిక తప్పక నెరవేరగలదు." ఇట్లు పలికి రామచంద్రుడేడ్చుచు నేలపైబడియుండినవారిని స్వయముగ లేవనెత్తి వారి దుమ్మును దులిపి అత్యంత ప్రేమతో నిట్లనెను : "మీరు నన్నేమి కోరెదరు?"

ప్రజలిట్లనిరి:— "ప్రభూ! మీరు మాకు ప్రభువులరును, సర్వస్వ మునునై యున్నారు. మీరు వనములకుగానిండు, సరిత్తటములకుగానిండు, ఋష్యాశ్రమములకుగానిండు. ఎచ్చటికి వెళ్ళినను మేము మీ వెంట వచ్చె దము. కృపాసింధూ! మీరు మమ్ము బరిత్యజింపవలదు. మమ్ము మీచరణ శరణములకు గొనిపొండు."

పురవాసుల పట్టుదలను గాంచి భగవానుడు వారి వినతుల నంగీకరించెను. వారందరును బరమ హర్షముతో భగవానుని వెంట బడిపోవుట కుద్యుక్తులైరి. ఇంతలోనే అభిషేక సామగ్రు లన్నియును ప్రోవుపడెను. రాఘవుడు వేదజ్ఞులగు బ్రాహ్మణులతో గుశుని గోసల పురకిని, లవుని నుత్తర కోసలమునకును విదుక్తముగ నభి

షేకించెను. శత్రుఘ్నుని బిలుచుటకై శీఘ్రగాములగు నశ్వముల మీద బుద్ధిమంతులగు దూతలు పంపబడిరి. భగవానుడిట్లాజ్ఞాపించెను:- "శత్రుఘ్నునితో మేము లీలా సంవరణము కావించుచున్నాము. త్వరగా రావలసినదని చెప్పుడు."

దూతవలన భగవానుడు పరమధామమునకు విజయము చేయుచున్నాడను సంగతిని విని శత్రుఘ్నుడు తన పురోహితులను మంత్రులను బిలిపించి, తన జ్యేష్ఠకుమారుడగు సుబాహువును మథురా రాజ్యమునకభిషేక్తు నొనర్చెను. రెండవ కుమారుడును శత్రుఘాతియనగు శ్రుతసేనుని వైదిక దేశమున కభిషిక్తు నొనర్చెను. ధనమును, సేనను నిర్ధరకును సమానముగ బంచి యాతడతి శీఘ్రమున శ్రీరామచంద్రుని దర్శనమున కయోధ్యాపురికి బోయెను. ఆతడు దారిలో నెచ్చటను విశ్రాంతిని గైకొనలేదు. భయంకరమగు దనకుల క్షయ వార్తను విని యాతడు చింతించెను. కొలది దినములలో నాతడయోధ్యాపురికిజేరి శ్రీరామచంద్రుని పాద పద్మములకు బ్రణామమును గావించి భరతుని పాదములంటెను. లక్ష్మణుడు పరధామమునకు బోయెనను సమాచారమును విని ఆతడత్యంత వ్యాకులతను జెందెను. ఆతనికి ధైర్యమును జెప్పుచు భగవానుడాతనితో నిట్లనెను:- "శత్రుతాపనా శత్రుఘ్నా! నీవు చింతింపకుము. కాలగతి దురత్యయమైనది."

ఇది విని శత్రుఘ్నుడత్యంత దుఃఖముతో నిట్లనెను:- "ప్రభూ! నేను మీయాజ్ఞనెన్నడును నుల్లంఘించలేదు. నేనెన్నడును

మీయెదుటనిలిచి మాటలాడిన వాడనుగాను. సర్వదా తలనువంచి నేను మీయాజ్ఞల నన్నిటిని పాలించితిని. ఒక్కసారి మాత్రము అజ్ఞానముచే మాటలాడితిని, దానికి దండము నాకు వెంటనే లభించినది. ప్రభు పాదపద్మములకు దూరమైతిని కాని, నేడునేను సాహస మొనర్చు చున్నాను. నా కింకొక యాజ్ఞనీయవలదని ప్రభువునకు వినతి నొనర్చుచున్నాను. నేను పుత్రులకు రాజ్యము నొసంగి, సమస్త కార్యములను నెరవేర్చుకొని, మీవెంట వచ్చుటకు వచ్చితిని, మీరెచ్చటికి వెళ్ళినను వెంటవచ్చెదను. మీరెచ్చట నుండినను నచ్చటనే యుండెదను. ఇప్పుడు నేను మిమ్ములను విడువజాలను." శత్రుఘ్నుని యీ దృఢతను గాంచి శ్రీరామచంద్రుడు వెంట వచ్చుట కాతనికనుమతించెను.

భగవానుడు స్వధామమునుజేరు వృత్తాంతమును, ప్రకట లీలా సంవరణ సమాచారమును సర్వత్ర వ్యాపించెను. వినగానే సుగ్రీవ, హనుమంత, జాంబవంత, మైంద, ద్వివిదాది వీరవానరులును వెంటనే అయోధ్యాపురికి వచ్చిరి. రాక్షసరాజగు విభీషణుడును వచ్చెను. సుగ్రీవుడు చేతులను జోడించుకొని యిట్లనెను:- "ప్రభూ! నేను వీరవరుడగు నంగదునకు రాజ్యాభిషేక మొనర్చి సమస్త కార్యములను నిర్వర్తించుకొని నిశ్చింతుడనై యిచ్చటికి వచ్చితిని. మీవెంట వచ్చెదను. ఇది నాదృఢ నిశ్చయము." భగవానుడాతనికి వెంటవచ్చుట కనుమతించెను.

హనుమంతుడత్యంత ముదాసీనుడగుటను గాంచి శ్రీరామ చంద్రుడాతనితో నిట్లనెను:- "పవనకుమారా! నీవు చింతజెందనేల?

నీవు నా లీలా రూపముల నొక్కటనియే భావించ్చెదవు. ప్రపంచ మున నాలీలాప్రచార మున్నంతవరకు, నాకథలున్నంతవరకు నీవా నందముగ నాగుణశ్రవణ మొనర్చుచు బృథివియందు నివసింపుము. నాకథ యెచ్చట జరిగినను నచ్చటికనేక రూపములను ధరించి తప్పక పోవలయును."

అంత విభీషణునితో నిట్లనెను:- "రాక్షసరాజా! నేను నీకొక కల్పమాయు వొసంగితిని. కావున నీవు కల్పాంతమువరకు రాక్షలను శాపింపుము. నన్ను స్మరించుచుండుము. ఈ జాంబవంతుడును, మైందుడును, ద్వివిదుడును గలియుగాంతము వరకుండెదరు. మిగిలిన వానరులందరును నా వెంట రాగలరు."

అందరును శ్రీరామాజ్ఞను శిరసావహించిరి. ఈ విషయములన్నిటికిని నొక్కదినమును రాత్రియును బట్టెను. అందరకును శ్రీరామునివెంట వెడలుట కువ్విళ్ళూరు చుండిరి. ఎవ్వరును దుఃఖపడుట లేదు. ఎవ్వరి చిత్తమును జింతగాలేదు. ఎవ్వరును భయపడుటలేదు. ఈ విధముగ నానగరవాసులందరును సుఖముగ గడిపిరి.

ప్రాతఃకాలము కాగానే నిత్యకృత్యము లొనర్చుకొని భగవానుడు పురోహితులద్వారా తన త్రేతాగ్నులను దెప్పించెను. వేదజ్ఞులగు బ్రాహ్మణులు వానిని గొప్పగొప్ప పాత్రలలో గొనిపోయిరి. వశిష్ఠుడు వైదిక మంత్రములద్వారా మహాప్రస్థానమునకు జరుగవలసిన క్రియలన్నిటి నొనర్చెను. క్రియలన్నియును బూర్తికాగానే

శ్రీరాముడు బ్రాహ్మణుల పాదపద్మములకు నమస్కరించెను. వారందర యనుమతిని గ్రహించి ఆతడు మహాప్రస్థానమునకై భవనము నుండి బయలుదేరెను.

శ్రీరామచంద్రుడు సుందర పీతవస్త్రమును ధరించెను. ఆయనకు ముందు వేదమంత్రములను బఠించుచు బ్రాహ్మణులు బయలుదేరిరి, వెనుక ఆనందముతో సమస్త ప్రజలును, ఆబాల వృద్ధ నరనారీజనమును, వానరులును, ఇతర ప్రాణులును బయలు దేరిరి. శ్రీరామచంద్రుడత్యంత గంభీరభావముతో వెడలుచుండెను. ఆతడు పాదములకు బాదరక్షలనైనను ధరింపలేదు. ఆతడు మౌనమును వహించెను. ఆసమయమున నాతనితేజమద్భుతముగ నుండెను, ఆతడు సాంసారిక చేష్టలేమియును జేయుటలేదు. భగవానుని కుడివైపున శ్రీ పద్మలు మూర్తీభవించి వచ్చు చుండెను. ఎడమవైపున భూదేవి మూర్తీభవించి వచ్చుచుండెను. ఆతని సంహారశక్తి ఆతనికి ముందుగా బోవుచుండెను. భగవానుని అస్త్రశస్త్రములన్నియున్ను మూర్తీభవించి మనుష్య శరీరములను ధరించి ముందునడుచుచుండెను. వేదమాతయగు గాయత్రీదేవి యును, ఓంకారమును, వషట్కారము మొదలగునవన్నియును విప్రరూపములను ధరించి భగవాను ననుగమించుచుండెను. ఆసమయమున స్వర్గద్వారమందరకును. దెరువబడినట్లుండెను. అందువలన నందరును నత్యంతోత్కంఠతతో శ్రీరామచంద్రుని చరణముల ననుసరించు చుండిరి. ఋషులును, బ్రాహ్మణులును, క్షత్రియులును, వైశ్యులును, శూద్రులును, బాలకులును, వృద్ధులును

యువకులును, దాసులును, దాసీజనమును, చివరకు బుర సేవకులును, రాజకర్మచారులును, వేయేల సమస్త జీవులును శ్రీరామచంద్రుని వెంట నానందముతో వెడలుచుండిరి. అగ్నిహోత్రిలగు బ్రాహ్మణుల అగ్నులు వారివెంట నుండెను. మనుష్యులనేల పశు, పక్షి, కీట పతంగాదులును శ్రీరామచంద్రునివెంట స్నేహపూర్వకముగ వెడలుచుండెను. సారాంశమేమనగా నాసమయమున నయోధ్యయందు శ్వాసించు ప్రాణులందు శ్రీరామచంద్రుని వెంటబోని వారొక్కరును లేరు. దర్శించుటకు వచ్చువారును వెంటబడిరి. వారేపనికి వెడలుచుండిరో దానినివదలి శ్రీరామచంద్రుని దర్శించుచు నాతనివెంట బోవుచు ప్రాణులందరును నానందమును బ్రకటించుచుండిర. అందర ముఖమండలలు కమలములవలె వికసించి యుండెను.

ఈవిధముగ మెల్లమెల్లగా నయోధ్యాపురి కర్ధయోజనమునకు బైగాబోయి శ్రీరాముడు గోప్రతారఘట్టము (గుప్తఘట్టము) కడకుజేరెను. అచ్చట నాతడు పవిత్రయు సరిత్తులలో శ్రేష్ఠయునగు సరయూనదినిగాంచెను. అది చాల గంభీరముగ నుండెను. దానిలో దరంగములు లేచుచుండెను. దానిలోని జలమమృతోపమానమైయుండెను. అది శ్రీరామచంద్రునకు స్వాగత మొసంగుటకెగురుచున్నట్లు కనబడుచుండెను. మెల్లమెల్లగా శ్రీరామచంద్రుడందరతో సరయూ నదియొక్క సుందరస్వచ్ఛ సలిలమందు శ్రద్ధతో ప్రవేశించెను.

ఆసమయమున లోకపితామహుడగు బ్రహ్మ లక్షలు కోట్లుగ దివ్యవిమానములను గైకొని భగవానునకు స్వాగత మొసంగుటకు వచ్చెను. ఆతడు దూరమునుండియే యిట్లు ప్రార్థించెను:- "సనాతనా! ప్రభూ! మీరు బాగుగా నను గ్రహించితిరి. మాకు కుతూహలము కలుగకుండునట్లు కృపయొనర్పుడు. మీరు నాట్యమును విడిచివేయుడు. స్వేచ్ఛగా మీకెచ్చటికి వెళ్ళ వలయుననియుండిన వారివారి లోకములను గృతార్థము లొనర్చుచు బొండు."

భగవానుడిట్లనెను:- "బ్రహ్మదేవా! నీవు చెప్పినట్లే కాగలదు" అని పలికి భగవానుడు తన సోదరులతో దివ్య విమానము మీద గూర్చుండి తన సనాతన వైష్ణవధామమునకు బోయెను.

సూతుడిట్లనెను:- "మునులారా! ఈ విధముగ శ్రీరాముడు సశరీరుడై దివ్యవిమానమున బోవుటనుగాంచి సాధ్య, మరుత, చారణ, ఇంద్రాగ్ని మొదలగు వారందరును భగవంతుని స్తుతించిరి. గంధర్వులు గానముచేయసాగిరి. అప్సరసలు నృత్యముచేయసాగిరి. సర్వత్ర రాజారామచంద్రునకు జయజయ యనుశబ్దములతో బ్రహ్మాండము నిండెను.

# భగవంతునితో సమస్తజీవుల పరమగతి

శ్లో॥ సద్యైశ్శోఽభిదృష్టోవా సంవిష్టోఽనుగనోఽపివా।
కౌసలాస్తే యయుఃస్థానం యత్రగచ్ఛంతి యోగినః॥

శ్రీ భాగ. ౯ స్కం. ౧౧ అ. ౨౨ శ్లో॥

వర్షానంతరమున నదీతటమందు చాలవృక్షములు మొలుచుచున్నవి. కంటక వృక్షములు, మొక్కలు, చికిలింత, గరిక, గడ్డి, యింకనెన్నెన్నో మొక్కలు నానావిధములైనవి మొలుచును. ఎవరికైనను నుత్సవమును జేసికొందుమనుకొనిన వారికి గావలసిన పృథివిని బరిస్కరించి ఒకేవిధముగ శుద్ధమొనర్తురు. ఆపృథివి సర్వగమ్యముగ నగును. అచ్చట మొక్కలు, ముడులు తీసివేయబడును. కాని వరద వచ్చినపుడేపరిశ్రమ మొనర్పకయే తటప్రాంతమంతయును జివరవరకు విశుద్ధమగును. అదే విధముగ నెవడైన నాచార్యుడవతరించునపుడు, తన ప్రభావముచే దనయనుయాయులను సంసారసాగరమునుండి దాటించును. భగవానుడు అవతరించినపుడాతని సంసర్గముననుండు కీట, పతంగ, పశు, పక్ష్యాదులన్నియును ముక్తినిజెందును. సమస్థ కర్మబంధనములు తెగిపోగలవు.

శ్రీ సూతుడిట్లనెను:- "మునులారా! శ్రీరామచంద్ర భగవానుడు సశరీరముగ దన పరమధామమగు వైష్ణవ లోకమునకు బోయెను. మిగిలిన జీవులందరునుగూడ సరయూపావన జలము

లందు బ్రవేశించి, తమ శరీరములను బరిత్యాగము కావించిరి. అందరును శరీరములను వదలుటను గాంచి భగవానుడు బ్రహ్మతో నిట్లనెను:– "విరించీ! నావెంటవచ్చు ప్రాణులందరకును సద్గతి కలుగవలయును. ఈ సరయూ నది యందు గోప్రతారఘట్ట (గుప్తార్ ఘాట్) జలముల నెవరు తమ శరీరములతో స్పర్శించెదరో వారవశ్యము కర్మబంధములనుండి బయటబడగలరు."

ఇది విని బ్రహ్మయిట్లనెను:– "ప్రభూ! మీరే సమస్త ప్రాణులకు నేకైకగతి. మీరెవరికే లోకముల నీయదలచితిరో యీయవచ్చును. కీట పతంగ సర్పాదిక జీవులందరును సంతానక లోకములకు బోయెదరుగాక! ఈ లోకము బ్రహ్మలోకమువలె శుద్ధమును, సనాతనమైనది. దేవతాంశజులగు ఋక్షవానరులందరును శరీరములను వదలి తమతమ యంశములలో గలియుదురుగాక! సుగ్రీవుడు సూర్యాంశచే నుద్భవించెను గావున సూర్యమండలమున బ్రవేశించుగాక! మిగిలిన వానరులందరును దమ తమ అంశములగు దేవతలందు గలియుదురుగాక!"

బ్రహ్మ పలుకులను భగవాను డనుమోదించెను. బ్రహ్మ తనవెంట నసంఖ్యాకములగు విమానములను దెచ్చెను. సరయూ నదిలో బ్రవేశించి శరీరములను విడిచిన వారందరును దివ్య దేహములతో విమానములలోనికిబోయి కూర్చుండిరి. విమానములు వారినిదీసికొని దివ్యలోకములకు బోవుచుండెను. ఆ సమయమున దృశ్యము మిక్కిలి కరుణాజనకముగ నుండెను. అందరికన్నులందు

నశు్రిపులు నిండియుండెను. రామ ప్రేమలో మునిగి అందరును రామనామము నొనర్చుచు సరయూజలములలో బ్రివేశించుచుండిరి. అందర యొక్క భౌతిక శరీరములు ప్రాణహీనములై సరయూ నదియందు మునుగుచు దివ్యరూపములతో నందరును బరమ ధామము నకుబోవుచుండిరి. ఈవిధముగ నయోధ్యావాసులందరును బరమ పదమునకుబోయిరి.

అంత శౌనకుడిట్లడిగెను:- "సూతా! అయోధ్యాపురియందు జీవులులేకపోయిరికదా కుశలవు లెచ్చట రాజ్యమొనర్చిరి. ఎవ్వరును లేకుండిన వారు శాసనమెవరిమీద జేయగలరు?"

ఇది విని సూతుడిట్లనెను: "సర్వజ్ఞుడగు రామచంద్రుడన కంతయును ముందుగనే తెలియును. అందువలన నతడు కుశుని గోసలదేశమునకు మొదటనే రాజుగా నొనర్చెను. ఆతడు రాజధా నిగా వింధ్యపర్వత ప్రాంతమున గుశావతీ యను నగరమును జేసికొనెను. శ్రీరామాజ్ఞను శిరసావహించి కుశుడు కుశావతికిబోయి తనమంత్రి పురోహితులతో నివసించు చుండెను. ఇదేవిధముగ లవుని నుత్తర కోసలమునకు రాజుగా నొనర్చెను. ఆతని రాజధాని శ్రావస్తి. ఆతడు తన శ్రావస్తీపురమున నివసించు చుండెను. మహాప్రయాణ సమయమున కుశలవులుకాని, భరత, లక్ష్మణ, శత్రుఘ్నుల పుత్రులుగాని అచ్చట నుండగూడదని శ్రీరాముని యాజ్ఞ. అందువలన నీయెనిమిదిమంది సోదరులలో నెవ్వరును నచ్చటనుండక, అందరును దమతమ రాజధానులలోనుండిరి.

శ్రీరామచంద్రు డయోధ్యనంతను ఖాళీచేసి పరమధామమునకు బోయెను. చాలరోజుల వరకు శ్రీరామవియోగమున నయోధ్యాపురి శిథిలముగనే యుండెను, అది ఘోరవనముగ నయ్యెను. తరువాత రఘువంశజులగు రాజులువచ్చి మరల జీర్ణోద్ధారణమును గావించిరి. ఈవిధముగ శ్రీరామచంద్రుడు పదమూడువేల సంవత్సరములు నరలీల నొనర్చి పరమ ధామయనకు బోయెను."

ఇది విని శౌనకుడిట్లనెను: "సూతా! నీవు రామచరిత్రమును దుఃఖాంత మొనర్చితివి. దుఃఖాంత కావ్యములను మనీషులగువారు ప్రశంసింపరు. ఇది మన ప్రాచీన సంప్రదాయము. ఎట్టి కరుణా రస భరితమైన కథయైనను జివరకు దానిని సుఖాంత మొనర్చె దరు. నాయకుని వియోగవర్ణనమునుగావించి చివర కేదో విధముగ సంయోగమును గలుగజేయుట తప్పక జరుగు చుండెను. రాము డెట్లు నిత్యుడో ఆతని ధామము నట్లే నిత్యమైనది. త్రేతాయుగ మున నొక్క రామనవమినాడే రామావతారము జరిగినదికాదు. ఎప్పుడెప్పుడు చైత్రనవమి అనగా రామనవమి వచ్చుచుండునో అప్పుడప్పుడాతని అవతారము వచ్చుచునేయుండును. ఆతని యవతారమును, వివాహమును, వనగమనమును పట్టాభిషేకము నిత్యమును జరుగు చుండును. రామ ధామములవలె నాతని లీలలును నిత్యములే. శ్రీరాముడెన్నడును వృద్ధుడుకాడు. ఆతనికి మీసములు గడ్డములురావు. ఆతని వెండ్రుకలు నెరియవు, శరీరము ముడుతలు పడదు. ఆతడెల్లప్పుడును పదునారు సంవత్సరముల యువకునివలె నుండును. ఆతని రూపమున బరివర్తనముండను. ఆతని శరీరము

మీద నవస్థాపరిభావము పడదు, ఏలననగా నాతని శరీరము ప్రాకృతముకాదు. చిన్మయము. కావున నామ ధామలీలలవలె నాతని రూపమును నిత్యమైనదే. అది యెన్నడును ప్రాతపడదు. అది నిత్యనూతనముగ గన బడును. అట్లే సీతయును నిత్యకిశోరి గనే యుండును. ఈదంపతులు నిత్యమయోధ్యలో గనకభవన మందు కమనీయ క్రీడ లొనర్చు చుందురు. దాసదాసీజనములు వీరి పరిచర్యలో నిమగ్నులై యుందురు. అప్రియతముల సేవ లొనర్చుచు నాభవనమున సంచరించుచు దివ్యసుఖము ననుభవించు నానిత్యసఖులు న్యులుధ.

శౌనకుడిట్లనెను: "సూతా! ఈ గుప్తాఘట్ట లీలచే మా మనస్సులు ద్విగ్నములైనవి, మరల నొక్కసారి సంక్షేపముగ దానిని సమాప్తి గావింపుము."

సూతుడిట్లనెను: "సరియేస్వామీ! ఇప్పుడు నేను సుఖాంత రామచరిత్రమును సంక్షిప్తముగ నొనర్చి యీపుణ్య ప్రసంగమును సమాప్తి గావించెదను."

# సుఖాంత రామచరిత్రము

శ్లో॥ ధూపదీపైః సురభి బిర్మండితం పుష్పమండనైః।
స్త్రీపుంభిః సురసంకాశైర్జుష్టం భూషణ భూషణైః॥
తస్మిన్ స భగవాన్ రామః స్నిగ్ధాయం ప్రియయేష్టయా।
రేమే స్వారామధీరాణామృషభః సీతయా కిల॥

భాగ. ౯ స్కం. ౧౧ అ ౩౪, ౩౫ శ్లో॥

మానవుడు దేనిని దినునో దానినే తన దేవతకు నివేదన మొసంగును. ఎవరికే సంబంధము ప్రియముగనుండునో ఆ సంబంధమునే భగవానునితో స్థాపించుకొనును. భగవానుడందర కును ప్రభువు. ప్రపంచములోనైదే సంబంధములుకలవు. జీవేశ్వర సంబంధము, మిత్ర సంబంధము, స్వామి సేవక సంబంధము, పితాపుత్ర సంబంధము, పతిపత్నీ సంబంధము. వీనిలో నన్నియును నంతర్గతములై యున్నవి. కావున భగవానునియందు శాంత, దాస్య,సఖ్య, వాత్సల్య, మధుర సంబంధములను స్థాపించుకొని రతి సల్పుదురు. సాంసారిక సంబంధము శరీరము నశింపగానే నశిం చును, కాని భగవంతుని శ్రీ విగ్రహము చిన్మయము. అది యెన్న డును నశింపదు. కావున భగవంతునితో నేసంబంధమును బెట్టుకొ నినను నిత్యమే కాగలదు. ఎడతెగకుండును, స్థాయిగనుండును. భగవాను నెవడేభావముతో భజించునో భగవానుడును వానికట్టి వాడే యగును.

సూతుడిట్లనెను:- "మునులారా! భగవానుని ప్రాదుర్భావమయోధ్యయందు జరిగినదనిన నదివరకయోధ్య లేదనియు నెక్కడనో బాలకుడై యయోధ్యకు వచ్చినాడనియు భావింపరాదు. ఆతడు నిత్యాయోధ్యయందు నివసించును. ఆవిర్భావ తిరోభావములు కేవలము రసవృద్ధికై మాత్రమే జరుగును. అదొక అవస్థ. దశరథ చక్రవర్తి పట్టపురాణియగు గౌసల్యాదేవి యుదరమునుండి యవతరించినాడు. ఆతని మిగిలిన మూడంశములనుండి భరత, లక్ష్మణ, శత్రుఘ్నులు, కైకేయి, సుమిత్రలను రాణులకుబుట్టిరి. బాలకుడై అమాయకుడైన మనరాముడు చకిత దృష్టులచే నటునిటు నాడుచుండెను: ఇటునుండి అటు నింకొక చంకకును, దరువాత నింకొకరి కడకును బోవును. నందర చిత్తములను హరించుచు, నందరను నానందింపజేయుచు, నందర మనస్సులకు నుల్లాసమును గలుగజేయుచు మనోహరమగు బాలలీలలను బ్రదర్శించుచుండెను. ఒక్కొక్కప్పుడేడ్చుచు, నొక్కొక్కప్పుడు పాడుచు నొక్కొక్కప్పుడుయ్యాలలో నిద్రించుచు నొక్కొక్కప్పుడు లేచి కాళ్ళు విదిలించుకొనుచు, నొక్కొక్కప్పుడమ్మా! అమ్మా! యని కౌసల్యాదేవిని బిలుచుచు నొక్కొక్కప్పుడు వృద్ధుడగు దండ్రికడకు పరువిడి, అతని గౌగలించుకొనుచు అతనితో బాలు, అన్నమునుదినును. తినుచు దినుచు బారిపోవును. బాలకునితో నాడుచు గోలాహలమును గావించును. ఆతనితల్లి నానందింపజేయును. పట్టుకొందమనిన జిక్కకుండును. దూరమునుండియే పారిపోవును. దగ్గరకు రాడు. భరత, లక్ష్మణ శత్రుఘ్నులను బిలుచును. ఇంకను

దోడిబాలురు కూడుదురు. వివిధ విధములగు నాటలనాడును. ధనుర్విద్యను నేర్చుకొనును. ఎవరినైన గుఱ్ఱముగ జేసికొని యెక్కి సవారిచేయును. అతనిని గొరడాతో కొట్టి పరువెత్తించును.

భగవంతుడై యిట్టి లీలలేలజేయును? ఇప్పుడు నీవిట్లు ప్రతి విషయములోను నేలయిట్లొనర్చెనని అడుగవలదు. ఆటలో నడుగని దెందులకు? నీ వెవరినైనను ప్రేమించియుండిన దెలియగలదు. ప్రేమలో నోట నేమాటలువచ్చిన నవి పలుకబడుచుండును. మా ప్రియుడేవిః చేసినను నదియే బాగుండును. అదియే మనోహరముగ నుండును. మా ప్రియునినోటి నుండి యేశబ్దము వెలువడినను నది యమృతమే. అతని వాక్కులలో నాశబ్దము మిళతయై సరసమగును. శ్యామసరోవరమున నేవస్తువును బడవైచినను నది శ్యామలమే కాగలదు. భగవానుడేది చేసినను మంచికే చేయును, మంగళముననే చేయును, కల్యాణ ప్రదముగ నొనర్చును. ఆతడేరూపమును ధరించినను నదియే మనోహరమగును. ముఖమున మసిపూసు కొన్నను నామసియును నందముగనే యుండును. శరీరమును దూళీధూసరిత మొనర్చుకొనిన దానితో గూడిన యాతను శోభనుగాంచి శోభారాణి లజ్జితయై ముసుగును వైచికొనును. రాముడేల యిట్లొనర్చుననుటకు సమాధానమును వినుడు. ఆతడానందము కొరకొనర్చును. ప్రాణులను సంసారసముద్రమును దాటించుట కొనర్చును. అసలురహస్య విషయమేమనగా నాతడు భక్తులకానందమును గూర్చుటకొనర్చును. ఏల సత్యము కాదు? నీవు నిజమనుకొనుము, అబద్ధమనుకొనుము. ఆతనికడ నన్నియునుసత్యములే. ఏలననగా నాతడు సత్యస్వరూ

పుడు. అసత్యముతో నాతనికి సంబంధములేదు. ఆతడు చూచుటకు పసిపాపడుకానిచో బుత్రుడై కౌసల్యా దశరదులకానందము నెట్లు కలిగింపగలడు? కావున వారికానందము నొనగూర్చుటకై బాలకు డైనాడు. తల్లిపాలను గుటుకు గుటుకున ద్రావును. ఆకలియైనచో నేడ్వనారంభించును. తల్లినిగరచుకొనును. ఆమెకొంగును బట్టుకొని గారాబములు బోవును. పెద్దపెద్ద కన్నులకు దల్లి యొక్క వగ గంటినిండ గాటుకను బెట్టును. కుడివైపున బుగ్గను దన రామునకు దృష్టితగులకుండుటకై చుక్కను బెట్టెను. ఎట్టిలీల? ఎవని దృష్టిచే బ్రపంచము విలీనమగునో, అచరములు సచరములగునో, సచరము లచరములై విలీనమగునో ఆట్టి వానికి దల్లి అతని రక్షణకొరకు కాటుకచుక్కను బెట్టును. పులిగోరు పతకమును భూత ప్రేత పిశాచ బాధకలుటకుండునట్లు ధరింపజేయును, రాముడు భయపడ కుండునట్లు చూచును. తల్లి దండ్రులకు సుఖమును గలిగించిన మీదట నిప్పుడు సఖులవంతు వచ్చెను. సఖ్యరసమునుగూడ నభి వ్యక్తము కావింపవలసియున్నది. మోకాళ్ళ మీదబ్రాకి యిప్పుడు తప్పటడుగులు వేయజొచ్చెను. సహవాసగాంభ్రదను గూర్చుకొను యోగ్యత వచ్చెను. సఖుల మెడులమీద జేతులనువైచి కలిసిమెలసి మాటలాడుకొనసాగెను. సఖుల దృష్టిలో నాతను పెద్దవాను. తల్లి దండ్రుల దృష్టిలో నాతడు సదా బాలకుడే. పిల్లలు రాగానే ఉజ్జులు వేసికొని ఆనుకొనజొచ్చెను. అందర హృదయములలోను దూరి రసధారను బ్రవహింప జేయుచుండును. ప్రపంచములో సఖ్య సుఖము ననుభవించనివాడేమియు ననుభవింపనివాడే, దేహము

వేరైనను నొకే ప్రాణ సమాచారమును గావించుటమే సఖ్యరసము యొక్క విలక్షణత. ప్రియులగు సమ సఖుల దృష్టిలో రాము డెప్పుడు నట్టివాడే. అతడు తమకాటగాడు, సహవాసగాడు. వారికి బాలరామునితోడను, రాజారామునితోడను నేమియును బనిలేదు. రాముడు తమ సఖుడని మాత్రమే వారెరుగుదురు. కాని రాముడు పెరుగుచున్నాడు. అతడు పెద్దవాడు కావలెను. పిల్లవాడు పెద్దవాడు కావలయునుగదా? యువకుడయ్యెను. యువకుడేల నయ్యెనయ్యా? మరల నదేమాటయ్యా? ఈ ముక్కుబులాకుల ముదితలకును సుఖ మీయవలదా? స్త్రీలకన్నులు యువకులపైబడెను. ఆతని నిత్యశక్తి యగు జానకి జనకపురమందును, అతడయోధ్యయందు నున్నాడు. వీరిద్దరును గలియుటెట్లు? పెండ్లికొడుకు కానిది కలయిక సంభవముకాదు. కేవలము పెండ్లికొడుకైనను ప్రయోజనములేదు. పెండ్లికూతురులేక రాముని బెండ్లికొడుకుగ బొందవలసినవానికి ముక్కుబులాకి, చూడామణిని ధరింపవలసియుండును. పాపిడి యందు సిందూరమును ధరింపవలయును. హావభావ కటాక్షములను బ్రసరింపజేయుచు, ముసుగు చాటునుండి, క్రీగంటజూచుచు బెండ్లికొడుకును మరపింపగల శక్తి కలిగియుండవలెను. అప్పుడే ఆమె పాణిగ్రహణ మొనర్చును. అపరిచితుని దనవానిగా జేసి కోనుట సహజ కార్యముకాదు.

రాముడు పెండ్లికొడుకై జనకపురమునకు బోయెను. అందర కానందమును గలిగించెను. సీతను స్వీకరించెను. ఆమెతో నానంద విహార మొనర్చుచుండెను. పెండ్లికొమరుడగు రామచంద్రుని

గాంచి చాలమంది మనస్వులగు బురుషులును మీసములను దీసి వైచి చీరెనుధరించి సఖీ జనములైరి. ఇంకొకడై యుండిన దిరస్కరించి వెడలుగొట్టువాడే. పోపొండు మాయవేషములను వైచినారనెడు వాడే. కాని రాముడు మాయవేషములను గూడ యథార్థములుగ భావించును. ఆతడు మిక్కిలి దయాళుడు. గొప్పసరసుడు. కాని సరసమత్త వారింటనే. రాజసింహాసనమున గూర్చుండిన జాల కఠోరుడగును అందువలన మిథిలలోని భావనోపాసకులు వివాహ మైన తరువాత శ్రీరాముడు మిథిల నుండి యెన్నడు నయోధ్యకు బోలేదని చెప్పుదురు. అత్తవారింటనే యుండెనట. అత్తవారిం నివాసము స్వర్గమునకు మించియుండును. కావున సీతని కత్త వారింట నుండు సనాతనాచారమలవడినది. సముద్రుని కూతురగు లక్ష్మిని వివాహమాడి సముద్రమందే నివసించెను. శివరూపమున హిమవత్పుత్రియగు పార్వతిని బాణిగ్రహణమొనర్చి ఆతని గృహ ముననే శాశ్వతముగ నివసించు చుండెను. అదేవిధముగ సీతను గైకొని జనకపురమందే ఒక భవనమును నిర్మించుకొని సుఖముగ గాపురమొనర్చు చుండెను. ఇంకేమున్నది, రావణవధ, సీతాప త్యాగము, ప్రపంచమందంతయును గలవరమును జెందుట లే పోయినది. నిత్య వివాహము, నిత్య మనుగుడులు, నిత్య కానుక నిత్యవేడుకలు, నిత్య కలియక ఇవన్నియును జరుగుచుండెన మరుదండ్రతో బరియాచకముల కవకాశము లభించుచుండెను. ఇ నుండి పోవుచు, అటునుండి వచ్చుచు రెండు మధురవాక్యముల బలికి పోవుచుండెడి వారు. రాముడు చిఱునవ్వు నవ్వెడు వాడ ఆ నవ్వు వలన వారికి బారితోషికము లభించునట్లుండెడిది, అం

వలన మిథిలోపాసక భక్తులు వివాహమునకు బైనగల లీలలను జదు వనే చదువరు. వివాహమునకు దరువాత నేమైన నుండిన గదా చదువుటకు. ప్రపంచములో ముఖ్యవస్తువు వివాహమే. వివాహమైన నన్నియునైనట్లే. ఇప్పుడిక యంతయును సుఖమే. అది వర్ణింప దగిన వస్తువుకాదు. అవర్ణనీయ విషయము. కాని మిగిలిన భక్తులు తమ రాముని నింటియల్లుడుగ నెట్లు చూడగలరు ? ఇల్లిటపు టల్లు డను మాట వినగానే వారుభయపడుదురు. మనవాడు పెండ్లికూతు రింట నుండుటయా ? అట్లైన్నటికినిగారాదు. రామునకు వివాహ మొనర్చు నధికారమే లేదు. ఈపని దశరథునిది వశిష్ఠ విశ్వామి త్రాది పెద్దలది. ఒంటరిగా రాముడత్తవారింట బాదమునైనను బెట్టడు. పది పదునైదుసార్లు రాకపోకలు జరిగి సంకోచము దూర మైన నదివేరు విషయము. అడుగడుగునకును సంకోచమున్న చోటునకు సంకోచియగు రాడుడొంటరిగ బోగలడా ? ఆతడు వివాహవిషయమును నోటి నుండి వెలువరచగలడా ? తన వివాహ విషయమున్నదని ఆతనికి దెలిసి యుండినచో నాతడు జనకపురము నకు వెళ్ళియే యుండడు. ఈ గింజలపై వలలు, ఉచ్చులున్నవని తెలిసిన నాపక్షులా గింజల కొరకుపోవు; కాని వలలో వైచువారు మాయగా జాల తెలివితేటలతో బిలిచి పడవేయుదురు. వృద్ధతపస్వి యగు విశ్వామిత్రు డిట్లనెను :— "అబ్బాయీ ! జనకపురమున నొక యజ్ఞము జరుగుచున్నది. చూడబోయెదము." "పోవుదము; సరియే ! " అని రాముడనెను. అమాయకుడగు రామునకు యజ్ఞ మందేమి ఆసక్తి ? దీనిలో నేమి రహస్యమున్నదో ఆతని కేమి తెలియును ? అమాయకుడాయెను. పిల్లవాని నుబ్బించి "నీ వాపని

చేసినచో మొనగాడ" వనినచో నాతడు చేసివేయును. ముని శ్రీ రామచంద్రునితో నిట్లనెను :- "రామా ! నీవు శివధనస్సును నెక్కిడ గలవా ? " రాముడిట్లనెను : "నే నెక్కిడుటయే కాదు విరువగలను, వంచగలను, ముక్కలు ముక్కలుగ చేయగలను." "మంచిది సరే ! అట్లే చేయుము. నీవీరతను జూతము" అని విశ్వామిత్రుడనెను. రాముడును ధనస్సును విరిచి మాయలో బడెను. దశరథుడు వచ్చినాడా ? లేక రహస్యముగ బిలిపంపినాడా? ఏమి జరిగినదో వారికే తెలియవలెను. రాముని శిరస్సున మాత్రము ముద్రను వైచినారు. పెద్దల ముందు మాటాడనైన మాటలాడడు. రాముడు తలనొగ్గెను. ఆరోజు నుండి పెండ్లికొడుకు తలను వంచు కొనియే పోవుచుండెను. చాలచోట్ల పూలతో నాతని ముఖమును గప్పుచుందురు. ఆతని మెడకు జానకి కట్టబడెను. ఇప్పుడెన్నాళ్ళ చ్చట నుండుటయని రాముడనుకొనెను. కాని పలుకడు. మెదల కుండును. రెండువైపులను బెట్టే. రాకపోకల విషయమున బెండ్లి కొడుకు సంబంధమున నడుగుట కెవరికిని నధికారము లేదు. ఒక దినమున రథముపై నెక్కి, భార్యతో గూడి వెడలిపోయెను. మహలు నకు వచ్చెను. తల్లుల సంతోషమునకు మేరలేకుండెను. ఏ పూజ నొనర్చినను కొంగుకొంగు ముడివైచుకొనే చేయవలసినదే. ఇద్దరి నొక్కచోట గూర్చుండబెట్టి సమస్తకార్యములను జేయించెడువారు. వెంబడి వెంబడి కలిసి యున్నచో ప్రేమ పెరుగునన్న విషయము మీకు తెలిసినదే. సీతను రాముడు ప్రేమింపసాగెను. ఒకరిని విడిచి మరియొకర్తు లేనంతగ ప్రేమవృద్ధియయ్యెను.

రెండు పాత్రలుండిన జప్పుడె తీరును. సవతులకు బోరుం డనే యుండును. రామచంద్రునికి కలహమున గొన్ని దినములు శాంతముగ నుండవలసి వచ్చెను. దానిలో గొంత రాజనైతిక కార్యము కూడకలదు. రావణాది దుష్టనరపతులు ప్రజలయెడల నత్యాచారము లొనర్చుచుండిరి. వారిని వశపరచుకొన వలసి వచ్చెను. త్యాగమువలన జగడము తీరిపోవును. రావణుని జంపి శ్రీరాముడు తిరిగివచ్చెను. వచ్చి అయోధ్యలో రాజయ్యెను. సింహాసనాసీనుడయ్యెను. ఇప్పుడాతడు రాజైనపుడు రాజువలె నటన మొనర్పవలయును. సోదరులతో నిట్లనెను: "నాలుగు దిక్కులకును బొండు, పృథివియందు దిగ్విజయమును బొందుడు, నేనిచ్చట పురిని రక్షించెదను, పురవాసులను, అనుచరులను బాలన పోషణమొనర్చెదను." సోదరులు దిగ్విజయార్థము వెడలిరి. ఇప్పుడాతడు ప్రతి దినమును జాలవైభవముగ స్వారీచేయ బోవు చుండెను, చాతకులవలె బ్రజలందరును దర్శనమున కువ్విళ్ళూరు చుండిరి. ప్రతిదినము స్వారీకి బయలుదేరినను వెడలని యాఒక్క దినము కల్పమువలె దోచుచుండెడిది. రాత్రియంతయును జింతించు చుండెడి వారు. ఎప్పుడు తెల్లవారునా? యెప్పుడు రామచంద్రుని దర్శింతుమా? యనుకొను చుండెడివారు.

ప్రాతఃకాలము కాగానే అందరును దమ తమ గృహముల యందు చిమ్మి కలయంపిని జల్లి ముగ్గులు పెట్టి చిన్న చిన్న మొక్కలను తీగలను నాటుదురు. మార్గమున బజారులలో సుగంధ జలములను జల్లెదరు. అటునిటు మదపుటేనుగులు తిరుగు చుండె

డివి. వాటి గండస్థలము నుండి మదము స్రవించి నేలపై బడు చుండెడిది. ఆసుగంధముచే వాయువు సుగంధ యుక్తమయ్యెడిది. ఆ దినములలో షోడశశృంగారము లొనర్చుకొని నాయకుని కొరకు ప్రతీక్షించుచున్న నాయికవలె నాపురమంతయును దోచుచుండెడిది. అయోధ్య యందలి సమస్త భవనముల శిఖరములందును, బుర ద్వారములందును, సభా, చైత్య దేవాలయాదులందును గొప్ప గొప్ప కలశములు మిరుమిట్లు కొలుపునట్లు మెఱయు చుండెడివి. పురి యంతయును బుణ్యపతాకముల నెగురవేయుటచే గదలుచు మెద లుచు గిలకిలారవము లొనర్చుచున్నట్లుండెను. బజారులన్నియును స్వచ్ఛ మొనర్పబడి నిత్య సౌందర్యముతో సావధానముగ నలంక రింపబడి నట్లుండెను. ఇంటింటను గదళీ ఫలములు వ్రేలాడు చుండు వృక్షము లారోపింపబడి శోభించుచుండెను. పోక, నారికేళ, తాడి, ఖర్జూరాది వృక్షములు పంక్తిబద్ధములై వరుస వరుసలుగా నెత్తుగా నెంతో శోభించు చుండెను. కొన్నిచోట్ల వస్త్రముతో ద్వారము లేర్పరుపబడెను. వానిలో నద్దము లమర్పబడియుండెను. కావలసిన వారు దానిలో దమ ముఖములను జూచుకొనగలిగినట్లుం డెను. ముఖమును జూచుకొనుటకుసాధారణముగ నందరకునుగోరిక యుండును. ముఖమొట్లున్ననేమి? ఆపురము నిత్యోత్సవ మయవార ముగగనబడు చుండెను. అచ్చటచ్చట నిత్యముగ నుండు వందన ములు కట్టబడెను. శ్రీరాముని స్వారీ బయలుదేరగనే సమస్త నర నారీ జనము ముందునకు వచ్చి, చేతులలో నానోపహారములను బట్టుకొని నిలుచుండెడి వారు. వారందరును నంజలిని ఘటించి

స్తుతి నొనర్చెడి వారు :- ప్రభూ ! పూర్వకాలమున వరాహవేష మును ధరించి యీ వసుంధరను నీవుద్ధరించితివి. ఇప్పుడు రాజువై నీవే దీనిని నిరంతరము పాలన మొనర్చుచున్నావు. ఈ విధము గనే మమ్ములను నెల్లప్పుడును నానందమగ్నుల నొనర్ప వలయును."

శ్రీరామచంద్రుని సవారి నిత్యమును వెలువడు చుండెడిది. నిత్యమునాతడు పురవాసులకు దన దర్శనమొసంగు చుండెడువాడు. కానియిట్లు జరుగుచున్నను ప్రజలు దమస్వామి చిరకాలమునకు వచ్చినట్లు తలంచు చుండెడువారు. నిత్యము నాతని యూరేగింపు నందు నూతనత్వము కనబడు చుండిడెది. రాజపథమునకు రెండు వైపులకునువచ్చి దర్శించెడువారు ముందుగానేవచ్చి నిలుచుండెడు వారు. కులవతులగు మహిళలు తమ గృహములను వదలి అట్టారికలనెక్కి కిటికీలు, గవాక్ష ములకుండ మేలిముసుగులను దొలిగించుకొని కమల నయనుడగు శ్రీరాముని దర్శించెడువారు. అతృప్త నయనములతో గన్నులార్పక జూచెడువారు. తమ హృదయములలోని మధుర భావములను బుష్పవర్షమును గురిపించి అభివ్యక్త మొనర్చెడువారు. ఈవిధముగ నందరకు దర్శన మొసంగుచు, నగర ప్రదక్షిణ మొనర్చి తనపూర్వవర్తులగు పితృ పితామహ, ప్రపితా మహాది మహీపాలురచే సేవింపబడి, సుఖకర, సుందర సమస్తవస్తు సంపన్నంబై, అనంతకోశ పరిపూర్ణంబైన రాజభవనమున బ్రవేశించును. ఇంద్రభవనములనుగూడ తిరస్క రించు నాభవనశోభ నెవరు వర్ణింపగలరు? వాని ద్వారములు

విద్రుమ మణులచే నిర్మింపబడినవి. అచ్చటచ్చట నిర్మింపబడిన స్తంభములు కాష్ఠపాషాణాదులచే నిర్మింపబడినవికావు. అవన్నియును వైదూర్యమణులచే నిర్మింపబడినవి. వానిలో నచ్చటకు వెళ్ళువారికి బ్రతిబింబములు కనబడుచుండెడివి. క్రిందనున్న నేల స్వచ్ఛములగు మరకత మణులచే గూర్చ బడినవి. ఆభవనముల లోని గోడలు స్ఫటికమణియుక్తములు. అవి సుందరములగు గళామర్మజ్ఞులచే సుందరముగ నలంక రింపబడెను. రంగులు రంగులుకల సుందరములగు మాలలు యథాస్థానమున వానికి వ్రేలాడగట్టబడెను. నానారంగులుకల పతాకములచే భవనము సుశోభితమైయుండెను. నానారంగుల్లు గల పట్టుగుడ్డలచే నచ్చటచ్చట నాచ్ఛాదింపబడియుండెను. ఇంటిద్వారములకుగల పరదాలు బహుమూల్యములైన సన్నని పట్టువస్త్రములచే నేర్పరుపబడెను. శుభ్ర స్వచ్ఛములగు ముత్యాల సరములు వ్రేలాడ గట్టబడెను. అచ్చటచ్చట సమస్తేంద్రియములకును సుఖకరముగ దనరు సామగ్రిచే నలంకరింపబడెను. అచ్చటచ్చట అత్యంత సుగంధిత ధూమము వేయబడుచుండెను, సుగంధ యుక్తములగు తైలముల తోడను, మణులతోడను, దీపములు వెలుగు చుండెను. పుష్పగుచ్ఛములచే దీవలేర్పరుపబడి వంకరటింకరులుగ సుందరముగ నలంకరింపబడెను. ఈసామగ్రిల నలంకరించుట చేతనే అవి సుందరములుగ నుండలేదు. అవి అత్యంత సుందరములుగ నుండుటచే నీసామగ్రిలన్నియును శోభాయుక్తములైనవి. అచ్చట సేవకులందరును జాలయందమైనవారు. ఇక దాసీలనుగూర్చి చెప్పవలసిన పనియేమిలేదు. వారందరును స్వర్గస్త్రీల గర్వములను

ఖర్వము నొనర్చినవారే. అందరును నూత్నయౌవనలు వారందను శరీరముల నుండియును పద్మ గంధము వెలువడు చుండెను. అందరు నందగత్తెలే, మనోహారిణులే. ఆభూషణములకును విభూషత గూర్చువారే. వారి యంగములు సుందరముగను, సుకుమారముగను, మనోహరముగను, అనుపమానముగను నుండెను. ఇట్లు చక్కగ నలంకరింపబడిన భవనములందు శ్రీరామచంద్రుడు తన ప్రియయగు జానకితో నిరంతరము విహార మొనర్చుచుండెను. శ్రీరాముడాత్మారాముడు. ఆతడు తనయాత్మయందే రమించును. ఆతని ఆత్మ వైదేహియే. ఆమె ఆతనికి ప్రాణముల కంటె నధిక ప్రియమైనది. ఆమెయొక్క వియోగము నొక్కక్షణమైన సహింప జాలడు. ఆతడు సర్వసమర్థుడు; కాని సీత నెన్నడును వీడ జాలడు. ఆతడన్నిటిని సహింపగలడు కాని సీతావియోగము నూహతోనైనను సహింపజాలడు. సీతయును నిత్య నూతన క్రీడల నొనర్చి ఆతని రసమును వృద్ధికావించును. ఆతనికి సీతారూపము క్షణక్షణము నూతనముగదోచును. ఇద్దరి సౌందర్యమునకు మేర లేదు. ఈ యవతారమందు వైదేహి ప్రాణధనము ధర్మమునకే ప్రాధాన్య మొసంగును. ఆతడు కామోపభోగములను ధర్మపూర్వకముగ నొనర్చెను. ఆతడేకపత్నీ వ్రతమును జీవరవరకు నిర్వహించెను. సీతా సతీత్వమును గూర్చి చెప్పవలసిన దేమున్నది. స్త్రీకి సతీత్వము సంభవమే; కాని బహుముఖుడగు పురుషునకు ఏకపత్నీవ్రతము పరమ ప్రశంశనీయమైనది. దాని పాలనము శ్రీ రాముడు విద్యుక్తముగ నిర్వహించెను. ఆతడు యోధ్యను వదలి

యెచ్చటికిని బోలేదు. వెళ్ళినను నెచ్చటికిబోవును? అయోధ్యయే సాకేతముకదా! దానికంటె నుత్కృష్ట స్థానమున్నగదా పోవుటకు! ఇప్పటికినీ ఆతడు కనకభవనమున నుండి సీతాదేవితో నిత్యలీల లొనర్చు చుండును. ఆతని రామనామమును, అయోధ్యాధామ మును, వివాహాదిలీలలును, అతసీకుసుమ, దూర్వాదళాభశ్యామ స్వరూపమును నిత్యశాశ్వతములే. వానిలో బరివర్తనము లేదు. ఎన్నటికి నుండబోదు. ఇప్పటికిని భాగ్యశాలురగు భక్తులకు గనక భవనమందాతని నిత్య దివ్యలీలలు దర్శనమగుచుండును.

సూతుడిట్లనెను:- "మునులారా! రామచరిత్ర మనంతము. దానికి సమాప్తిలేదు. అంతములేదు. అయినను రామునకింకొక రూపమగు గృష్ణలీలనుగూడ వర్ణింపబోవుచున్నాను. ఈ యవతార మందు రాముడు మర్యాదాజవనికను జించివైచెను. ఈ యవతార మందాతడు తన యనంత సౌందర్యమును, అనంత మాధుర్యమును, అపారలావణ్యము, అనుపమభువన మోహనరూపమును జూపించెను. ఆతని లలిత లీలా లోభమున నిప్పుడు ముందుకు బోయెదను."

శౌనకుడిట్లనెను:- "అయితే సూతా! ఇప్పుడు నీవు మా కాయవతారముయొక్క అనుపమ లీలలనే వర్ణింపుము."

సూతుడిట్లనెను:- "స్వామీ! ఇప్పుడప్పుడే యెట్లు చెప్ప గలను. ఇంకను నా భూమిక పూర్తికాలేదు. నాగురు దేవుడగు శుక మహర్షి శ్రీమద్భాగవతమును ద్వాదశ స్కంధములుగ నొనర్చినాడు. వానిలో దశమస్కంధమే ప్రధానమైనది. దశమ

స్కంధ విశుద్ధికే యీతొమ్మిది స్కంధముల వర్ణనము. ముందుగా మీరు నవమస్కంధమందలి కథలనన్నిటిని వినుడు. ఆ తరువాత దశమ స్కంధమును జెప్పెదను. ఇంకను నొక్కవిషయము మిగిలియేయున్నది. నేను పరమపావనమగు నీ రామచరిత్ర మాహాత్మ్యమును జెప్పనేలేదు."

శౌనకుడిట్లనెను: "సూతా! మహాత్మ్య మవశ్యము చెప్పుడు. దానమొసంగి దాన మహాత్మ్యము నవశ్యము వినవలయును. మహాత్మ్యమును నీవు మొదటనే చెప్పియుండిన బాగుండెడిది. ఫరవాలేదు. దేనిని వినిన రామచరిత్ర శ్రవణమందును బారమందును మరల మరల ప్రవృత్తి కలుగునో అట్టిదాని నిప్పుడు చెప్పుము."

సూతుడిట్లనెను: "మంచిది. స్వామీ! ఇప్పుడే రామ చరిత్ర శ్రవణ పఠన మాహాత్మ్యమును జెప్పెదను. దానిని మీరందరును సావధానులరై శ్రవణ మొనర్పుడు"

## రామచరిత మహాత్మ్యము

శ్లో॥ పురుషో రామచరితం శ్రవణై రుపధారయన్ ।
ఆనృశంస్య పరోరాజన్ కర్మబంధై ర్విముచ్యతే ।

శ్రీ భాగ. ౯ స్కం. ౧౧ అ ౨౩ శ్లో॥

మాహాత్మ్యమును వినకుండిన వస్తువుమీద ననురక్తి కలుగదు. మనసమ్ముఖమున నమృతమున్నను దానిమహాత్మ్యము నెరుగకున్నను, దానికి మహాత్మ్యమున్నదని తెలియకున్నను నది మనకు

వ్యర్థమైనదే కాగలదు. ఒకగొప్ప మహాత్ముడు మన యెదుట నుండి పోయినను మనమాతని మాహాత్మ్యము నెరుగకున్నచో మనకు లభించవలసిన లాభము లభింపదు. మంత్రౌషధముల మాహాత్మ్యము మును విన్ననే రుచి యభివృద్ధియగును. కావున నన్నిటియొక్క మాహాత్మ్యమును వినవలయును దీనివలన నెవరెవరి కెట్టిలాభము కలిగినదో యెరుగ వలయును.

సూతుడిట్లనెను;— "మునులారా! నేను మీకు రామచరిత్ర మాహాత్మ్యము నత్యంత సంక్షేమముగ జెప్పెదను. రామ యను రెండక్షరములలో గొప్ప బలమున్నది. వీని సహాయమున నెట్టి పాపియైనను బావనుడు కాగలడు. నోటితో నుచ్చారణ మొనర్పకున్నను, గేవలము కర్ణములతో విన్నను వానికి ముక్తిలభించును. ఓషధిని సేవించినచో దాని ప్రభావము నది చూపించితీరును. తినకయే కేవలము సూదిద్వారా రక్తములోని కెక్కించినచో నది తత్కాలముననే చమత్కారమును జూపించును. రామచరిత మట్లే అతిమధురమైనది, చిత్తాకర్షకమైనది. కర్ణానందకరమైనది. బాగుగా దెలిసికొని చదవినను, విన్నను నింక జెప్పవలసినదేమున్నది? తెలిసికొనకయే ప్రసంగమున రామచరితమును విన్నను ముక్తి కలుగును. మాటిమాటికిని రామదాసు యను శబ్దములు వచ్చుచుండును. రామరూప, గుణ, స్వభావ, శీల, లీలల వర్ణనమందు వచ్చును. చిల్లగింజను బురదనీటిలో వేసిన నెట్లు మట్టి క్రిందకు బోయి జలమును విశుద్ధమును గావించునో అట్లే రామకథ కర్ణముల ద్వారా హృదయమందు ప్రవేశించగానే దానియొక్క కాఠిన్య

మ్మును, జంచలత్వమును నశింపజేసి అంతః కరణమును సరళము గను గోమలముగను నొనర్చును. ఈ విషయమున ప్రాచీన కాలమందు నారదుడు సనత్కుమార మునీశ్వరునకొక ప్రాచీన గాథను జెప్పియుండెను. దానిలో సౌదాను మహారాజు గౌతమ, శివుల శాపముచే రాక్షసుడైనను రామాయణమును వినుటచే నుత్తమగతిని బొందెను.

ఇది విని శౌనకుడిట్లనెను:— "సూతా! సనకాది మహామునులకును నారదునకును సమావేశమెచ్చట జరిగినది. ఈ కథా ప్రసంగమెట్లు జరిగినది. సౌదాముడెవరు? శివుడాతని నేల శపించినాడు? రామాయణ శ్రవణప్రభావముచే నాతడెట్లు తరించినాడు? మీకుచితమని తోచినచో గృపతో మాయీ ప్రశ్నకు బ్రత్యుత్తర మొసంగుము."

ఇది విని సూతుడిట్లనెను:- "మునులారా! మీరు చక్కగ నడిగితిరి. ఈ ప్రశ్నములవలన శ్రోతలకును వక్తకును మేలు కలదు. రామచరిత మహాత్మ్యమును గూర్చి చెప్పెదను వినుడు. నేను మీ ప్రశ్నలకు యథావత్తుగ సమాధాన మొసంగెదను. ఒకనాడు సనక, దనందను, సనత్కుమార, సనాతను లను నీనల్గురు మునులు తిరుగుచు దిరుగుచు దమ తండ్రియగు బ్రహ్మను దర్శించుటకై సుమేరు శిఖరమున నున్న నాతని సుందరసభకు వచ్చిరి. బ్రహ్మయొక్క నివాస స్థానము సత్యలోకమునందుగలదు; కాని యాతడు చతుర్దశ భువనములందలి పనులను జూడవలసి యున్నది. కావున స్వర్గమునకు బైన సుమేరు శిఖరము మీద

నాతనికొక సభకలదు. దానిమీదకువచ్చి త్రిలోకముల ప్రార్థనా పత్రముల విచారణము సేయుచుండును. ఆజ్ఞల నొసంగుచుండును. ఆసభ మధ్యలో నున్నది. క్రిందనున్న సప్త వివరముల నుండి భూలోక, భువర్లోక, స్వర్గలోకములలోని జీవులు దానిలోనికి బోగలరు. పైన నున్న మహర్లోక, జనలోక, తపోలోక, సత్యలోక నివాసులును నచ్చటికి రాగలరు. అచ్చటనుండి త్రిపథ గామిని యగు గంగ బయలుదేరును. ఆమెకు మూడు ధారలుకలవు. అవి స్వర్గమునకును, పృథివికిని, పాతాళమునకు బోయినవి. స్వర్గ లోకమున నాగంగను మందాకిని యందురు. పృథివియం దల కనందయందురు. పాతాళమున నది భోగవతి యను పేర బ్రసిద్ధిని జెందియున్నది.

ఈ నల్గురు కుమారులు సదా ఐదేండ్ల బాలకులవలె నుందురు; తరుగరు, పెరుగరు. వస్త్రములను ధరింపరు. కామ, క్రోధ, లోభ, మోహ, మద, మత్సరాదులలో బడరు. స్వచ్ఛందులై యిటు నటు తిరుగుచుందురు. ఎక్కడనైనను భగవత్కథ జరిగినచో నచ్చటికిబోయి, అది సమాప్తి కాగానే వెడలిపోవుదురు. వారు తిరుగుట కుద్దేశ్యమిదియే. వారు నోటితో నెల్లప్పుడు 'హరిశ్శరణమ్ హరిశ్శరణమ్' అని పలుకుచుందురు. సుమేరు పర్వతశిఖరమునుండి త్రైలోక్య పావనియగు గంగపడుటనుగాంచి వారత్యానందమును జెందిరి. ఎంత పురాణులైనను బాల్యసులభ చాపల్య మెచ్చటకు బోవును? వారికి స్నానము చేయవలయునను నిచ్ఛకలిగెను. శరీరముపై నేదైన వస్త్రముండినచో దానిని

కీనిపై చి దుముకవచ్చును. దిగంబరులు కావున వెంటనే దుమికిరి. స్నానమొనర్చుచు గంతులు వేయుచు నవ్వుచుండిరి. ఇంతలోనే వారికి వీణను వాయించుచు, హరిగుణగాన మొనర్చుచు వచ్చుచున్న దేవర్షియగు నారదుడెదుటగాన వచ్చెను. నారదునిగాంచి కుమారులు నవ్వి యిట్లనిరి:- "నారదా! నారదా! నీవు వచ్చితివి. బాగున్నది. సోదరా! రమ్ము. చెప్పుము. ఎచ్చటికి బోవుచున్నావయ్యా?"

నారదుడు కుమారులకు బ్రణామమును గావించి యిట్లనెను:- "నేడు మీదర్శనమైనది. నా అదృష్టము. నాకేమి యాజ్ఞయో శలవిండు."

కుమారులిట్లనిరి:- "ఆజ్ఞయేమి కలదయ్యా? మాకు భగవచ్చర్చను శ్రవణమొనర్చు వ్యసనము పట్టుకొన్నది. నల్లమందును సేవించువానికిని, భంగును ద్రావువానికిని, తమాల పత్రమును ధూమపానము నొనర్చువానికి నెట్టి వ్యసన ముండునో వారెచ్చటికి బోయినను ముందుగా వానినే యెట్లు వెదుకుకొందురో, వానినిగూర్చి యెట్లడుగు చుందురో, అదేవిధముగ మాకును హరి చర్చలేకున్న దోచదు. ఏదైనను మధురాతి మధురమగు సుందర హరి చర్చనుగూర్చి చెప్పుము."

ఇది విని ఆనందమును బ్రకటించుచు నారదుడిట్లనెను:- "ఎందులకుండదట్లు? స్వామీ మీరు స్వయముగ సాక్షాత్తుగ బ్రహ్మమానస పుత్రులు. అందరకంటెను జ్యేష్ఠులును శ్రేష్ఠులునై యున్నారు. నాకు సోదరులు. మీకు హరి చర్చయే ఆహారము.

హరిచర్మను గైకొనియే మీరీ శరీరమును ధరించితిరి. మీరు సాక్షాదీశ్వరులు. లోక కల్యాణార్థమై మీరవతారమును గ్రహించితిరి. మీరు కల్యాణ స్వరూపులరు. అయినను జగత్కల్యాణార్థమై మీరు చరించు చుందురు. సమస్తాఘ హారిణియగు హరికథను శ్రవణ మొనర్చుచుందురు. ఉత్తమకులీనుడును, సదాచారియునగు వాడెవడు శ్రద్ధతో రామకథను వినునో, వాని కుద్ధారము కలిగి తీరును; కాని దుష్టస్వభావుడగు వ్యభిచారియును రామ కథా శ్రవణముచే విశుద్ధుడు కాగలడు. రామాయణ కథా శ్రవణముచేతనే శివశాపమున రాక్షసుడైన సౌదాముడు ముక్తిని బొందినాడు.

అంత గుమారులిట్లనిరి :- "సౌదాముడెవరు? ఆతని కెట్లు శాపము లభించినది? ఏవిధముగా నాతనికి ముక్తి కలిగినది? దయతో నీప్రసంగమును మాకు జెప్పవలయును?"

నారదుడిట్లనెను :- "వినుడు. స్వాములారా! పూర్వ కాలమున గంగాతటమున గౌతమ మహాముని నివాసమొనర్చు చుండెను. ఆతని సేవలో సోమదత్తుడను నొక సదాచారియగు బ్రాహ్మణుడుండెను. ఆతడు మునివలన సమస్త శాస్త్రపఠనమొనర్చియుండెను. నిరంతరము శాస్త్రములను వినుటచే నాతడు గొప్ప విద్వాంసుడయ్యెను. ఆతనికి విద్యాగర్వము కలిగెను."

ఒక దినమున నాతడు శివపూజ నొనర్చుకొను చుండెను. ఆసమయమున నాతని గురువగు గౌతమమహర్షి అచ్చటకు వచ్చెను. ఆతడులేచి గురువునకు అభ్యుత్థాన మొనర్పనులేదు, ప్రణామమును

గావించపనులేదు. మొద్దువలె జూచుచు నాతడు కన్నులు లేనివాని వలె నయ్యెను. అతని ఈ వ్యవహారము వలన గురువేమియును బలుకలేదు. కాని శివునకుగొప్ప కోపము కలిగెను. ఆతడు "నీవు రాక్షసుడవు కమ్మని శాపము నొసంగెను"

ఇంకేమున్నది? సోమదత్తుని సమస్తగర్వమును గర్వారమువలె నెగిరిపోయెను. పరువిడి యాతడు గురుని పాదములను బట్టుకొని, యేడ్చుచు నేలపైబడి కొట్టుకొనసాగెను. గురువిట్లనెను: "ఓయీ! నిజమైన నామాటను వినుము. శివుని శాపమును వ్యర్థ మొనర్చు సామర్థ్యము నాకడలేదు. నేనింతవరకు చేయగలను. ఈ శాపము పండ్రెండు సంవత్సరముల వరకు మాత్రముండును. రామచరిత్రమును వినుటచే నీకు ముక్తి కలుగగలదు." ఇది వినగానే సోమదత్తునకు సంతోషము కొంచెముకలిగెను. ఆతడు వెంటనే శాపముచే రాక్షసభావమును బొందెను. ఇప్పుడింకేమున్నది. ఆతడు ఘోరపాతకము లొనర్ప నారంభించెను. గొప్ప గొప్ప యుపద్రవము లొనర్చు చుండెను. మనుష్యులను బట్టుకొని తినసాగెను. ఈ విధముగ నొనర్చుచు నాతడు వనములలో జరింపసాగెను.

ఒక దినమున నాతనికొక బ్రాహ్మణుడు కనబడెను. ఆతడు ప్రయాగ స్నానమొనర్చి గంగాజలమును గొనిపోవు చుండెను. నోటితో నిరంతరము రామయను నీమహామంత్రమును చర్చించు చుండెను. రాక్షసుడా బ్రాహ్మణుని దూరము నుండి చూడగనే మిక్కిలి యానందము కలిగెను. ఆతడు నేడు మంచియాహారము దొరికినదని సంతసించుచు నా బ్రాహ్మణుని పైకి బరువిడగా నాతని

గతి ఆగిపోయెను. ఆతడు ముందునకు బోజాలకుండెను. బ్రాహ్మణుని యీ ప్రభావమును గాంచగానే రాక్షసున కమితాశ్చర్యము కలిగెను. ఆతడు వినయముతో నిట్లనెను: "విప్రవరా! మీరు దన్యులు. మీ తపస్సు ధన్యమైనది. దాని ప్రభావమున నేను మిమ్మలను నేమియును జేయజాలకున్నాను. నేను మిమ్మలను ధర్షింపదలచు చున్నాను కాని, అట్లుచేయజాలక పోవుచున్నాను. నేనింతవరకు లక్షమందిని గోట్లమందిని బ్రాహ్మణులను దిని యుంటిని. రాక్షసుడును మీవైపునకు గన్నెత్తి చూడజాలకుండు నట్లు చేయగల యే మంత్రమును మీరు జపించుచున్నారు? మీరు గొప్ప ప్రభావశాలురు."

గర్గుడను పేరుగల యీ బ్రాహ్మణుడు రాక్షసుని వాక్యములను విని యిట్లనెను: "రాక్షసరాజా! నీవిప్పుడు కాంచుచున్న యీ ప్రభావమంతయును రామ నామ ప్రభావము. నేను నిరంతరము రామనామ జపమును జేయుచుందును. రామ చరిత్రమును శ్రద్ధతో శ్రవణ పాఠనము లొనర్చుచుందును."

ఇది విని యానందమును బ్రకటించుచు రాక్షసుడిట్లనెను: "విప్రవరా! నీవు మంచి స్మరణమును గావించితిని. నేనును బూర్వము బ్రాహ్మణుడనే. గురునవమానించుటచే శివుడు నాకు శాపమొసంగి రాక్షసునిగా నొనర్చినాడు. రామచరిత్రమును వినుటచే నాకు ముక్తి కలుగునని మాగురుదేవుడానతిచ్చినాడు. కావున స్వామీ! మీరు వేద వేదాంగ పారంగతులు, విద్వాంసులరు, సుశీలురు, వినమ్రులు, వైష్ణవులు, పరోపకారులు. మీరు నన్ను

గ్రహించి నాకీ పవిత్ర కార్తీక మాసమందు శుక్లపక్షమున రామ చరితమును వినిపింపుడు."

వైష్ణవులను రామచరిత్రమును జెప్పుమంటిమా వారన్నిటిని మరచిపోవుదురు. గొప్ప గొప్ప ముఖ్యకార్యములను గూడ వదలుకొని రామచరిత్రములందు నిరతులగుదురు. ఆగర్గ బ్రాహ్మణుడు విధ్యుక్తముగ నా బ్రహ్మరాక్షసునకు రామచరిత్రమును వినిపించెను. రామచంద్రునియొక్క మర్యాదామయమును, నానందమయమును, శ్రుతిమధురమునగు కథను వినగానే అతడు రాక్షసత్వము నుండి విముక్తిని జెందెను. ఆతడు దివ్య శరీరమును ధరించి గర్గ మహాముని యెడల దన సమ్మానమును బ్రదర్శించుచు వైకుంఠమునకు బోయెను."

సూతుడిట్లనెను: "మునులారా! ఈ విధముగ దేవర్షియగు నారదుడు సనాకాది మహర్షులకు రామచరిత్ర మహాత్మ్యమును గూర్చి చెప్పెను. రామకథలో రసానుభవము నొనర్పజాలనంతవరకే వాస్తవమున మానవునకు బాపములందు బ్రవృత్తికలుగును రామకథయందు రసానుభవము కలిగినచో నీ సాంసారిక రసము మిక్కిలి తుచ్ఛముగ దోచును. మహాపాపియును, మహావ్యభిచారియునగు శూద్రుడును దన విటకత్తెతో రామచరిత్ర శ్రవణముచే బరమ పదమున కధికారి యయ్యెను."

శౌనకుడిట్లనెను:- "సూతా! పాపియగు శూద్రుడెట్లు రామ కథా శ్రవణముచే పరమ పదమున కధికారియైనాడో దయతో నీ

కథను నాకు జెప్పుము. ఈ యాఖ్యానములను వినుటచే మాకు రామచరితము నందధికాధికముగ ప్రీతి వృద్ధి చెందుచున్నది."

ఇది విని సూతుడిట్లనెను:- "వినుడు స్వామీ! ఈ కథను గూడ నారదుడు సనాకాది మునులకు చెప్పినదే. పూర్వము సుమతి యనునొక రాజుండెను. ఆతడు గొప్పధార్మికుడు, సత్క్రియాపరాయణుడు, బ్రాహ్మణుడు. ఆతని భార్య పేరు సత్యవతి. ఆమె సర్వసద్గుణ సంపన్న, గుణవతి భాగ్యశాలిని. వారిద్దరును గలిసి మిక్కిలి ప్రేమతో రామచరిత్రమును వినుచుందురు. ఒక దినమున దిరుగుచు దిరుగుచు విభాండక మహాముని తన శిష్యులతో రాజు కడకు వచ్చెను. రాజర్ఘ్యపాద్యాదుల నొసంగి మునిని విధ్యుక్తముగ బూజించి, ఆతనిని సుందరమగు సువర్ణ సింహాసనమున గూర్చుండబెట్టి ముని తపస్సును గురించియు, ఆశ్రమమును గూర్చియు, అగ్నులను గూర్చియు గుశలమడిగెను. కుశల ప్రశ్నానంతరము విభాండక మహాముని యిట్లనెను: రాజా! నీవెల్లప్పుడును రామచరిత్ర కథనేల వినుచుందువు, ప్రపంచములో ననేకములగు పురాణములు కలవు. శాస్త్రములును గలవు. నీవు వాని నన్నిటిని వదలి నిరంతరము రామాయణమందే మునిగి తేలుచుంటివేలః"

ఇది విని రాజిట్లనెను: "స్వామీ! ప్రపంచములో దేని వలన నెవరికి పనిజరుగునో వానికదియే ప్రియముగ నుండును. ప్రపంచములో ననేకులు సుందర పురుషులు కలరు. కాని సతికి దన పతివలననే ప్రయోజనము. మంచి మంచి రంగులు వేసిన

నౌకలనేకములు కలవు. కాని మనము కూర్చుండిన నౌకతోడనే దాటవలయును. ప్రపంచములో నౌకరినిమించిన మహాత్ములింకొకరు కలరు. కాని మన హృదయగ్రంధి యెవరిచే భేదింపబడినదో, ఎవనివలన మన సంశయములన్నియును నాశనమైనవో వానివలననే మన యుద్దేశ్యము సఫలము కాగలదు. నాకు పూర్వకాలమందొకసారి రామాయణమును శ్రవణ మొనర్చుటచే మేలు కలిగినది.

విభాండక మహాముని యిట్లడిగెను :- "రాజా! పూర్వకాలమందు నీకుద్ధారమెవని వలన నెట్లైనదో ఆప్రసంగమును నీవు కృపతో నాకు జెప్పవలయును."

ముని వాక్యములను విని రాజు తన పూర్యకథను జెప్ప దొడగెను.

రాజిట్లనెను : "స్వామీ! నేను పూర్యకాలమున మాలిని యను శూద్రుడను. నిత్యమును బ్రాహ్మణులను హింసించెడు వాడను. అపేయ పదార్థములను ద్రావెడు వాడను. తినరాని వస్తువులను దినెడు వాడను. జాతిజనులకును, కులజనులకును, దేశ వాసులకును ద్రోహమొనర్చెడు వాడను. మాంసమే నాకు ప్రధానమగు నాహారము. మదిరయే నాకు ప్రధానమగు పేయము. ధనమును హరించుటయే నాకు ధ్యేయము. ప్రాణులకు హింస నొనర్చుటయే నాకు ప్రధాన వ్యాపారము. నేను దోచుకొనియు, దొంగలించియు దెచ్చి వేశ్యల కొసంగెడు వాడను. ఈ విధముగ నుండ నా కుల

జనములు చాలకాలము సహించిరి చివరకు వారందరును నన్ను నగరము నుండి గెంటివైచిరి. పరిజనములచే బరితనక్తుడనై నేనటు నిటు వనపర్వతములందు దిరుగుచుంటిని.

ఏవైన జీవులు దొరకినచో వానిని జంపి తినెడు వాడను. ఇట్లుతిరిగి తిరిగి నేను వశిష్ఠ మున్యాశ్రమ సమీపమునకు జేరుకొంటిని. ఆ స్థానము సుందరముగ నుండెను. అచ్చటి శోభ అనుపమానముగ నుండెను. నేనాశ్రమ సమీపమున నొక పర్ణకుటీరమును నిర్మించుకొని నివసించుచుంటిని. ఆశ్రమమున కల్ప దూరములోనే నేను గొన్నిరాళ్ళను బ్రోవుచేసి, ఒక అరుగును వైచుకొని, దానిని గడ్డిగాదములతో గప్పి, నివసించుటకు యోగ్యమైన స్థలముగ నొనర్చితిని. నేనచ్చట వ్యాధజీవనము నొనర్చుచు, వనముల నుండి జంతువులను జంపి తెచ్చుకొని వాని మాంసమును దిని బ్రతుకుచు, నీ విధమగు వనమందు నేనిరువది వర్షములు గడిపితిని.

ఒక దినమున నేను కూర్చుండి యుండగా నాకు రోదన పూర్వకమైన కరుణాశబ్దము వినిపించెను. నేనా శబ్దమును బట్టుకొని ముందునకుబోయితిని. కొంతదూరము పోగా నొక వృక్షము క్రింద నేడ్చుచుండిన యొక స్త్రీని నేను జూచితిని. ఆమెకడకుబోయి నేనామె నోదార్చుచు నిట్లడిగితిని: "దేవీ! నీవెవరవు? ఈ వనమునకేల వచ్చితివి? ఏల నేడ్చుచున్నావు?"

ఆమె యేడ్చుచు నిట్లనెను: "అభాగిని నగు నాయెడల నింతటి దయనేల జూపుచున్నావు? నేను ఘోరపాపిని. నేను నిషాద కులమున జన్మించితిని. నా పేరు కాల. నేనతి వ్యభిచారిణిని, అధర్మచారిణిని. పరపురుషుడు చెప్పగా నేను నాపతిని గుప్తగా హత్యగావించితిని. జాతిజనులు నన్ను వెలిపెట్టిరి. ఇప్పుడు నేనటు నిటు నాశ్రమహీననై తిరుగుచున్నాను

నేనిట్లనుకొను చున్నాను: "ఒక గ్రుడ్డివానిని, ఒక కుష్ఠ వానిని రాముడు జోడుచేసినాడు. మంచిది. మనమిద్దరమును గలిసి యుందము." నాప్రస్తావన నామెయు నంగీకరించెను. నేనును నా చేతితో మాంసమును వండి వండి విసుగును జెందితిని. ఆమెయు నాశ్రయమును గోరుచున్నది. మేమిద్దరమును భార్యాభర్తల వలె నివసించు చుంటిమి."

వశిష్ఠ మున్యాశ్రమమున నేదియో యుత్సవము జరుగు చుండుటను నేను గాంచితిని. చాల మంది మునులు వచ్చుచుండిరి. మేమిద్దర మీ లోభముచే మున్యాశ్రమము సమీపమునకు బోవు ఆకులలో మిగిలిన నుచ్ఛిష్ట ప్రసాదమును దినుచుండెడు వారము. మొదట మొదట మున్యాశ్రమము సమీపమునకుబోవు సాహసము నాకు లేకుండెను. నేనీ భార్యతో గలిసి పోవుచుండ నాకా యుచ్ఛిష్టము లభించుచుండెడిది. ఈలోభముచే మేము పోవుచుండ నచ్చట భగవత్ప్రసాదమును మహాత్ముల యధరామృత స్పర్శను గావించిన నుచ్ఛిష్టమును లభించుచుండెను. ఈ మహాప్రసాద స్వీకరణముచే మా మనస్సులోని మలము రాలిపోవుచుండెను. ఆ సమయమున

నచ్చట నవాహ్న రామాయణ పారాయణము జరుగునని విని యుంటిమి. మేమిద్దరమును నేకాంతమున దూరముగ గూర్చుండి వింటిమి. అది సమాప్తియైన దినముననే మాకిద్దరకును మృత్యువు లభించెను. ఆ పుణ్య ప్రభావముచేతనే నేను రాజునైతిని. నాకు పూర్వజన్మలోని విషయము లన్నియును యధారీతిగ జ్ఞాపక మున్నవి. ఈ నాభార్య షానిద కన్యయగు కాల. ఈజన్మలోను నీమెయే నాకు భార్యయైనది. అందువలన మరల నీ సంసారము లోనికి రాకుండుటకై మేము నిరంతరమును రామచరితమును విను చుందుము." ఇది విని విభాండకముని పరమ ప్రసన్నుడై రాజసతత్కృతుడై శిష్యులతో నింకొక చోటకు బోయెను.

సూతుడిట్లనెను:- "మునులారా! నేనెంతని చెప్పుదును. ఇట్టివి ఒకటి రెండుకాదు. అసంఖ్యాకములగు నితిహాసములు కలవు. వానిలో ఘోరతి ఘోర పాపులును గేవలము రామకథను వినుటచే దరించిరి. అత్యంత క్రూరుడగు చోరుడొకడుండెను. ఆతడు మందిరములో ధనము నపహరింపబోయెను. అచ్చటనొక బ్రాహ్మణుడు పరుండి యుండుటనుగాంచి వానిని జంపుట కుద్యుక్తుటయ్యెను. బ్రాహ్మణుడాతనితో నమ్రతాపూర్వకముగ నిట్లనెను:- "నేను నీకేమియును హానిచేయలేదే, నన్నేలజంప బూనెదవు." బ్రాహ్మణుని వాక్కులను వినగానే ఆతడు తన కృత్యమునకు బశ్చాత్తాపమును జెందజొచ్చెను. బ్రాహ్మణుని శరణువేడెను. బ్రాహ్మణు డాతనిపై దయజూపెను. రామచరిత్ర మును వినిపించి వానిని సంసార సాగరమునుండి శాశ్వతముగ

ముక్తునొనర్చెను. మునులారా! నేనెంతని రామచరిత్రమునుగూర్చి వర్ణింపగలను? ఈచరిత్ర ధన్యమైనది. యశము నొసంగును. పుత్రులు లేనివారీ రామచరిత్రమును శ్రవణము చేసినచో వారికి బుత్రులు కల్గుదురు. వివాహముకానివారు నియమ పూర్వకముగ రామచరిత్రమును వినినచో జక్కని భార్య లభింపగలదు. భర్త లభింపని కన్యక శ్రద్ధతో సీరామచరిత్రమును వినినచో నామెకు మనోనుకూలుడగు భర్త లభింపగలడు. దరిద్రుడు ధనాపేక్షచే రామచరిత్రమును వినినచో నాతడు. ధనికుడు కాగలడు. విద్యార్థి భక్తితో రామచరిత్రమును వినినచో వానికి విద్య లభింపగలదు. శరణార్థియగు వాడు సావధానుడై రామచరిత్రము వినినచో నాతనికి సర్వశరణుడగు హరి లభించి వానికి సుఖము లభింపగలదు. సారాంశమేమనగా రామచరిత్రము ధర్మార్థ కామమోక్షముల నొసంగును. మోక్షమును గోరని నిష్కామ భక్తుడు నిరంతరము రామకథను వినుచుండినచో, నట్టివానికి ప్రభు పాదపద్మములందహైతుక పరాభక్తి కలుగును, అతడు ప్రభు ప్రేమోన్మత్తుడై పరమానందసుఖమును సదా అనుభవించును. ఈవిధముగ నేనత్యంత సంక్షేపముగ శ్రీరామచరిత్ర మహాత్మ్య మును వర్ణించితిని. ఇప్పుడు మునులారా! మీరేమి వినగోరు చున్నారు?"

ఇది విని శౌనకుడిట్లనెను:— "సూతా! నీవు పరమ పావన మగు రామచరిత్రమునుజెప్పి మమ్ములను గృతార్థుల నొనరించితివి. మహాభాగా! నీవు మాకు సూర్యవంశము యొక్క వంశావళినిగూర్చి

చెప్పుచున్నావు. సూర్యవంశములోని ప్రధాన రాజుల వర్ణనము నొనర్చుచు నీవు దశరథ నందనుడగు రామచంద్ర భగవానుని వరకు వచ్చితివి. ఇప్పుడు మేము తరువాత వంశావళినిగూర్చి వినగోరుచున్నాము."

అంత సూతుడిట్లనెను:- "మంచిది, మునులారా! ఇప్పుడు నేనత్యంత సంక్షేపముగ నీసూర్యవంశ వర్ణనము నొనర్చి ఆపైన చంద్రవంశమునుగూర్చి వర్ణించెదను. ఆ చంద్ర వంశమందే శ్రీకృష్ణ భగవానుడవతరించినాడు. దశరథ మహారాజునకు రామ, లక్ష్మణ, భరత, శత్రుఘ్నులను నలుగురు పుత్రులుదయించిరి. నలుగురకును నిద్దరిద్దరు పుత్రులుదయించిరి. శ్రీరామచంద్రుని పెద్దకుమారుడు కుశుడు. ఇక కుశుని తరువాత రాజుల వంశావళిని వినుడు."

## ఇక్ష్వాకువంశమందలి మిగిలిన రాజులు

శ్లో॥ ఇక్ష్వాకూణామయం వంశః సుమిత్రాంతో భవిష్యతి ।
యతస్తం ప్రాప్యరాజానం సంస్థాం ప్రాప్స్యతివై కలౌ।

శ్రీభాగ. ౯ స్కం. ౧౨ అ ౧౬ శ్లో

ప్రపంచములో బీజము నశించునదొక్కటియునులేదు. ధర్మాధర్మములు రెండును భగవదంశముచే బుట్టినవే. ధర్మము హృదయ ప్రదేశమునుండి వ్యక్తమైనది. అధర్మము పృష్ఠప్రదేశ

మునుండి వ్యక్తమైనది. నాలుగు పాదములను ధర్మమునడుచు కృతయుగమందును సూక్ష్మరూపమున నధర్మ ముండును. అదే విధముగ బూర్ణరూపమున గలియుగమున నధర్మమున్నప్పుడు బీజరూపముగ ధర్మముండనే యుండును. సృష్టియందన్నిటికిని బీజములుండును.

భగవదవతారము యుగాంతమున నుండును. కృత యుగమందు జనులందు జ్ఞానభావన స్వాభావికముగ నుండును. ఎవ్వరును నేర్పకయే అందరును జ్ఞానులుగనే యుందురు. ప్రకృతిగతి స్వాభావికముగ బతనముఖముగ నుండును. సృష్ట్యాది యందున్న మొదటి కృతయుగమున ధర్మము పూర్ణముగ నుండును. అప్పటినుండి ధర్మము క్రిమ క్రమముగ క్షీణించి కలియుగమందు క్షీణించి పోవును. కలియుగమైన తరువాత వచ్చు కృతయుగమున ధర్మము పూర్ణరూపముగ నుండును. కాన ప్రథమ కృతయుగమునకువలె నుండదు. దానికంటె గొంచెముగనో గొప్పగనో తగ్గియుండును. ఇట్లు కొంచెము కొంచె ముగ న్యూనమై కల్పాంత కృతయుగమందు ధర్మము చాల క్షీణించి కల్పాంత కలియుగమున సృష్టి ప్రిలయమగును.

ఈ విధముగ గ్రమ్మక్రమముగ ధర్మము క్షీణించినపుడు భగవంతుడవతరించి దానినుద్ధరించును. కావున సాధారణముగ యుగావతారము యుగాంతముననే సంభవించుచుండును. కృతయుగ మునగల స్వాభావిక జ్ఞాన ప్రవృత్తి కృతయుగాంతమున క్షీణించి

పోవును. దానిని మరల నుద్ధరించుటకై కపిలావతారము వచ్చెను. ఆతడు జ్ఞాన ప్రసారమును గావించి యజ్ఞమునుగూర్చి ప్రశంసించెను. త్రేతాయుగమందు జ్ఞానముతో గూడి వర్ణాశ్రమ ధర్మముల యొక్కయు సమస్త యజ్ఞయాగాదుల యొక్కయు ప్రచారము జరిగెను. దానియందును నవి తగ్గిపోగా త్రేతాయుగాంతమున శ్రీరామచంద్ర భగవానుని యవతారము వచ్చెను. భగవానుని వంశజులు ద్వాపరాంతము వరకును బృథివిని బాలించుచుండిరి. కలియుగమున విశుద్ధ క్షత్రియ వంశములధర్మకారణమున నుండజాలవు. కలియుగమున వర్ణాశ్రమ ధర్మములు నష్ట ప్రాయములై పోవును. పూర్తిగా సూర్యవంశ చంద్రవంశ బీజములు నశించి పోయినచో మరల రాబోవు కృతయుగమున నీవంశము లెట్లునడువగలవు. కావున భగవంతుని విధాన మేమనగా గలియుగము రాగానే ఒక సూర్యవంశపు రాజు తన దివ్యదేహముతో గంధమాదన పర్వతమందు గుప్తముగ నొక యుగమువరకుండి తపస్సును జేయుచుండును. ఆతడు యోగప్రభావమున దన శరీరమును నిలుపుకొనును. కలియుగాంతము కాగానే ఆతడు వివాహమాడి మరల సూర్య చంద్ర వంశములను స్థాపించును. ఈ కారణమువలన నీ సూర్య చంద్ర వంశములు కల్పాంతము వరకును నశింపవు. ఇవన్నియును భగవదేచ్ఛచే జరుగు చుండును

సూతుడిట్లనెను:- "మునులారా! ఇంతవరకు నేనిక్ష్వాకు వంశరాజులనుగూర్చి శ్రీరామచంద్రుని వరకు వర్ణించితిని. ఇప్పుడిక రాబోవు రాజులను గూర్చి వినుడు. శ్రీరామచంద్రుని పెద్ద

కుమారుని పేరు కుశుడు. ఆతడు కుశావర్తియను దానికి రాజయ్యెను. కుశుని కుమారుడతిథి. అతిథికి నిషాధుడు నిషాధునకు నభుడు, నభుని పుత్రుడు పుణ్యశ్లోకుడును పృథివీపతియునగు పుండరీకుడు. పుండరీకుని కుమారుడు క్షేమధ్వనుడు. క్షేమధ్వనునకు దేవానీకుడు. ఆతని కనేహుడు, అనీహుని పుత్రుడు పరమ యశస్వియగు పారియాత్రుడు. పారియాత్రునకు బలస్థలుడు. ఆతనికి వజ్రనాభుడు. ఈ వజ్రనాభుడు పరమ తేజస్వియయ్యెను. ఈతని తేజస్సు సూర్యునిబోలి యుండెను. అందువలన నీతడు సూర్యాంశమున బుట్టినాడనిరి. వజ్రనాభుని పుత్రుడు ఖగణుడు. ఆతనికి విధృతి. విధృతి పుత్రుడు పరమ యశ్వస్వియగు హిరణ్యనాభుడు. ఈతడు ప్రపంచమున యోగాచార్యుడుగ ప్రసిద్ధికెక్కెను జైమిని మహామునినుండి ఈతడు యోగవిద్యను బొందెను. ఈతడు ప్రభావశాలియగుటచే గోసల దేశవాసియగు యాజ్ఞవల్క్యుడీతనికి శిష్యుడయ్యెను. క్షత్రియుడైనను నీతడు బ్రాహ్మణునకు గురువయ్యెను. హృదయగ్రంథిని భేదించిన మహాసిద్ధిప్రదమగు నధ్యాత్మయోగము నీయాజ్ఞవల్క్యుడాతనికడ నేర్చుకొని యుండెను.

ఈ హిరణ్యనాభుని కుమారుడు పుష్యుడు. ఆతనికి ధ్రువసంధి. ధ్రువసంధికి సుదర్శనుడు. సుదర్శనునకు బరమ తేజస్వియగు అగ్నివర్ణుడను సుతుడు కలిగెను. అగ్నివర్ణునకు శీఘ్రుడు శీఘ్రుని పుత్రుడు చిరంజీవియగు మరుడు.

మరుమహారాజు పరమయోగి. ఈతనికొక పుత్రుడు కలుగగానే సమస్త రాజ్యమునువీడి గంధమాదన పర్వతమందు బదరీ

వనమునకావల గలాప గ్రామమునకుబోయి తపస్సు జేయు చుండెను. ఈతను సమాధి నభ్యసించుటచే యుగజీవియయ్యెను. ఇప్పటికిని నీతడు కలాపగ్రామమున తపస్సును జేయుచున్నాడు. ఈ కలియుగాంతము వరకును దపస్సును జేయుచునేయుండును. కలియుగమున సూర్యవంశము నశించిపోగలదు. మరల గృత యుగము రాగానే ప్రజలలో ధర్మరుచి వృద్ధినిబొందును. ధర్మము నాలుగు పాదముల నడచును. అప్పుడీ సూర్యవంశమునకు బీజ రూపుడగు మహారాజె వివాహమొనర్చుకొని సూర్యవంశమును మరల స్థాపించును. రాబోవు ద్వాపరమున వచ్చు వ్యాసునిగూర్చి వర్ణించెదను. మరుని వంశములోని మరుని పుత్రులందరును నల్ప వీర్యులైరి. వీరు సాధారణ రాజులైరి. వీరిలో విష్ణ్వంశ అణు మాత్రమైననులేదు. అందువలన కలియుగములోనివారు నామ మాత్రమున రాజులైరి. వెనుకటి యుగములలోని రాజులు లక్షల కొలది వత్సరములు బ్రదికెడువారు. వారి యాయుస్సు యుగముల పర్యంతముండెడిది. ఈ కలియుగములోని రాజు లల్ప కాలము లోనే పంచత్వమును బొందెదరు.

మరుని పుత్రుడు ప్రసుశ్రుతుడు. ఆతనికి సంధి, సంధికి అమర్షణుడు. అమర్షణుని పుత్రుడు మహస్వంతుడు. మహస్వంతు నకు విశ్వసాహ్వుడు. విశ్వసాహ్వునకు బ్రసేనుడు. ఆతనికి దక్ష కుడు పుట్టెను. కోసలాధీశ్వరుడగు నీతక్షకమహారాజు మహాభారత యుద్ధసమయమున నుండెను. ఈతని పుత్రుడగు బృహద్బలుడును బరమశూరుడు. ఆతనికి బృహద్రణుడను పుత్రుడుండెను. బృహ

ద్రణుడున్నను దక్షుడే రాజసింహాసనమున నుండెను. తండ్రికొడుకు లగు వీరిద్దరును మహాభారత సమరమున జంపబడిరి. బృహద్బ లుని నర్జును పుత్రుడగు నభిమన్యుడు చంపివైచెను. మిగిలిన వారందరును గలిసి అభిమన్యు నధర్మపూర్వకముగ జంపిరి.

అంత శౌనకుడిట్లడిగెను:- "సూతా! మహారథియును కోసల రాజకుమారుడునగు బృహద్బలు నభిమన్యుడెట్లు చంపినాడు.ఆతడు మరల నెట్లు చంపబడినాడు? ఈ వృత్తాంతమును దయతో మాకు జెప్పవలయును."

ఇది విని సూతుడిట్లనెను:- "స్వామీ! ఇది పెద్దగాథ. దీనిని జెప్పమొదలిడినచో నిక్ష్వాకు రాజుల కథ ఆగిపోగలదు. కావున నేనత్యంత సంక్షేపముగ నీకథను జెప్పి ముందుకు బోయెదను. మునులారా! మహాభారత యుద్ధమందు బాదునారేండ్లవాడగు నర్జున పుత్రుడభిమన్యుడు గొప్ప వీరత్వమును బదర్శించెను. ఈతని యద్భుత వీరత్వమునుగాంచి, కౌరవ పక్షములోని వీరులదరి పోయిరి. ద్రోణాచార్యుడు భీష్మ పితామహుని తరువాత బ్రధాన సేనాధిపతిగా నొనర్పబడెను. ఆతడు పాండవులను బరాజితుల నొనర్చుటకై పర్మవ్యూహమును రచించెను. ధర్మరాజగు యుధిష్ఠి రుడిట్లడిగెను: ఈ చక్ర వ్యూహమును భేదించి, దీనిని నాశనము చేయగల వారెవ్వరు?"

వీరాభిమన్యుడిట్లనెను; "నేను చేయగలను."

ఆచిన్న కుఱ్ఱడు పలికిన నివీరతాభరిత వాక్యములను విని ధర్మరాజాతని గౌగిలించుకొని, శిరస్సును మూర్కొని యుద్ధము

నకు బంపెను. వీరాభిమన్యుడు మాతృగర్భమున నున్నప్పుడే పద్మవ్యూహాభేదనమును నేర్చియుండెను. ఆ వీరుడు సింహనాద మొనర్చి దశదిశలను గంపింపజేయుచు గౌరవ వీరులు చూచు చుండగనే అభేద్యమగు బద్మవ్యూహమున బ్రవేశించి, అచ్చట సైనికుల నందరను జంప మొదలిడెను. మహారథులను యుద్ధము నకుబిలిచెను. ఆతని యిట్టి పరాక్రమమునుగాంచి చాలమంది గొప్ప గొప్పవీరులాతనితో బోరాడుటకు వచ్చిరి; కాని అందరును బరా జితులై రణమును డి పారిపోయిరి. ఈతని యీ ప్రచండ వేగ మునుగాంచి ఒక్కసారిగా నారుగురు మహారథులా బాలకుని జుట్టు ముట్టిరి, పదివేలమంది యోధులతో నొక్కసారిగా బోరాడు వానిని మహారథుడందురు. ఇట్టి మహారథులారుగురు చుట్టుముట్టినను నాతడు విచలితుడు కాలేదనిన నాతని వీరత్వమునుగూర్చి యేమని చెప్ప వలయును. ఆయారుగురు మహారథులు సామాన్యులుకారు అందరును విశ్వవిఖ్యాతులు. వారిలో సమస్తాస్త్ర శస్త్రమర్మజ్ఞుడగు ద్రోణు డును, ఆతని విశ్వవిదిత నశ్వత్థామయును, కురకుల పురోహితు డును, మహాధనుర్ధరుడునగు గృపాచార్యుడును; వీరాగ్రగణ్యు డును, హార్ధికుడును, యాదవులలో సుప్రసిద్ధ మహారథియునగు గృతవర్మయును; గోసలదేశ రాజకుమారుడగు బ్రహద్బలుడును వీరంవరును విశ్వవిఖ్యాత వీరులే.

బాలకుడగు నభిమన్యుడీ యారుగుర ప్రహారములను సహించుచు నందరను బదిపది, ఇరువదిరువది బాణములతో గొట్టుచు నందరను గాయపరచెను. అప్పుడందరును గలిసి ఒక్కసారిగా

నాతనిపై విరుచుకొనిపడిరి. ఆతడీ మహారథులందరతో యుద్ధ మును జేయునంతలో గోసల దేశాధిపతి తక్షకుడు వచ్చెను. ఆతడు ధర్మవిరుద్ధముగ గర్జియను తీక్ష్ణ బాణమును నభిమన్యుని హృద మునకు గొట్టెను. ఆతడభిమన్యునితో బోరకుండినను నాతని కుమా రుడు బృహద్బలుడు పోరాడుచుండెను. అభిమన్యున కీతనిపై మిక్కిలి కోపము వచ్చెను. ఆతడొక్క బాణమును సంధించి కోసలాధీశ్వరుని ధ్వజమును ఖండించెను. రెండవ బాణముతో నాతని సారథిని, గుఱ్ఱములను జంపెను. రథమునుగూడ చూర్ణ మును కావించెను. ఈవిధముగ గోసలరాజును రథ విహీనునిగావించి వీరవరుడగు నభిమన్యుడు గర్జించెను. రథ విహీనుడగు గోసలాధీ శ్వరుడు డాలును గత్తినితీసికొని అభిమన్యుని వైపునకు బరువిడెను. ఆసమయమున బృహద్బలుడు తండ్రి సహాయమునకై పరువిడెను. అభిమ్యనుడొక తీక్ష్ణ బాణమును గైకొని బృహద్బలుని రొమ్మునకు గొట్టెను. ఆ బాణము తగులగానే రాజకుమారుడు నరకిన వృక్షము వలె నేలపైబడి వెంటనే మరణించెను. అనంతర మన్యమహారథికు లధర్మపూర్వకముగ నభిమన్యు నస్త్రశస్త్రములచే రథ విహీనుని గావించి అన్యాయముగ జంపిరి. విజయుడైన గోసల మహారాజగు తక్షకుడా సమరమున వీరగతిని బొందెను. ఆ యుద్ధమున బాండ వులకు జయము కలిగెను. ధర్మరాజగు యుధిష్ఠిరుడు చక్రవర్తి యయ్యెను. యుద్ధమున జచ్చిన రాజుల కుమారులను జిన్న చిన్న వారి నాతడు రాజులుగా నొనర్చెను. నశించిన రాజవంశములో నేపిల్లవాడు మిగిలినను వానిని రాజుగా నొనర్చెను. ఈవిధముగ

ధర్మరాజగు యుధిష్ఠిరుడు మరల రాజవంశములను స్థాపించెను. కోసల రాజగు తక్షకుని పుత్రుడగు బృహద్బలుడు చనిపోయిన మీదట నాతని కుమారుడగు బృహద్రణుడు మహాభారత యుద్ధానంతరమున గోసలాధిపతి యయ్యెను.

సూతుడిట్లనెను :- మునులారా! మీరు నైమిశారణ్యమున నివసించు రోజులలో బృహద్రణుడే కోసలదేశ సింహాసనమున నుండెను. మీరచ్చట నుండి వచ్చిన తరువాత నింక నెందఱో రాజులైరి. బృహద్రణుని పుత్రుడు ఉరుక్రియుడు. ఉరుక్రియుని సుతుడు వత్సవృద్ధి. ఆతనికి ప్రతివ్యోముడు, ఆతనికి భానువు, భానునకు దివాకుడు. దివాకునకు సహదేవుడు సహదేవునకు బృహదశ్వుడు, బృహదశ్వునకు భానుమంతుడు, భానుమంతునకు ప్రతీకాశ్వుడు. ప్రతీకాశ్వుని పుత్రుడు పరమ తేజస్వియగు సుప్రతీక మహారాజు.

సుప్రతీకునకు మరుదేవుడు మరుదేవునకు సునక్షత్రుడు, సునక్షత్రునకు పుష్కరుడు, పుష్కరున కంతరిక్షుడు, అంతరిక్షునకు సుతుడు, సుతపునకభిత్రజిత్తు, అభిత్రజిత్తునకు బృహద్రాజు, బృహద్రాజునకు బర్హి, బర్హికి కృతంజయుడు, కృతంజయునకు రణంజయుడు, రణంజయునకు సంజయుడు పుత్రులైరి. సంజయునకు శాక్యుడు, శాక్యునకు శుద్ధోదనుడు, ఆతనికి లాంగలుడు లాంగలునకు ప్రసేనజిత్తు, ప్రసేనజిత్తునకు క్షుద్రకుడు, క్షుద్రకునకు రణకుడు, రణకునకు సురథుడు, ఆతనికి సుమిత్రుడు పుత్రు

దయ్యెను. ఇక నీ సుమిత్రుడే ఈ వంశమునకు చివరిరాజు. ఆ తరువాత గోసలమున కిక్ష్వాకు వంశీయులు రాజ్యాధికారము పోయెను. ఈ వంశము భూమిపై నష్టప్రాయమయ్యెను. క్షత్రియ వంశములు నశించుటచే ప్రజలకు వర్ణాశ్రమ ధర్మమందును, రాజ్యమందును బరస్పర ప్రేమ లేకుండెను. స్త్రీలు చరిత్రహీనులగుటచే శుద్ధరజోవీర్య పరంపర నశించిపోవును.

ఇది విని శౌనకుడిట్లనెను : "సూతా! భూమిమీద నిప్పుడు సూర్యవంశ, చంద్రవంశ క్షత్రియు లనేకులున్నారే. సుమిత్రుని తరువాత సూర్యవంశపు రాజుల వంశము సమాప్తమై పోవునను చున్నావే."

సూతుడిట్లనెను : స్వామీ! చెప్పుకొనుటకిప్పుడును దాము బ్రాహ్మణుల మనియు, క్షత్రియులమనియు, వైశ్యుల మనియు, జెప్పుకొనుచుందురు. వంశపరంపరయునదియే. కాని యిప్పుడా కులాగత విశుద్ధ వంశపరంపర లేదు. ఇందెవరి దోషమును లేదు. ఇదంతయును గలి ప్రభావము. చలికాలమున జలివేయునట్లు కలియుగమున నధర్మ ప్రసారమగును. కలియుగములోనివారు అధర్మమును గూడ ఉన్నతి ద్యోతకముగ భావించెదరు. అజ్ఞానవశులై పశువులవలె నాచరణ మొనర్చెదరు. ఇంకను గలియుగమున జాల కాలము మిగిలియున్నది. ఇప్పటి నుండియే సర్వత్ర అధర్మము వ్యాపించి యున్నది. ఇప్పుడు వర్ణాశ్రమ ధర్మము పృథివియందెచ్చట నున్నది? బ్రహ్మచారులెవరైన నుండిన నామ మాత్రమునకే,

వారు కేవలము నామమాత్ర బ్రహ్మచారులే. బ్రహ్మచర్యము నుండి వేదాధ్యయన మొనర్పవలసిన బ్రహ్మచారులు విదేశ భాషలను జదువుచున్నారు, వీరు భౌతిక సుఖమునే తమ జీవితమునకు బరమ లక్ష్యముగ భావించెదరు. కలియుగమందలి ఆధునిక విద్యార్థులు భిక్షాజీవన మొనర్పరు. ప్రతినెల యింటి నుండి ధనమును దెప్పించుకొందురు. జీతమొసంగి చదువుకొందురు. అధ్యాపకులను సన్మానింపరు. వారు వేతన భోగులగు భృత్యులని భావించి అట్లే వ్యవహరించెదరు. ఛాత్రావాసములలో నివాస మొనరించెదరు. అవి విలాసాలయములైనవి. వానిలోనికి ఖాద్యాఖాద్యము లన్నియును దేబడుచుండును. పేయాపేయములు త్రాగబడు చుండును. కర్త వ్యాకర్తవ్యములకు సంబంధించిన సమస్త దుష్కర్మలొనర్పబడు చుండును. నిరీక్షకుడు నామ మాత్రముగ నుండును. వాని యాజ్ఞ లను ఛాత్రులు వినరు. వివాహమునకు బూర్వమే వారు దూషితు లగుదురు. వ్యభిచార జన్యదోషము వారికిరాగలదు. చదివి వారు వర్ణాశ్రమ ధర్మోచిత వంశ పరంపరాగతమగు కార్యములనుగూర్చి యేవగించుకొందురు. వారు దాసత్వమును గాంక్షించెదరు. వారి స్వాస్థ్యములు చెడినవి. బాల్యకాలమందే వృద్ధులుగ గనబడు చుందురు. గృహస్థ విషయమును నిట్లేయున్నది. గృహస్థ ధర్మము యజ్ఞమొనర్చుట కాచరించు చుందురు. దారగృహణ మగ్ని హోత్ర రక్షణమునకై యేర్పడినది. ఇప్పుడెంతగా వెదకినను త్రేతాగ్నులు సురక్షితముగా నుండి, పూజింపబడుచు జీవించుచున్న గృహస్థు నిప్పుడు లక్షకును, గోటికి నొక్కడైనను దొరకడు. వేదాధ్యయన

మొనర్చుట నట్లుంచి వారు వేదగ్రంథములను గంటితోనైనను జూడలేదు. గృహస్థ ధర్మము కేవలము పొట్టబోసికొనుటకును, బిల్లలను గనుటకును సీమితమై యున్నది. ధర్మకర్మ లన్నియును మరవబడినవి వానప్రస్థ ధర్మము లుప్తమయ్యెను. వనములే కుండిన వానప్రస్థ ధర్మ మెచ్చట నుండును. సన్యాసులు నామ మాత్రముగ నుండిరి. సన్యాస ధర్మపాలన మసంభవమైనది. వర్ణ ముల స్థితియు నిట్లే యుండెను. బ్రాహ్మణుల చిహ్నము యజ్ఞోప వీతములోనే నిలిచిపోయెను. మూడుపోగులను మూపుపై ధరించుటే బ్రాహ్మణ కర్మమనుకొను చున్నారు. క్షత్రియ కర్మము కపట వ్యాపార మొనర్చుటలోనే మిగిలినది. శూద్రుడు కలియుగ ములో లేనేలేడు. నాలుగు వర్ణములలోను సాంకర్య మేర్పడినది.

కులరక్షణ భారము స్త్రీలపై బడినది. స్త్రీలు శుద్ధులుగా నుండిన గులము విశుద్ధముగ నుండును. స్త్రీలు దూషితమగును, సృష్టిలోని జీవుల స్వాభావిక ప్రవృత్తి పరమార్థమునగాక విష యములందున్నచో వర్ణసంకరమగును. వారు విషయములను సర్వ శ్రేష్ఠ సుఖకరము లనుకొని, ధర్మాధర్మములను విచారింపక వ్యవ హార మొనర్చెదరు. కావున గలియుగమందు వర్ణధర్మములు కాని ఆశ్రమ ధర్మములు కాని యుండవు వ్యక్తిగత రూపమున నుండిన నుండవచ్చునేమో కాని సామాజిక రూపమున వాని ప్రచారమాగి పోవును. ధర్మరక్షణ భారము రాజుపై గలదు. రాజులేకున్న బ్రజలు స్వతంత్రులగుదురు. వారు వారికిష్టము వచ్చిన వ్యవహార మొనర్చెదరు. పురుషులు పాపనిరతులగుదురు. వారు సమస్త

వారు కార్యములందును గపటమొనర్చెదరు. స్త్రీలు సంతానో త్పత్తిని భారముగ భావించెదరు. వారిలో స్వాతంత్ర్యము వృద్ధి పొందును వారు పురుషులతో గలిసి యుండవలె ననుకొను చుందురు. వివాహమందు బంధింపబడుట వారు వ్యర్థముగ భావించె దరు. ఇష్టము వచ్చినట్లు నడచుకొను చుందురు. తలనెత్తుకొని స్వచ్ఛందముగ వారికిష్టమున్న చోట్లకు దిరుగుచుందురు. వారికిష్టము వచ్చిన చోట్ల నుందురు. ఎక్కడనైనను సంతానమును గనగలరు. ఎక్కడనైనను సంతానమును విడిచిరాగలరు. వారిలో మాతృత్వ ముండదు, వారు క్రూరకర్ములగుదురు. విషయ సుఖమునే సర్వ శ్రేష్ఠసుఖముగ భావించెదరు. దానికొరకై వారు సమస్తమును జేయుటకు దత్పరులగుదురు. ప్రాచీన సతీధర్మమును గూర్చి యెగతాళి చేయుచు గర్వించుచుందురు. ఇట్టి స్త్రీలవలన విశుద్ధ వంశ పరంపర అక్షుణ్ణముగ నిలుచునని యాశించుట వ్యర్థము, పురుషులును నిట్టి పాపులే యగుదురు. లోభవశమున వారి నమ్మె దరు. పాప కర్మలందు బ్రవృత్తులను గావించెదరు. సంతానము విష యములో రజోవీర్య ప్రభావమే యుండును. సంకర వర్ణులు భౌతికోన్నతి నెంతైన సాధించెదరు గాక. పరమార్థమునకు వంచితు లగుదురు. అందువలన గలియుగమందు యాజ్ఞానుష్ఠానాది ధార్మిక కృత్యములు విద్యుక్తముగ జరుగ జాలవు. ఏలననగా నీ కార్యము లకు దేశ, కాల, పాత్రమున శుద్ధత ఆవశ్యకమై యున్నది. కావున స్వామీ! విశుద్ధ క్షత్రియ వంశము నశించిపోవును. ఇందులో నెవరిదోషమును లేదు, ఏది జరిగినను నది భగవదేచ్ఛచే జరుగ గలదు,

శౌనకుడిట్లనెను:- "సూతా! అన్నియును భగవదేచ్ఛ చేతను, యుగధర్మ ప్రభావముచేతను జరుగుచో శాస్త్రములందు మాటిమాటికిని వీనిని చెడ్డగా నేల వర్ణించినారు?"

సూతుడిట్లనెను:- "స్వామీ! అంతయును సత్యమే జరుగుట మాత్రమంతయును యుగప్రభావముచేతనే జరుగును. శాస్త్రకారులివి చెడ్డవని చెప్పుటకు తాత్పర్యమేమనగా దేనిని మీరున్నతియని యనుకొనుచున్నారో, అది యున్నతి కాక అవనతి యనియు, దేనిని మీరు ధర్మమని తలచుచు బ్రచార మొనర్చుచున్నారో అది ధర్మముగాక అధర్మమనియు జెప్పుటకే."

శౌనకుడిట్లనెను:- "సూతా! కలియుగమందు దేశ, కాల, పాత్రములేనియును శుద్ధముగ నుండకున్నచో, నేసాధనయు విధి విధాన పూర్వకముగ జరుగకున్నచో గలియుగ జీవులకిక నుద్ధారమేమియు నుండదుకదా!"

సూతుడిట్లనెను:- "కాదుస్వామీ! అట్లుకాదు. కలియుగములోని జీవులుద్ధరింపబడుట కొక సర్వశ్రేష్ఠమగు నుపాయము కలదు. దానికి దేశ, కాల, పాత్ర, విధి, విధానములతో బనిలేదు. దాని నాశ్రయించుటచే సుదురాచారులును సంసార సాగరమును నిమిషములో దరింపగలరు."

శౌనకుడిట్లనెను:- "ఆ యుపాయమేమి సూతా!?"

సూతుడిట్లనెను:- "స్వామీ! అది భగవన్నామ సంకీర్తనము. భగవన్నామ సంకీర్తనము ప్రాణుల సమస్త పాపములను

దూరము కావించి పరమ పదమునకు జేర్పగలదు. కలియుగమందు కేవలము రామనామమే ఆధారము. రామ నామమెంతో సర్వ శ్రేష్ఠమైన, సులభ, సర్వోపయోగకరమగు సాధనము. దానికి సమానమగు సాధన మింకొకటిలేదు. రామనామ కీర్తన మొనర్చు వారి మీద గలికాల ప్రభావ మేమాత్రమునుబడదు. కలియుగము వారిదగ్గరకైననురాదు."

సూతుడిట్లనెను: "మునులారా! నేనత్యంత సంక్షేపముగ వివస్వంతుని పుత్రుడగు మనువు మొదలుకొని సుమిత్రుని వరకుగల రాజవంశము వర్ణించితిని ఇప్పుడు మీరేమి వినగోరు చున్నారు?"

శౌనకుడిట్లనెను:- "సూతా! నీవు వైవస్వతమనువునకు ఇక్ష్వాకు, నృగ, శర్యాతి, దిష్ట, ధృష్ట, కరూష, నరిష్యంత, పృషధ్ర, కవియను బదుగురు పుత్రులుండిరని చెప్పితివి. వీరిలో నీవు పృషధ్ర, కవి, కరూష, నరిష్యంత, దిష్ట, ఇక్ష్వాకు వంశ ములనుగూర్చి వర్ణించితివి. ఇక్ష్వాకు మహారాజు వంశమును వర్ణించుచు నాతనికి నూరుగురు పుత్రులుండిరనియు, వారిలో వికుక్షి, నిమి, దండకుడను నీముగ్గురును బెద్దవారనియు, మిగిలన తొంబదేడుగురు చిన్నవారనియు జెప్పితివి. వారిలో నిరువదైదు గురు ఆర్యావర్తమునకు దూర్పుననున్న దేశమునకు రాజులై నారనియు, నిరువదైదుగురు పశ్చిమ దేశములకు రాజులైనారనియు నలుబదేడుగురు దక్షిణ దేశములకు రాజులై నారని, వీరు

ముగ్గురు నార్యావర్త మధ్య దేశమునకు రాజులైనారనియు జెప్పితివి. అందరకంటె పెద్దవాడైన వికుక్షి తనకర్మచే శశాదు డని పిలువబడినాడని చెప్పి ఆతని వంశమునుగూడ నీవు వర్ణించితివి. ఇప్పుడాతని పుత్రులగు నిమి, దండకుల వంశములను గూర్చి మాకు జెప్పుము."

ఇది విని సూతుడిట్లనెను:- "మునులారా! నిమిమహా రాజు వంశమతి పావనమైనది. ముందుగా దానినిగూర్చి చెప్పి తరువాత దండకుని వంశమునుగూర్చి చెప్పెదను, ఇప్పుడు మీరు నిమివంశ మునుగూర్చి వినుడు."

## నిమివంశ వర్ణనము

శ్లో॥ నిమిరిక్ష్వాకుతనయో వసిష్ఠమవృత ర్త్విజమ్।
ఆరభ్య సత్రం సోఽప్యాహ శక్రేణ ప్రాగ్వృతోఽస్మిభోః॥
తం నిర్వర్త్యాగమిష్యామి తావన్మాం ప్రతిపాలయ।
తూష్ణీమాసీగ్గృహ పతిః సోఽపీంద్రస్యాకరోన్మఖమ్॥

శ్రీభాగ. ౯ స్కం. ౧౩అ. ౧ ౨ శ్లో॥

'జీవనముకంటె జీవిక ప్రియమైనది'దను లోకోక్తి సత్యమైనది. జీవిక కొరకు మానవుడు జీవనము నరచేతిలో నుంచుకొని కార్యమునొనర్చును. కొంచెము సంపాదన లభించెనా అగాధ సముద్రములోనికిబోవును. అచ్చట అడుగడుగునకు

మృత్యుభయముకలదు. జీవికోపార్జనము కొరకు వేల కొలది నిలువులు గనులలోనికిబోయి పనిచేయుచుందురు. అచ్చట మృత్యువు నోరు తెరచుకొని నిలుచుండి యుండును. ధనికులను బ్రిసన్నుల నొనర్చుటకు మదించిన నాబోతుల తోడను, సింహములతోడను, నేనుగులతోడను, మానవుడు పోరాడును. ఇదంతయును ధనికులానందించి యేమైన నిచ్చెద రనియే. ధనముకొరకై పురోహితులు యజమానులేది పలికిన దాని నొనవల యును. వారివెనుక పరువిడవలయును. జీవికను బ్రాణము కంటెను జీవనముకంటెను శ్రేష్ఠమని భావించును. జీవికాప్రశ్న వచ్చినచోట్లనెల్ల ప్రాణులు పోరాడి చత్తురు. పాపము నొనర్చెదరు. బ్రాహ్మణులు బ్రాహ్మణులిందులకే పోరాడుకొందురు. ఈతడు నాయజమానియనిన నాతడు నీ యజమాని యనుకొనుచుందురు. ఒక క్షత్రియుడింకొక క్షత్రియుని జీవిక కొరకు రాజ్యవృద్ధికొరకు హత్యను గావించును. వైశ్యుల విషయమును బ్రసిద్ధమే. చర్మము పోయినబోవును గాక దమ్మిడీని పోనీయరాదందురు. ఇదే విధముగ నింటిలో గానిండు బయటకానిండు, జాతియందురు, గుటుంబము నందును. నెచ్చట తగాదా వచ్చినను పద ప్రతిష్ఠకో లేక ఆజీవికకో జరుగును. వీనిలో జీవికయే ప్రధానమైనది.

సూతుడిట్లనెను:- "మునులారా! బ్రహ్మకు స్వాయంభువ మనువు పుత్రుడయ్యెను. మనువునకిక్ష్వాకు మహారాజు దయించెను. ఆతనికిగల నూరుగురు పుత్రులలో వికుక్షి (శశాదుడు) నిమి, దండకుడనువారు ప్రధానులు. వికుక్షి వంశవర్ణనమును నేను మీకిది

వరకే చేసియుంటిని. ఇప్పుడింక మీకు నిమివంశ వర్ణన మొనర్చె దను."

నిమి మహారాజు గొప్పధార్మికుడును. ప్రజావత్సలుడునై యుండెను. ఆతనికి ధర్మకర్మము లందత్యధిక ప్రవృత్తి కలదు. అందువలన నాతడెల్లప్పుడును యజ్ఞయాగాదులలో మునిగి తేలుచుండెడువాడు. మనువంశమునకు బురోహితుడు వశిష్ఠ భగవానుడే. ఈతడొనర్చు యజ్ఞయాగాదులను ధర్మానుష్ఠానమును నీతడు చేయించు చుండెడువాడు. ఒకసారి నిమి యొక గొప్ప యజ్ఞమును జేయదలచెను. దీని కొరకై ఆతడు తన కుల పురోహితుడగు వశిష్టుని సమీపమునకు బోయెను. వశిష్టుడు రాజుకుశలము నడిగి, ఆతడు వచ్చిన గారణము నడిగెను."

చేతులను జోడించుకొని నమ్రతా పూర్వకముగ రాజిట్ల నెను:- "స్వామీ! నేనొక గొప్ప యజ్ఞమును జేయవలయు నను కొనుచున్నాను. నా యీ కోరిక మీరు కృపను జూపినప్పుడే పూర్ణము కాగలదు. మీ రీ యజ్ఞమును నాచే విధి విధాన పూర్వక ముగ జేయింపుడు."

వశిష్ఠ మహర్షి యిట్లనెను: "రాజా! యజ్ఞ యాగాది ధర్మాను ష్ఠానములను జేయించుటయే నా పని, కాని యీ సమయమున నొక గొప్ప ధర్మ సంకటము వచ్చినది."

రాజిట్లడిగెను : "అదేమి స్వామీ!"

వశిష్ఠుడిట్లనెను : "దేవేంద్రుడు సుమేరువునం దొక గొప్ప యజ్ఞము నొనర్ప దలచుచున్నాడు. ఆతడు నీవు రాక మునుపే నన్నా యజ్ఞమునకు రమ్మని వరించినాడు. నే నంగీకరించితిని. ఆతని యజ్ఞమును నేను జేయించెదనంటిని."

రాజిట్లనెను : స్వామీ! ఆతడు దేవేంద్రుడు. స్వర్గాధిపుడు. ఆతడే ఋషిచేనైనను యజ్ఞమును జేయించుకొనగలడు. నాకు మీరొక్కరే ఆశ్రయము. ముందు నాచే యజ్ఞమును జేయించుడు."

వశిష్ఠుడిట్లనెను : "రాజా! నీవు ధర్మాత్ముడవయ్యు నిట్టి యధర్మ వాక్యముల నేల బలుకుచున్నావు? యజ్ఞమును జేయించెదనని యంగీకరించి మరల దానికి బోకుండుట మహా పాపము. విశ్వాసఘాతము. ముందుగా నే నాతని యజ్ఞమును జేయించుట కంగీకరించితిని. అచ్చటకు నేను వెళ్ళితీరవలయును. ఫరవాలేదు. ఆతని యజ్ఞమును జేయించి వచ్చి నీ యజ్ఞమును జేయించెదను; నీవు నేను వచ్చునంతవరకు ప్రతీక్షించుచుండుము."

ఇప్పుడు రాజూరకుండెను. ఆత డవుననలేదు, కాదనలేదు. ఇట్లనుకొనెను: "చూచెదనుగాక! యజ్ఞమును నేనుజేసితీరవలెను."

వశిష్ఠుడిట్లనుకొనెను : "మౌనం సమ్మతి లక్షణమ్" రాజు నా మాట కంగీకరించినాడు అని యాలోచించి ఆత డింద్రుని యజ్ఞమును జేయించుటకు బోయి, ఇంద్రుని యాగము నారంభించెను.

ఇచ్చట నిమి యిట్లనుకొనెను: "ధర్మ కా ర్య ము లం దా లస్యము పనికిరాదు. నేడు నాకు ధర్మకార్యములందు రుచికలదు. రేపుండక పోవచ్చును. చిత్తము చంచలమైనది. క్షణ క్షణము మారుచుండును. సత్వగుణ ప్రకోపమున ధర్మకర్మ లందును, బరమార్థ చింతనమందును గోరిక కలుగును. రాజస చిత్తమైనచో రాజ్య, ధనైశ్వర్య, ప్రభుత్వాది రాజస వస్తు సంగ్రహమందు లాలస యేర్పడును. తమోగుణ వృద్ధియైనపుడు నిద్రాలస్య ప్రమాదాదులకు వశీభూతుడగును. కావున ధర్మభావన కలుగగానే ఆధార్మిక కృత్యమును వెంటనే చేసివేయవలయును. అప్పుడు మృత్యువు తన కేశపాశములను బట్టుకొని యున్నదని భావింవ వలెను. శుభకర్మలందు వెనుక ముందు లాలోచింపక వెంటనే చేసి వేయవలయును. చెడ్డభావములు వచ్చినచో వానిని జేతనైనంత వరకు బోనాడవలయును. ఇంద్రుడు త్రిలోకాధిపతి. ఆతనికి ధనై శ్వర్యములకు గొదవలేదు. ఆతని యజ్ఞమెప్పుడు సమాప్తమగునో తెలియదు. ఆతని కాలమునకును, నాకాలమునకును జాలభేదము కలదు. మన మూడువందలరువది వర్షములాతని కొక్కరోజు. ఒకవేళ గురువునకు వీలుకాకున్నచో నింకొక కర్మిష్ఠి యగువానిచే నాయజ్ఞమును జేయించుకొన వచ్చును. దీనివలన గురువునకు నేమి యును నిబ్బందియుండదనుకొనెను. అచ్చట నింద్రుని యజ్ఞమును బూర్తికాగలదు. ఇచ్చట నాదియును నెరవేరగలదు." అనుకొని రాజు వేరొకచోట ఋత్విక్కులను బిలుచుకొని యజ్ఞారంభమును గావించెను. రాజు యజ్ఞము చాలవైభవముగ జరుగుచుండెను."

ఇచ్చట నిందుని యజ్ఞమును జేయించి, అవ్వారిగ దాన దక్షిణలనుగైకొని తన యజమానియగు నిమికి త్వరగా యజ్ఞమును జేయింప వలయునను నాశతో నతిశీఘ్రముగ వశిష్ఠుడు వచ్చెను, అచ్చటికి వచ్చి చూచునప్పటి కాతని యాశ్చర్యమునకు మేరలేకుండెను. యజ్ఞము చాలవైభవముగ జరుగుచుండెను. నలువైపులను స్వాహా, స్వాహా యనుధ్వని ప్రతిధ్వనించు చుండెను. ఆచార్య స్థానమున నింకొక ఋషి యుండెను. యజ్ఞ దీక్షితుడగు రాజు శ్రద్ధతో నాతని యాజ్ఞలను బాలించుచుండెను. ఎట్టి గౌరవాసనమున దాను గూర్చుండవలసి యున్నదో అట్టిచోట నింకొక ఋషి కూర్చుండి యుండుటను గాంచి వశిష్ఠుడు మండిపడిపోయెను. ఆతడు తన క్రోధమును నాపుకొన జాలకుండెను. దైవ విధాన మట్లున్నది. మునికి మిక్కిలి కోపము వచ్చెను.

ఇచ్చట రాజు తనగురువు వచ్చియుండుటను గాంచి, శ్రద్ధతో లేచి, ముందునకుబోయి, తన భార్యతో గూడ నాతనికి చరణ వందనమును గావించి స్వాగత సత్కారములనొనర్చి ఆనంద మును బ్రకటించెను.

ముని క్రోధభరితుడై యుండెను. ఆతడు రాజుయొక్క స్వాగత సత్కారములను నభినందింపలేదు. క్రుద్ధుడై యిట్లనెను :- "నిమీ ! ఇదియేమి యిట్లు జరిగినది ?

నమ్రతా పూర్వకముగ రాజిట్లనెను :— స్వామీ ! నేను మిమ్ముల నేయజ్ఞము కొరకు ప్రార్థించితినో ఆయజ్ఞము జరుగు చున్నది.

వ్యంగ్యస్వరమున ముని యిట్లనెను :- అయితే నేను నీకేమి యాజ్ఞ నొసంగితిని ?

సరళముగ రాజిట్లనెను :- స్వామీ ! మీరింద్రుని యజ్ఞమునకు వెడలవలయునంటిరి కదా !

క్రోధముతో ముని యిట్లనెను :- "నేనేమియును ననలేదే"

రాజిట్లనెను :- స్వామీ నేను యింద్రుని యాగమును జేయించి వచ్చువరకును బ్రతీక్షించు చుండుమని యంటిరి.

వశిష్ఠుడు దృఢతాస్వరమున గసరి యిట్లనెను :- అయితే నీవు నాకొరకేల బ్రతీక్షింపలేదు ? ఏమని యాజ్ఞనుల్లంఘించితివి?

రాజు తడబడుచు నిట్లనెను :- స్వామీ నేనిట్లను కొంటిని : ధర్మకార్యములలో నాలస్యము చేయగూడదు. ప్రాణుల జీవనము జలబుద్బుదము వంటిది. రేపేమగునో తెలియరాదు, ధర్మకార్యమును నెంత త్వరగా జేయగలిగిన నంత త్వరగా నెరవేర్పవలయును. నాభావము మీయాజ్ఞ నుల్లంఘించుటయందు కాదు. నేనీ జీవితమును గమలదళమున బడిన జలకణము వంటిదిగ నత్యంత చంచలమును, నస్థిరమునుగా భావించెదను, కావున నేనితరాచార్యుల వలన యజ్ఞదీక్షను గొంటిని.

రాజుయొక్క యిట్టి గూఢజ్ఞానయుక్తములగు వచనములను వినిన ముని కోపము ఆజ్యమువేయబడిన యగ్నివలెనయ్యెను.

ఆతడత్యంత క్రుద్ధుడై యిట్లనెను :- అరే! క్షత్రియాధమా! నీవు గురువులను గూడ నవమానించి స్వీయముగ బండితుడవుగా భావించుకొను చున్నావు. ఈదాన దక్షిణలనుగొను బ్రాహ్మణులు మాకాశ్రితులని నీవనుకొను చున్నావు ? మమ్ములను బిలిచినను బిలవకున్నను మమ్ములనేమి చేయగలవు. మంచిది, నీవు నాబలము జూచుకొనుము. ఆచార్యునవమాన మొనర్చిన ఫలము నను భవింపుము. నీవు మూర్ఖుడవయ్యు విద్వాంసుడ ననుకొను చున్నావు. ఈ శరీరమునే సమస్తమునుగా భావించి రాజునైతినను గర్వముచే నీవు గురువుల నవమానించు చున్నావు. నీ శరీరము పడిపోవు గాక. నీవిప్పుడే మృతుడవౌదువు గాక !"

ఇది వినగానే రాజునకు కోపము వచ్చెను. రాజాత్మజ్ఞాని యైనను భవితవ్యము ప్రబలమగుటచే నాతడు తన్నుతాను నిగ్రహించుకొనలేకపోయెను, ఆతడును సర్వసమర్థుడే. ఆతనికిని శాపానుగ్రహ సామర్థ్యము కలదు. అందువలన నాతడును జేతిలోనికి జలమును గైకొని యిట్లనెను :- "మునివరా ! దక్షిణలోభముచే మీరువివేక విహీనులరై నాకు దేహపతనశాపము నొసంగితిరి. కావున నేనును శాపము నొసంగుచున్నాను. మీదేహమును బడిపోవుసుగాక !"

సూతుడిట్లనెను :- "మునులారా ! క్రోధలోభముల దుష్పరిణామమిదియే. అల్ప విషయమునకై యింతటి శాపములు సంభవించినవి. ఇద్దరి వచనములును నమోఘములు, ఇద్దరును

సామర్థ్యవంతులే. రెండు శరీరములును ప్రాణ విహీనములై యజ్ఞ మండపమున బడిపోయెను. ఈఘటనమునుగాంచి అందరు నాశ్చర్య చకితులైరి. ఆనందము భంగమయ్యెను. అయినను యజ్ఞకార్య మాగిపోలేదు. అది పూర్వరీతిగ జరుగుచుండెను."

## ఆది విదేహుడు జనక మహారాజు

శ్లో॥ జన్మనా జనకః సోఽభూద్వైదేహస్తు విదేహజః ।
మిథిలో మథనాజ్జాతో మిథిలాయేన నిర్మితా ।

శ్రీభాగ. ౯ స్కం. ౧౩ అ. ౧౩శ్లో

దేహబంధముచేతనే జీవుడు బంధింపబడుచున్నాడు. అనిత్య మును క్షణభంగురమునగు నీదేహము నందు తాదాత్మ్యమునుజెంది యీ యనాత్మ పదార్థము నాత్మగా భావించుచుండును. అనిత్య మునే సత్యమనుకొను చుండును. దీనిమోహములో బడి, దీనిని పుష్టమొనర్చుకొనుటకై వివిధములగు పాపము లొనర్చుచుండును.

ఈ దేహధ్యాస వదలిపోయినచో నీదేహమున్నను మాన వుడు విదేహుడగును. జ్ఞానముననే దీనిమీద నేర్పడిన యాసక్తి దూరమగును. విషయాసక్తి విడువకుండినచో అట్టివాడు ఘోర వనమునకు సమస్తమును త్యజించిపోయినను మనస్సు విషయము లను చింతించు చుండినచో సమయము చిక్కినపుడు వానిని సంగ్ర హించుటకు బూనుకొనగలడు. దీనికి వ్యతిరేకముగ మానవుడు

విషయ విరక్తుడై, మనస్సులో వానియందాదర భావము లేకున్నచో నాతడు విషయములలో నున్నను విరక్తుడే. అట్టివాడన్నిటిని జేయుచున్నను జేయనివాడే. సమస్త కర్మలొనర్చు చున్నను నక్రియుడే.

సూతుడిట్లనెను:- "మునులారా! పరస్పరము శాపములను బెట్టుకొని నిమి వశిష్ఠు లిద్దరును తమతమ శరీరములను త్యజించిరి. వశిష్టుడు బ్రహ్మమానస పుత్రుడు. ఆతనికి స్థూలశరీరమందంతగా నపేక్షలేదు. అతడు తన సూక్ష్మశరీరముచే బ్రహ్మకు ప్రణామము గావించి యిట్లనెను:- "స్వామీ! నిమి నన్ను శపించి శరీర విహీనుని గావించినాడు! నేను మరల నేవిధముగ స్థూలశరీరమును బొంది సృష్టికార్యమున బాల్గొన గలుగుదునో తమరే శలవొసంగుడు."

వశిష్ఠుని యీ వచనములనువిని బ్రహ్మధ్యానించి సమస్త విషయములను దెలిసికొని యిట్లనెను:- "వత్సా! నీకింకను భూమి మీద జాలకార్యముకలదు. నీకొక కల్పము వరకును భూమిపై సప్తర్షులలో నుండవలసియున్నది. కావున నీవు మరల స్థూల దేహమును ధరించుము"

ఇది విని వశిష్ఠుడిట్లనెను:- "ప్రభూ! నేను మానవ స్త్రీ గర్భమున జనించగోరను. నేను గర్భములో ప్రవేశింపకయే స్థూల శరీరము వచ్చునట్టి యుపాయమును గావింపుడు"

అంత బ్రహ్మ యిట్లనెను: "నేను నీకొక యుపాయమును జెప్పెదను. ఒకసారి మిత్రావరుణులను ఋషులిద్దరును స్వర్గము నుండి వచ్చుచుండిరి. మార్గమందు వారికి షోడశ శృంగారము లొనర్చుకొని సర్వశ్రేష్ఠయగు నూర్వశియను నప్సరస కనబడెను. అతిసుందరియగు నాయప్సరసలు గాంచగనే ఆ యిద్దరు ఋషుల చిత్తము చంచలమయ్యెను. వారికి వెంటనే రేతస్సు స్ఖలిత మయ్యెను. వారాయమోఘ వీర్యము నొక ఘటమున నుంచిరి. దానిలోనికొక జీవి ప్రవేశించెను. నీవునుబోయి అకుంభములోనికే ప్రవేశించుము. నీకంటెముందు దానిలోనికి బ్రవేశించినజీవి ప్రపంచ ములో గొప్ప ఋషి. ఆతడగస్త్యుడను పేర బ్రసిద్ధుడయ్యెను. కుంభమునుండి జనించిన కారణముచే నాతని ప్రజలు కుంభజు డందరు. రెండవ యంశచే నీవు పుట్టెదవు. నీ పేరు పూర్వమువలె వశిష్ఠుడనియే యుండును. నీవే స్త్రీ ఉదరమునను బ్రవేశింపవలసిన పనిలేదు. నీవు ఘటమునుండి యుత్పన్నుడ వగుటచే నయోనిజుడ వయ్యెదవు."

బ్రహ్మాజ్ఞనుబొంది వశిష్ఠుడాతని చరణములకు బ్రణామ మును గావించి, వచ్చి ఘటములోనున్న మిత్రావరుణుల వీర్య మందు బ్రవేశించెను. కొంతకాలమునకు దానిలో నుండి యాతడు మరల వెనుకటిరీతిగా శరీరధారణమొనర్చి ఇక్ష్వాకు వంశరాజుల పౌరోహిత్యమును స్వీకరించెను.

ఇచ్చట నిమియొక్క యజ్ఞమునకు వచ్చిన మహర్షులు వశి ష్ఠుని శాపమున నిమి శరీరము పడిపోయినదనియు, నాతడు మృతు

డైనాదనియు దెలివికొని ఆశరీరమును గాల్చలేదు. అనేక విధము లగు సుగంధతైలములను బ్రయోగించి, యజ్ఞాంతమువరకా దేహమును రక్షించుచుండిరి. యజ్ఞసమాప్తికాగానే యజ్ఞభాగములను గైకొనుటకై సమస్త దేవగణములు వచ్చిరి. వారానందముతో దమ తమ భాగములను గ్రహించి ఋత్విజులను వరములను గోరుకొనుమనిరి.

ఋత్విజులు వినీతభావముతో నిట్లనిరి: "దేవతలారా! మీరు మాపై బ్రసన్నులరైతిరేని మా యజమానియగు నిమిమహారాజు మరల జీవింపవలయునను వరమును గోరుకొందుము."

ఋత్విజుల వాక్యములను విని సమస్త దేవత లేకకంఠమున, 'తథాస్తు'నిరి. అట్లే జీవింపగలడనిరి.

దేవతల వాక్యములను విని ఆత్మజ్ఞానియగు నిమి చక్రవర్తి యిట్లనెను: "నేనిప్పుడు మరల దేహబంధమున బంధింపబడదలచుటలేదు. భగవత్పరాయణులగు మునులు జనన మరణములకు దూరముగ నుండవలయు ననుకొందురు. వారు దేహబంధవిముక్తులై సదా భగవచ్చరణార విందములందే అనురక్తిని జెందగోరుదురు. నేను వదలిన శరీరమున బ్రవేశించి నేను జీవింపదలచుట లేదు. ఈ దేహము దుఃఖ, శోక, భయముల కాకరమైనది. అడుగడుగునకును దీనిలో మృత్యుభయముకలదు. ఈయనిత్యమగు దేహమునందు నాకు మమత్వము కలుగకుండునట్లు ప్రయత్నమొనర్పుడు."

రాజుయొక్క యీ వాక్యములను విని దేవతలిట్లనిరి:- "మంచిది. నిమి దేహమును ధరింపకయే లోకమున నజరామరు డగుగాక! ఆతడు సూక్ష్మదేహముతోడనే యుండి సమస్త ప్రాణుల కనురెప్పలందుండునుగాక! కన్నులందున్మేషణ నిమేషణములందిది ప్రకటమగుగాక."

సూతుడిట్లనెను: "మునులారా! అప్పటి నుండి నిమి చక్రవర్తి సమస్త ప్రాణుల కనురెప్పలందు నివసించుచుండెను. అందులకే సర్వులను గనురెప్పలను వేయుదురు. కనురెప్పపాటునకు నిమేషమందురు."

అంత శౌనకుడిట్లనెను: "సూతా! అంతకుముందు ప్రాణులు కనురెప్పలు వేసెడు వారుకారా?"

సూతుడిది విని యిట్లనెను: అట్లుకాదు స్వామీ! కనురెప్పలను మానవులు కొట్టుచునే యుందురు. పూర్వము నిమేషమున కధిష్ఠాతగా నేదేవతయో యుండెడువాడు. ఈ కల్పమందు జీవులందరును దేవతలవలె నిర్నిమేషులై యుండ యుండవచ్చును. అనగా జేప నీటిలో నిర్నిమేషయై యుండనట్లుగా నుండెడువారు. నిమి అవ్యక్తరూపముగ నందర కనురెప్పలపై నివసింపగానే అప్పటి నుండి యీ కల్పమందున్న జనులును గన్నులార్పసాగిరి."

శౌనకుడిట్లనెను : "సూతా సృష్టి యథా పూర్వకముగ నుండునని చెప్పుట సత్యమే. సరియే, తరువాత నేమైనది? నిమి చక్రవర్తి వంశము తరువాత నెట్లు నడిచినది?"

సూతుడిట్లనెను: "స్వామి! వినుడు. ఇప్పుడు నేను నిమి వంశమెట్లు విస్తరించినదో ఆవృత్తాంతమునుగూర్చి చెప్పెదను. మీరు సావధానులై శ్రవణ మొనర్పుడు. నిమి చనిపోగానే నిమి సింహాసనము రిక్తమయ్యెను. ఆతని రాజ్యమందరాజకత వ్యాపించెను. ధర్మకార్యములు నిలిచిపోయెను, అప్పుడు లోకకల్యాణ కాంక్షులగు గొప్ప గొప్ప ఋషులును, మునులును జింతితులైరి. గొప్ప గొప్ప జ్ఞానులును బ్రహ్మర్షులును పరమర్షులును గలిసి యజ్ఞమండలమునకు వచ్చిరి. అచ్చట నిమి యొక్క నిర్జీవ శరీరమును గాంచి సరసమర్థులగు మునులా శరీరమును మథింపసాగిరి. యోగయుక్త బుద్ధులగు మునులు సర్వజ్ఞులై మథించుటచే వారి సంకల్పబలమున నాతని శరీరము నుండి ఒక గొప్ప తేజస్వియగు పుత్రుడుదయించెను. మథించుటచే బుట్టినవాడు కావున నాతడు మిథిలుడనబడెను. విదేహమున నుత్పన్నుడగుటచే వైదేహుడనబడెను. మృత శరీరము నుండి పుట్టుటచే నాతడు జనకుడయ్యెను. ఆ పుత్రుని గాంచి సమస్త ఋషులును, మునులును, ప్రజలును పరమానందమును జెందిరి. ఆ మిథిలునిచే నిర్మింపబడిన నగరము మిథిలయను పేర బ్రసిద్ధిని జెందెను. ఈతడే జనకవంశమునకు సర్వప్రథముడగురాజు. ఆతని వంశజులందరును మైథిలులనియు, జనకులనియు, విదేహులనియు బిలువబడుచుండిరి. ఈతని వంశజులందరును బ్రహ్మజ్ఞానులును, జీవన్ముక్తులునై యుండిరి. ఈతనికి బుట్టిన పుత్రుడుదావను జనకుడనుపేర బ్రపంచమున బ్రసిద్ధిని జెందెను.

ఉదావసు జనకుని పుత్రుడు నందివర్ధనుడు. నందివర్ధనుని పుత్రుడు సుకేతువు. సుకేతువునకు దేవరాతుడు, దేవరాతునకు బృహద్రథుడు పుట్టెను. ఈతడు బ్రహ్మర్షి. ఈతడు యాజ్ఞవల్క్యునితో నాత్మజ్ఞానమునకు సంబంధించిన గూఢప్రశ్నల నడిగెను. ఆప్రశ్నలను గురించి యుధిష్ఠిరుడడుగగా భీష్ముడు విస్తారముగ మహాభారత శాంతిపర్వమున వర్ణించియుండెను. ఈ బృహద్రథునకు మహావీర్యు డుదయించెను. మహావీర్యునకు సుధృతి యుదయించెను. సుధృతి పుత్రుడు ధృష్టకేతువు. ఆతనికి హయాశ్వుడును, హయాశ్వునకు మరువును జన్మించెను. మరువునకు ప్రతీపకుడును, ప్రతీపకునకు కృతిరథుడును, కృతిరథునకు దేవమీఢుడును, ఆతనికి విశ్రుతుడును, విశ్రుతునకు పరమ జ్ఞానియగు మహాధృతి యునుదయించెను. మహాధృతికి కృతిరాతుడును, కృతిరాతునకు మహారోముడుదయించెను. మహారోముని పుత్రుడు హ్రస్వరోముడు, హ్రస్వరోముని పుత్రుడు మహాభాగ్యశాలియును, పరమ పుణ్యవంతుడును, విశ్వ విఖ్యాతుడును, నిందాద్రి దేవతలచేతను నమస్కరింపబడు చుండిన పుణ్యశ్లోకుడునగు సీరధ్వజ మహారాజు. ఈతనికే సీతాభగవతికి తండ్రియగునట్టి విశ్వపండిత పదవి లభించినది."

ఇది విని శౌనకుడిట్లడిగెను:- "సూతా! సీతాభగవతి జన్మవృత్తాంతమేమి? మేము జగజ్జనని అయోనిజయనియు మానవ స్త్రీ గర్భమున జనింపలేదనియు వినియుంటిమి. నీవామెను జనకుని పుత్రిక యనుచున్నావు."

అంత సూతుడిట్లనెను:- "స్వామీ! సీతాదేవి వాస్తవమున నయోనిజయే. ఆమె రజోవీర్యములచే బుట్టలేదు. అయినను జనకుడామెను బెంచెను. అందువలన నాతడు పెంపుడు తండ్రి యయ్యెను. వాస్తవమున జానకీదేవి జగజ్జనని. సమస్త బ్రహ్మాండమామె కృపాకటాక్ష వీక్షణముచే నుత్పన్నమైనది. అయినను నామెలీల కొరకు శరీరమును ధరించెను. అందువలన నుపచారమున జనకుడామెకు తండ్రిగా నెన్నబడెను. పూర్వజన్మ తపః ప్రభావముచేతనే ఆతడు జగజ్జననికి జనకుడుగ బ్రసిద్ధిని జెందెను. జగన్మాత ఆతని సంబంధముచేతనే జానకి, జనకనందిని, జనకాత్మజ, వైదేహి, మైథిలి, మిథిలేశ కుమారి మొదలగు నామములచే బ్రసిద్ధిని జెందెను. జానకీదేవి యెట్లు పుట్టినదో యిప్పుడు మీకా వృత్తాంతమును జెప్పెదను వినుడు."

## సీత తండ్రి సీరధ్వజ మహారాజు

శ్లో॥ తతః సీరధ్వజో జజ్ఞే యజ్ఞార్థం కర్షతో మహీమ్।
సీతా సీరాగ్రతో జాతా తస్మాత్సీరధ్వజః స్మృతః ॥

శ్రీభాగ. ౯ స్కం. ౧౩ అ ౧౮ శ్లో॥

సామాన్యముగా బుత్రికాపరిచయము తండ్రి పేరువలన గలుగుచుండును. 'ఆపిల్లి యెవరని' అడిగినచో సామాన్యముగ నామె తండ్రిపేరు చెప్పుదురు. అమ్మ పుట్టినింట దల్లి పేరును

జెప్పుచు ఫలాని ఆమె కూతురందురు; లేదా ఫలాని వాని కూతురు. బిడ్డ యందురు. కాని కొందరు కన్యల పేర్లచే వారి తల్లిదండ్రులెవరో తెలియును. మనము సునయన రాణి యనిన నెవ్వరును దెలియ లేరు. అట్లనిన సునయన యెవరందురు. అప్పుడామె సీత తల్లి యనినచో నందరును దెలిసికొనగలరు. సర్వ సాధారణముగ సీరధ్వజ మహారాజు ప్రసిద్ధుడు కాడు. జానకి తండ్రి జనకుడు, సీతా కారణముననే జనకునకు సీరధ్వజుడను పేరు ప్రసిద్ధిని జెందెను. సీతకు వైదేహి యను పేరేల వచ్చినది? ఏలనగగా నామె తండ్రి విదేహుడనబడెను. ఆమె మిథిలాధిపుని పుత్రిక యగుటచే సీతకు మైథిలి యను పేరు వచ్చెను. సారాంశ మేమనగా సీరధ్వజ మహారాజు జ్ఞాని. కాని యాతని ప్రసిద్ధి జగజ్జనని యగు జానకికి జనకుడగుటచే గలిగినది.

సూతుడిట్లనెను :–"మునులారా! సీరధ్వజ జనకు డొకసారి యజ్ఞమును జేయదలచెను. ఆతడు వేదజ్ఞులగు బ్రాహ్మణులను బిలిపించి, యజ్ఞమునకు యోగ్యమగు భూమిని శోధన చేయించెను. సర్వజ్ఞులగు ఋషులు సమస్తమును గాంచి జ్ఞానదృష్టిచే విచారించి ఒక భూమిని యజ్ఞమున కుపయోగమైనదని నిర్ణయించిరి. జనకుడును బ్రాహ్మణుల యాజ్ఞను శిరసావహించి ఆ స్థానమున యజ్ఞ మొనర్చుటకు నిశ్చయించెను. విధ్యుక్తముగ బూజించి మహారాజు స్వయముగ బంగారు నాగలిచే నా భూమిని దున్న నారంభించెను. దున్నగా దున్నగా నాతని హలమందలి కర్రు ఒక స్థానమున దట్టుకొనెను. నాగలి కర్రుతో చీల్పబడిన భూమిని జాలు లేక

సీరమందురు. దాని నుండి పరమ సుందరి యగు నొక కన్యక యుండిన ఘట మొకటి బయటపడెను. రాజా కన్యకను గాంచి పరమ ప్రముదితు డయ్యెను. ఇట్టి రూపలావణ్య యుక్తయు, పరమ సుందరియు నగు కన్య నాతడెన్నడును జూచి యుండలేదు. యజ్ఞమొనర్చుటకు పూర్వమే సిద్ధి ప్రకటమైనట్లాతడు భావించెను. ఆతడు భూపతి. అందువలన దన పతికామె తన యుదరమునుండి కన్యారత్నము నర్పించెను. మహారాజత్యంతోల్లాసముతో నా కన్య కను జంక కెత్తుకొని తన రాణియగు సునయన కొసంగెను. సునయన చాల నిండిపోయెను. ఆమె యిట్టి పరమ సుందరియగు కన్యను గాంచి మిక్కిలి యానందించెను."

ఇదివిని శౌనకుడిట్లడిగెను: సూతా! భూమిలోనికిట్టి సుందర కన్యక యెచ్చటి నుండి వచ్చినది?"

అంత సూతుడిట్లనెను: "స్వామి! ఈ సంబంధమున గల్ప భేదముచే జాలకథలుకలవు. అందులో నొక కథయిది— భూమి నంతకును రావణుడు రాజై దిగ్విజయము గావించుచుండెను. మానవునకు వినాశసమయ మాసన్నముకాగానే వాని బుద్ధి భ్రష్ట మగును. నాశనము కాబోవువాడు వేదములను, శాస్త్రములను, దేవత లను, బ్రాహ్మణులను, సాధువులను, గోవును, ధర్మమును ద్వేషించు చుండును"

రావణుడిట్లనుకొనెను: "ఈ సాధువులు వనములందు మిక్కిలి యానందమును జెందుచుందురు. ఈ వనములను దమ

రాజ్యములోనివని యెవ్వరు ననుకొనరు. వీరిష్టము వచ్చినట్లు ఫల మూలములను దినుచుందురు. వీరి యాశ్రమములలో నెన్నో వృక్షములుండును. వీని నేరాజుయొక్క రాజ్యములోని వనియును భావింపరు. వీరు నాకధీనులై నాయాజ్ఞలను బాలించుచుందురు." ఇట్లాలోచించుకొని ఆతడు తన సేవకులను మునులకడకు పన్నులను గైకొనుటకు బంపెను.

మునులందరును గలిసియిట్లనిరి: "మేమరణ్యములలో నివసించుచుందుము. ఫలమూలముతో జీవించు చుందుము. మావద్ద పన్నులిచ్చుట కేమున్నది?"

సేవకులు మరల నందరునుబోయి ఋషులను బలవంతమొనర్చిరి. ఇది వినగానే ఋషులకు గోపము వచ్చెను. వారందరును నొక సభనుజేసుకొని తాము తమ తపః పూతమగు రక్తమునుదీసి పన్నురూపమున నొసంగుట కేకగ్రీవముగ నిశ్చయించుకొనిరి. దానిలో నుండి ఆదిశక్తియు, జగజ్జననియునగు నామె యుద్భవించి యీదుష్టుని జంపగలదు. మాదుఃఖములను దూరమొనర్పగలదు" అని నిశ్చయించి సమస్త ఋషులు కొంత కొంత రక్తము నొసంగిరి. దానితో నొక కుండ నిండిపోయెను. దానిని రావణుని సేవకుల కొసంగుచు ఋషులిట్లనిరి: "మావద్ద నున్న పన్నిదియే. దీనివలన నొకశక్తి యుత్పన్నము కాగలదు. అది మిమ్ములను నాశన మొనర్పగలదు."

సేవకులు ఘటమును గొనిపోయి, యీ వృత్తాంతమును రావణునకు జెప్పిరి. రావణుడిదివిని భయపడెను. పాపియొక్క హృదయమిట్లే యుండును. ఆతడు సేవకులతో నిట్లనెను: "దీనిని జాలదూరము తీసికొనిపోయి, యెచ్చటనైన భూమిలో బాతి పెట్టుడు."

ఇది విని సేవకులాఘటమును గొనిపోయి, ధర్మాత్ముడును జ్ఞానియునగు జనక మహారాజు రాజ్యమందు భూమిలో బాతిపెట్టిరి. దానిచే నొకశక్తి పుట్టెను. అదియే చివరకురాజు నాగలితో దున్నుచుండదొరకెను. ఆమెయే రావణునివధించెను.

ఇది విని శౌనకుడిట్లనెను:– "సూతా ! రావణుని వధించి నది రామచంద్రుడు కదా ! సీతరావణు నెచ్చట వధించినది? ఆమె ఆతని వధకు నిమిత్తమైనదనుట నిజమే"

అంత సూతుడిట్లనెను:— "స్వామీ ! ఈ సృష్టిలో ననేక సంఘటనములు జరుగుచుండును. భగవానుడు నామ రూపములను ధరించి నానాలీల లొనర్చుచుండును. వాని కాద్యంతములు లేవు. వానికి సంభవా సంభవములులేవు. భేదములేదు. విరోధములేదు. భగవంతున కన్నియును సంభవములే. వైదేహి నిమిత్తముగ వధింపబడిన రావణుడు సాధారణ రావణుడు. మహారావణుని జగజ్జనని యగు జానకియే వధించినది. ఈ రావణుని వధించుటకు రామున కేమి సామర్థ్యమున్నది? అది మహాశక్తియొక్క కార్యము"

అంత నాశ్చర్యమును ప్రకటించుచు శౌనకుడిట్లడిగెను:— "సూతా! ఆమహారావణుడెవరు? సీత ఆతని నెట్లు వధించినది? కృపతో నీవృత్తాంతమును మాకు జెప్పవలయును. దీనిని వినిన మాకత్యంతాశ్చర్యము కలుగుచున్నది."

దృఢతాస్వరమున సూతుడిట్లనెను:— "స్వామీ భగవన్మాయ కాశ్చర్యమేమున్నది? సమస్త ప్రపంచమే ఒక మహాశ్చర్యవిషయము. మహారావణుని కథ చాల పెద్దది. దాని నిచ్చట బూర్తిగా జెప్పబూనినచో జనక వంశవర్ణన మాగిపోగలదు. కావున నేను దీనిని సంక్షేపముగ జెప్పెదను. మీరు దీనిని సావధాన మనస్కులరై శ్రవణ మొనర్పుడు"

రావణునిజంపి రామచంద్రుడు రాజ్యసింహాసనమున గూర్చుండగనే సమస్త దేవతలును, ఋషులను, మునులును బ్రశంసింపసాగిరి. అప్పుడు నవ్వుచు జానకీదేవి యిట్లనెను:- "దశముఖుడగు రావణుని జంపుటేమంత ఘనకార్యము. ఆతడు సాధారణ జీవి. భగవానుడు సహస్రముఖములుకల మహారావణుని జంపగలిగినచో నది ప్రశంసింప దగినదే."

ఇది వినగానే రామచంద్రునకు మిక్కిలి లజ్జకలిగెను. ఆతడిట్లనెను: "మహారావణుడెవడు? ఆతడెచ్చట నుండును?"

జానకీదేవి యిట్లనెను: "ఆ మహారావణుడు లంకను వదలి ప్రలంకలో నివసించు చున్నాడు. ఆతనికి సహస్ర ముఖములు కలవు. ఆతని జంపిననే భగవానుని బ్రశంసింపదగి యుండును."

ఇది వినగానే శ్రీరామచంద్రుడు వెంటనే మహాలంకకు అనగా బ్రలంకకు దాడి వెడలుటకు సైన్యమును సిద్ధపరుపుడని యాజ్ఞాపించెను.

ఆజ్ఞకాగానే సైనికులందరును యుద్ధమునకు బయలు దేరిరి. భగవానుడు మహాలంకకుబోయి మహారావణునకు సందేశము నిట్లు పంపెను. "మేము నీతో యుద్ధమొనర్చెదము." ఇది వినగానే ఆతడు నవ్వియిట్లనెను: "నాతో బోరుటకు రామునకు సామర్థ్య మెక్కడిది? మునులారా ఇది చాల పెద్దకథ. దీనిని నేను విస్తార ముగ జెప్పను. సంక్షేపముగ జెప్పెదను. మహారావణునితో యుద్ధ మొనర్చుటకై అంగద, విభీషణ, సుగ్రీవాంజనేయ, భరత, లక్ష్మణ శత్రుఘ్నులుపోయి అందరును బరాజితులైరి. శ్రీరామ చంద్రుడును బోరబోయెను. ఆతడును నోడిపోయెను. అప్పుడాత నికి మిక్కిలి చింతకలిగెను. ఆతడిట్లనుకొనెను: "ఇప్పుడు నేనేమి చేయుదును? నాకీర్తియంతయును దుమ్మగలిసినది."

శ్రీరాముడత్యంత చింతితుడై యుండుటనుగాంచి గురువగు వశిష్ఠుడిట్లనెను:- "రాఘవా! నీవేల చింతించెదవు? మహారావణుని నీవెన్నటికిని జంపజాలవు. నీవేకాదు, ప్రపంచములో నెవడును జంపజాలడు."

శ్రీరామచంద్రుడు చింతితుడై యిట్లడిగెను:- "స్వామీ! అయితే వీడెట్లు చచ్చును?"

వశిష్ఠుడిట్లనెను: -"నీ ప్రక్కన గూర్చుండిన జానకి జగదంబిక. ఈమె తలచు కొనినచో రావణుని జంపగలదు. నీవీ మెను బ్రార్థించిన బ్రసన్నయగును ఆమె ప్రసన్నయైనచో నన్నియును సంభవమే."

ఇదివిని రామచంద్రుడు సంకోచమునబడెను, కానిచేయ గలిగిన దేమున్నది? స్వార్థము కొరకన్నియును జేయవలసి యుండును. భార్యముందు చేతులను జోడించుకొని స్తుతించుట సాధారణకార్యమే. ఇట్లుచేయనివాడు పతికానేకాడు.

శ్రీరామచంద్రుడాది శక్తియగు జగదంబను స్తుతించెను. జగదంబ తనశక్తిచే నింక నెన్నియో శక్తులను సృజించెను. వారం దరును గలిసి రావణుని సహస్ర శిరస్సులను ఖండింపగా మహా రావణుడు మరణించెను. శ్రీరామచంద్రునకిప్పుడు సీతాదేవి యొక్క బలపరాక్రమములు తెలిసెను. ఈవిధముగ మహా శక్తియును, జగదంబికయునగు జానకి శ్రీరామునిచేతగూడ చావని మహారావణుని వధించినది. ఇదివేరొక కల్పములోనికథ. ఈ విధ ముగ సీతా జన్మవిషయమున వేరొక కథకూడకలదు. అది యిట్లున్నది.

ఒక సమయమున రావణుడు త్రిలోకములను జయించుచు హిమాలయ పుణ్యప్రాంతమునకు జేరుకొనెను. అచ్చట నాతడను పమ రూపలావణ్య యుక్తయగు నొకలలనా లలామమునుగాంచెను. ఆమె అవివాహితయగు కన్యక. చెప్పకయే యాచేడియకు యౌవ

నావస్థ ప్రవేశించినది. ఆమె సౌందర్య మనవద్యమైనది. ఆమె యొక్క అంగప్రత్యంగముల నుండి లావణ్యము విరిసి ఆ పర్వత ప్రాంతమునంతను లావణ్యయుక్తముగ నొనర్చు చుండెను. ఆమె తన ప్రకాశముచేతనే ప్రకాశించు చుండెను. మృగ చర్మమును ధరించి, తపస్వినివలె వేషమును ధరించి, ఆమె మూర్తీభవించిన తపస్సువలె నుండెను. ఏకాంతారణ్యము నందిట్టి యనుపమ రూప లావణ్య యుక్తయగు లలననుగాంచి రావణుడు కామబాణ విద్ధుడయ్యెను. ఆతడు ఆమధురవాణితో నిట్లనెను:- "దేవీ! నీవెవతెవు? ఎవరి పుత్రికవు? ఈ ఘోరారణ్య మందేకాంతమున నేల వాసము చేయుచున్నావు? నీసౌందర్యమును, ఈ వయస్సును, ఈ కఠోర తపస్సు ఇవన్నియును విపరీతములుగ నున్నవేల? నీవు నాకు నీపరిచయమును గావింపుము"

ఆకన్య సరళముగ నిట్లనెను:- "మహానుభావా! మీరు నాయాతిథ్యమును గ్రహింపుడు. కాళ్ళు కడగుకొనుటకు నీరును గైకొనుడు. ఈ ఫలములను దిని, జలమును గ్రహింపుడు. మీ శ్రమను దీర్చుకొనుడు. అంతనేను నా సంగతిని జెప్పెదను."

ఆమెయొక్క వీణానాదము నపహసించు నత్యంత మధుర వాణిని విని రావణుడిట్లనెను:- "దేవీ! నీమధుర వచనములచేతనే నాకు సత్కారము లభించినది. నీదర్శనము చేతనే నాశ్రమయంతయును నశించినది. నీవు నాకు నీసంగతిని జెప్పుము."

అంతగన్యక యిట్లనెను:- "మంచిది, వినుడు. నేను నాపరిచయమును గావించెదను. సమస్త దేవతలకు గురువుబృహస్పతి.

దేవతలకు గురువగుటచే గురుపనియు, దేవగురువనియు జెప్పుదురు. ఆతనికొక పుత్రుడు కుశధ్వజుడను వాడు పుట్టెను. ఆకుశధ్వజుడే నాతండ్రి. వాంగీయ కన్యవలన నాతనికి నేను బుట్టితిని. మాతండ్రి నాకు వేదవతియనుపేరును బెట్టినాడు. ఆతడు నన్నధికముగ బ్రేమించును. నేను వివాహయోగ్యను కాగానే చాలమంది దేవతలును, యక్షులును, గంధర్వులును, మునిపుత్రులును, రాజపుత్రులును వచ్చి నాతండ్రిని నన్నీయమని అడిగిరి. చాలమంది నన్ను వివాహమాడవలయునను గోరికను బ్రకటించిరి; కాని నాతండ్రి నన్నెవరికి నీయలేదు."

ఇది విని రావణుడిట్లడిగెను:—"దేవీ! ఇంతటి గొప్ప వారు వచ్చి నీతండ్రిని యాచింపగా నీతండ్రి వారికేలయొసంగలేదు. వయస్సువచ్చిన పిల్లకు వివాహమొనర్చుటకు తండ్రి మిక్కిలి చింతించి, యుత్సహించునుగదా!"

వేదవతి యిట్లనెను :- "రాక్షసేంద్రా! నన్నే కారణమున నా తండ్రి యెవరికి నీయలేదో ఆ సంగతిని గూడ చెప్పెదను. మీరు శ్రద్ధతో వినుడు. తన యల్లుడు విష్ణువు కావలెనని మా తండ్రి కోరిక. ఈ యాశచే నాతడు నన్నెవరికి నీయలేదు"

ఒకసారి దైత్యరాజగు శంభుడు నా తండ్రిని నన్నుగూర్చి యాచించెను. తండ్రి ఆతనిగూడ కాదనెను. ఆ దైత్య రాజు నన్ను వివాహమాడ వలయునని మిక్కిలి యుత్సహించెను. నా తండ్రి యిచ్చిన శుష్కమగు బ్రత్యుత్తరమును గాంచి క్రుద్ధుడై

వెడలిపోయెను. కాని ఆతని మనస్సులోని మలినము పోలేదు. ఆతను దీనిని మిక్కిలి యవమానముగ భావించి యా యవమానమునకు మా తండ్రి యెడల ప్రతీకార మొనర్ప దలచెను. ఒక దినమున నా దుష్టుడు రాత్రియందు మెదలక వచ్చి, నిద్రించుచున్న నా తండ్రిని వధించెను. నా తల్లి కీ ఘటనము వలన మిక్కిలి దుఃఖము కలిగెను. ఆమె నా తండ్రి శరీరమును బట్టుకొని పోయి అగ్నిలో ప్రవేశించెను.

నా తండ్రి నన్ను శ్రీమన్నారాయణున కీయదలచినాడు. నాకు పురాణ పురుషునితో వివాహము చేయదలచినాడని దెలిసికొని ఆతని ప్రతిజ్ఞను నెరవేర్చుటకై వనమున కిచ్చటికి వచ్చితిని. నేనా పురాణ పురుషుడు పురుషోత్తమునే పతిగా భావించి ఆతని నారాధించు చున్నాను. నేను నా హృదయము నాతని కర్పించితిని, నేను మానసికముగ నాతని వరించితిని. నన్ను స్వీకరించుటో, స్వీకరింప కుండుటో అది ఆతని పని. ఆ సర్వేశ్వరుని ప్రసన్ను నొనర్చుకొనుటకై నేను ఘోర తపమొనర్చు చున్నాను. నేనిప్పుడు నా విషయమును జెప్పితిని. మీరింక సుఖముగ బోవచ్చును.

రావణు డిట్లనెను: "నేను వెళ్ళుద మనుకొన్నను వెళ్ళజాలను. నా కాళ్ళు సాగుటలేదు. అవి ముడుచుకొని పోయినట్లైనవి. ఇప్పటి కింకను నీ వివాహము కాకుండుటది యదృష్టము. సుందరీ! నేను నీ రూపమునందనురక్తుడ నైతిని. నీ సౌందర్య

మును గాంచి ప్రమత్తుడనైతిని. భామినీ! దైవము నిన్ను నాకొరకే సృజించినాడు. నేను త్రిలోకాధిపతిని. లోకపాలు రందరును నా పేరు చెప్పిన గడగడ వణకుదురు. నా యెదుట విష్ణు వెంతటి వాడు. విష్ణువును దేవతలవలె నా యెదుటకు రాజాలడు. నీవు హఠమును వీడి నన్ను బతిగా నొనర్చుకొనుము. నీకు నీ తపః ఫలము లభించినది."

వేదవతి గంభీరముగ నిట్లనెను:— "రాక్షస రాజా! నీ కీ మాటలు శోభింపవు. నేను విష్ణు పత్నిని. నీవు పులస్త్యుని పౌత్రుడవు. ఉత్తమ కులమున బుట్టితివి. పరస్త్రీ యందు దుర్భావముంచుట ఉచితము కాదు."

ఇది విని రావణు డధికార స్వరమున నిట్లనెను:- సుందరీ! నీకు మిక్కిలి రూప గర్వము కలదు. ఉండవలెను; ఏలననగా నేనిట్టి సుందరి నింతవరకు చూడలేదు. నీ యీ యవస్థ సుఖ భోగముల కేర్పడినది. నీవు విరాగినివలె దపం బొనరించుట శోభింపదు. నీవు మాటి మాటికిని విష్ణు విష్ణు యనుచున్నావు. ఆ విష్ణువెవడు? ఆతడు పిరికిపంద. అసురులతో యుద్ధము చేసి చేసి పారిపోయినాడు. ఆతడు బల, వీర్య, ఓజస్తేజైశ్వర్యాదులలో నా కీడు కాడు. నీ వా విష్ణువునందు మోహమును వీడి నన్ను వివాహమాడి యథేచ్ఛముగ సుఖము లనుభవింపుము."

వేదవతి యిది విని పరమ క్రుద్ధయై యిట్లనెను:-"రాక్షసా! నీవు నిజముగ రాక్షసుడవే. త్రిలోక స్వామియగు విష్ణువును నీవు

తప్ప యిట్టి శబ్ద మవ్వడు పలుకగలడు? నీ విప్పుడే పారిపొమ్ము. లేకున్న నీకు కుశలము లేదు."

ఇది వినగానే రావణునకు గోపము వచ్చి యిట్లనెను : నీవు నన్నవమాన మొనర్చుచున్నావా ? నీవు నన్ను సాధారణ వ్యక్తిగా భావించుచున్నావు. మంచిది. నీవు దీని ఫలమును భోగింపుము." అని పలికి ఆతడు వేదవతిని బలాత్కారముగ బట్టుకొనెను.

జుట్టు పట్టుకొను నప్పటికా కన్య సింహినివలె నయ్యెను. వెంటనే ఆమె తోక ద్రొక్కిన త్రాచువలె జేతితో దన వెంట్రుక లను ఖండించెను. ఆ సమయమున సతీ ప్రభావముచే నామె చేయి కత్తివలె నయ్యెను. రావణునిచే బట్టుకొనబడిన వెంట్రుక లాతని చేతిలోనే నిలిచిపోయెను. గర్జించి ఆమె యిట్లనెను:—"దుష్టా! నీవు నన్నవమానించితివి. పరపురుషుడ వయ్యును నీవు నన్ను గామ భావముతో స్పర్శించితివి. కావున నా యీ శరీరము తపస్సునకు బనికిరాదు. ఇప్పుడు నేను దీనిని భస్మమొనర్చెదను. నేను తలచు కొనిన నిన్ను వధింపగలను; కాని స్త్రీల కది యుచితము కాదు. శాప మొసంగియు నిన్ను నాశమొనర్పగలను. కాని శాపముచే దపస్సు నష్టమగును. కావున నా శరీరము నిప్పుడే అగ్నిలో భస్మమొనర్చెదను. రాబోవు జన్మమున నేనే ధర్మాత్మునకో అయో నిజనై జన్మించి, నీవు చేసిన నీ యవమానమునకు బ్రతీకారమొన ర్చెదను. నీవు నన్ను వనమున నవమానించితివి. కావున నీ వధకు ననమే కారణము కాగలదు."

సూతుడిట్లనెను : మునులారా! ఇట్లు పలికి వేదవతి వెంటనే యేడుకట్టెలను ప్రోవు చేసి, దాని కగ్నిని బెట్టి తన శరీరమును భస్మమొనర్చుకొనెను. రావణుడు పాషాణమూర్తివలె నట్లే నిలుచుండి చూచుచుండెను. చివరకు చింతతో వెడలిపోయెను.

ఆమెయే జనక మహారాజు దున్నుచుండ భూమినుండి పుట్టినది. ఆమెకు సీత యను బేరువచ్చెను. బ్రహ్మర్షియగు గుశధ్వజుడు భగవాను డల్లుడు కావలయునని చచ్చెను. కావున నాతడే పవిత్రమగు జనక వంశమున బుట్టెను. సీరమునుండి సీత పుట్టుటచే నాతనికి సీరధ్వజుడను పేరు వచ్చెను. ఈ సీరధ్వజుడు పరమ ధార్మికుడును, మహా విద్వాంసుడునై యుండెను. ఇంటిలో నున్నను నీతడు విరాగిగనే యుండెను.

ఈ విధముగ సీతా జన్మ విషయమున ననేకములగు కథలు గలవు. వాస్తవ విషయమేమనగా సీత భగవంతుని ఆది శక్తి, భగవానుడెచ్చట నవతరించునో ఈమెయును నచ్చట నవతరించు చుండును. శక్తి లేక శక్తిమంతు డేమియును జేయజాలడు. సమస్త కార్యములును శక్తి ద్వారానే జరుగును. శక్తిశాలియే అన్నియును జేయగలడు. జన్మ జన్మాంతరములలో నెవడు సుకృత మొనర్చినాడో, అట్టి సౌభాగ్య శాలియగు వారికడనే శక్తి ప్రకటమగును. శక్తియొక్క ఆధారముననే యీ విశ్వమంత యును నిలిచియున్నది. ఆది జనకుని నుండి నేటివర కెందరు జనకులయినారో వారందరి యొక్క తపస్తేజ, జ్ఞాన, ధ్యాన,

సమస్త సుకృత ఫలరూపముగ సీత ఆ వంశములో బుట్టినది. స్వయముగ గృపతో శక్తి వారి కులమును గృతార్థమొనర్చుటకై అవతరించిన దనవచ్చును. సీరధ్వజ మహారాజునకు సీత యెట్లు కూతురైనదియు నేను మీ కత్యంత సంక్షేపముగ సీతా జనన వృత్తాంతమును జెప్పితిని. ఇప్పుడింక మీరేమి వినగోరుచున్నారు?

శౌనకు డిట్లనెను : అయితే సూతా! ఇప్పుడిక నీవు సీరధ్వజుని తరువాత జనక వంశములోని రాజులను గూర్చి చెప్పుము.

సూతుడిట్లనెను : వినుడు స్వామీ! ఇప్పుడు నేను తరువాత రాజులను గూర్చి వర్ణించెదను. సీత తండ్రియగు సీరధ్వజ జనకునకు గుశధ్వజుడు పుత్రుడయ్యెను. ఈ మహారాజు కూడ పితృ, పితామహ, ప్రపితామహులవలె పరమ జ్ఞానియు, జీవన్ముక్తుడు నయ్యెను. ఈతని పుత్రుడు ధర్మధ్వజ మహారాజు. ఈతని తోడనే యోగినియగు సులభకు గొప్ప ఆధ్యాత్మ పూర్ణమగు సంవాదము జరిగెను.

ఇది విని శౌనకుడిట్లడిగెను:- "సూతా! ఈ సులభయను యోగిని యెవరు? ధర్మధ్వజ జనకమహారాజునకును నీమెకును నెచ్చట సంవాదము జరిగినది. దానిలోని ముఖ్య విషయమేది? దయతో జనక సులభా సంవాదమును మాకు జెప్పవలెను."

అంత సూతుడిట్లనెను: "స్వామీ! ఈ కథా ప్రసంగమున నిట్టి గూఢజ్ఞాన విస్తారమునుజేయ వీలుండదు. అయినను బ్రసంగ

వశమున సంక్షేపముగ నేను మీకు సులభా ధర్మధ్వజ జనకుల సంవాదమును జెప్పెదను. మీరీ గూఢజ్ఞానమునకు సంబంధించిన ఆఖ్యానమును శ్రద్ధతో వినగలరని యాశించు చున్నాను."

## ధర్మధ్వజుడు — యోగినియగు సులభ

శ్లో॥ కుశ ధ్వజ స్తస్య పుత్ర స్తతో ధర్మధ్యజో నృపః ।
ధర్మ ధ్వజస్య ద్వౌ పుత్రౌ కృతధ్వజ మితధ్వజౌ ॥

శ్రీభాగ. ౯ స్కం. ౧౩ అ ౧౯ శ్లో॥

సమాన శీలముగల వ్యక్తులిద్దరు సమావేశమైనచో బరస్పర సత్సంగముచే బోధియుత్పన్నమగును. ఇద్దరకును సుఖము కలుగును. జ్ఞాని జ్ఞానిని వెదుకుకొనును, వ్యసని వ్యసనుని వెదుకుకొనును. సమాన ధర్మమువారు కానిది సత్సంగ సుఖముండదు, ఇష్టముతోడను, మనస్సుతోడను గలిసికొనకుండినచో మమకారముండదు. వాద వివాదములలో గటు శబ్దము ప్రయోగింప బడినను నిర్ధభావనలు శుద్ధముగ నుండవలయును. ఏలననగా జ్ఞానులను, వీణను, మీటుటచేతనే సుఖముత్పన్నమగును. మీటగా మీటగా నవి కలిసి ఒక్కస్వరమగును; అప్పుడు చెప్పవలసిన దేమున్నది? బ్రహ్మానందప్రాప్తి కలుగును.

సూతుడిట్లనెను: "మునులార! మీరు నన్ను సులభా ధర్మధ్వజ జనక సంవాదమును గూర్చి ప్రశ్నించితిరి. దానిని మీకునేను

జెప్పెదను. ఈగూఢ జ్ఞానయుక్తమగు సంవాద మత్యంత గంభీర మైనది. దీనిని వినునప్పుడు మనస్సటు నిటు బోయెనా పేద బెల్లము కాగలదు. కావున మీరు దీనిని బాగుగా స్వస్థ చిత్తులరై సావధాన ముగ శ్రవణ మొనర్పుడు.

ప్రాచీనకాలమున సులభయను నొకగొప్ప ప్రసిద్ధిని జెందిన యోగినీ స్త్రీ యుండెను. ధర్మధ్వజుడగు జనకుడును నాదినము లలో బరమ జ్ఞాని. ఆతడు వైదిక కర్మకాండ యందును, మోక్ష ప్రదమగు జ్ఞానకాండయందును రెంటను నిష్ణాతుడు. సర్వత్ర ఆతని జ్ఞాన, వైరాగ్య, సదాచార, త్యాగములనుగూర్చి ఖ్యాతి కలదు. జనకునిగూర్చి గొప్ప గొప్ప ప్రశంస యున్నది. ఆతడు యథార్థముగ బూర్ణ జ్ఞానియో లేక జ్ఞానమందు లోపములు కలవో తెలిసికొన వలయునని సులభ యనుకొనెను. ఈ జిజ్ఞాసతో నామె జనకుని రాజసభకు వచ్చెను. ఆమె భిక్షుక సన్న్యాసిని యయ్యెను నామె త్రిదండాది సన్న్యాస చిహ్నములను త్యజించి వచ్చెను. దైవికముగ నాసమయమున జనకమహారాజు ఛత్రచామరాది చిహ్నములను వీడి, సాధారణాసనమున సభా సదులతో గూర్చుండి మాట్లాడుకొను చుండెను. బ్రహ్మజ్ఞాన చర్చ జరుగుచుండెను. సరిగా నాసమయమునకు యోగినియగు సులభ అచ్చటకు వచ్చెను. ఆమె తన యథార్థరూపమును దాచుకొని, ఒక మిక్కిలి అంద కత్తెయై వచ్చెను. ఆమె ముఖమండలమున తేజముట్టిపడు చుండెను. ఆమెయొక్క అంగప్రత్యంగముల నుండి సౌందర్యము వెల్లి విరియుచుండెను. ఆమె శరీరము పుష్టముగను, సుకుమారముగను

నుండెను. చూచుటకామె స్వర్గ స్త్రీపలె నుండెను. రాజతేజస్వియు, యోగినియునగు నాస్త్రీకి విధ్యుక్తముగ స్వాగత సత్కారములను గావించెను. సుందరాసనమున గూర్చుండబెట్టి పూజించెను. ఫలమూలముల నర్పించి కుశలమడిగెను. రాజుచేసిన పూజలను గ్రహించి యోగిని రాజ సమ్ముఖమున గూర్చుండెను. ఆమె రాజును బరీక్షించుటకు వచ్చెను. ఆమె సందేహమేమనగా జనకునకు సర్వత్ర వ్యాపించిన ఖ్యాతి ననుసరించి నట్టి త్యాగము, జీవన్ముక్తస్థితి ఉన్నదా లేదా యనియే. అందువలన నామె తన బుద్ధి సత్యముచే రాజుయొక్క బుద్ధి సత్యములో బ్రవేశించెను. ఆమె తన నేత్రములతో గలిపి తాత్రిటక విధిచే రాజుపై దన ప్రభావమును జూపింప దలచెను. తనమీద నెవరి ప్రభావమును బడజాలదని రాజునకు విశ్వాసముకలదు, అందువలన నాతడేమియును నడ్డగింపక మెదలగ అట్లే కూర్చుండెను. ఆతడు కార్యములకు విక్షేపమును గలిగింపలేదు. ఆమె బుద్ధిద్వారా రాజు శరీరమందు ప్రవేశింపగనే ధర్మధ్వజుడిట్లడిగెను:- "దేవీ! నీవీ వేషము నేల ధరించితివి? నీవీ వేషమును ధరించుట కధికార మెవరివలన వచ్చినది?"

యోగినియగు సులభ యిట్లనెను:- "రాజా! అందరునేదో ఒక వేషమును వేసికొనియే యున్నారు. కొందరు రాజు వేషమును వేసికొనినారు, కొందరు సాధువేషమును వేసి కొన్నారు. కొందరు తమ వేషముచే బరమ హాసలుగ గనబడుదురు. వేషములేని వ్యక్తియేలేడు. అట్లే నేను నొకా నొక వేషమును ధరించితిని. ఇందాశ్చర్య పడవలసిన దేమున్నది,?"

అంత రాజిట్లనెను:- "ప్రతివారికి నేదో ఒక వేషముండుట నిజమే. ఈ నీవేషము మాత్రము యథార్థమైనది. కాదన నానమ్మిక. నేవు మారువేషమున నాకడకు వచ్చితివి. రాజు సమీపమునకును, స్త్రీల సమీపమునకును వేషమును మార్చుకొని వెళ్ళుట బుద్ధిమంతుల లక్షణము కాదు. అట్లొనర్చుటచే ననర్థము కలుగును. నీవు వేషమును మార్చుకొని నా కడకు వచ్చితివి. నీవు నీయొక్క యథార్థ విషయమును జెప్పుము. నీ వెవరు? నీ తండ్రి పేరేమి ? నీకు వివాహమైనదా? లేదా ? ఒకవేళ అయినచో నీ భర్త పేరేమి ? ఈ సమయమున నీ వెచ్చటనుండి వచ్చు చున్నావు ? ఇచ్చటికి వచ్చుటలో నీ యభిప్రాయమేమి? నీవిచ్చటి నుండి యెచ్చటికి బోయెదవు ?

అంత సులభ యిట్లనెను : రాజా! వేషము యథార్థమైనది కాదు. అది ప్రతి క్షణమును మారుచునే యుండును. పరమాత్మ తప్ప మారని వేష మెచ్చట నున్నదో నాకు జెప్పుము, యదార్థ మగు వేషమేమియును లేకున్నచో నన్నియును గృత్రిమములే, పరివర్తన శీలములే. అట్టియెడ నా వేషము కృత్రిమమని యేల చెప్పెదవు ? నీ వెవరరు ? ఎచ్చటినుండి వచ్చితివని నీ వడుగు చున్నావు. ఈ ప్రశ్నలు స్నేహ సంబంధమున జరుగును. ఫలాని వాడు వీడు. ఫలాని వాడు వాడు, నేనిది, నీవెవరు? అను దానిలో నా దృష్టియందందరు నొక్కటే. ఒకే మూలమునుండి అందరి యుత్పత్తియైనది. నేను ఫలాని అని నేనెట్లు చెప్పగలను? బిందువు బిందువును గలిసి జలరాశి యైనది. అవి యెట్లు కలిసి

యున్నవో అట్లే సమస్త ప్రాణులును బరస్పరము ఒకే రాశిగా గలిసియే యున్నారు. చూచుటకు పృథివ్యప్తేజో వాయురాకాశ ములు భిన్న భిన్నములుగ నున్నవి. వీని గుణములగు శబ్ద స్పర్శ రూప రస గంధములును భిన్న భిన్నములుగ నున్నవి; కాని యివి పరస్పరము కలిసియే యున్నవి. పృథివియందు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు కలవు. ఒక భూత మింకొక భూతముతో గలిసి యున్నది. కావున వీని వలన నీ వెవరవని ప్రశ్నింప వీలులేదు. జలములో ధూళియయును గలదు, తేజమును గలదు, శబ్దమును గలదు. కాని జలము తాను జలమేనని చెప్ప కొనజాలదు. వీనిని వదలివేయుడు. నేత్రేంద్రియము సమస్త రూపములను గూర్చి చెప్పును. కాని అది తన్ను గూర్చి చెప్ప కొనజాలదు. పంచభూతములు, వాని తన్మాత్రలు, దశేంద్రియ ములు, బుద్ధి, చిత్తము, అహంకారము ఇవన్నియును ప్రకృతిచే నుత్పన్నమైనవే నీవెవరో నేనదియే. అట్టియెడ నేవెవరను నీప్రశ్న యెట్లుకుదురగలదు. ఇక మారువేషమును గూర్చి విచారింతము. నేను నావేషమును మార్చితిననియు, రూపపరివర్తనము కావించితి ననియు నీవంటివి. రూపమొక్క విధముగ నెవరికుండునో నీవే ఆలోచించుము. ప్రతిక్షణము సమస్త రూపములు మారుచునే యుండును.

స్త్రీ రజస్సును, బురుషుని వీర్యమును రెండును గలిసి రెండును దమ తమ రూపములను మార్చుకొన్నవి. తక్షణమవి కలిసి కలలమగును. కలలముమారి బుద్బుదమగును. బుద్బుదమువలన ఫెన

మగును. ఫేనమువలన మాంసపిండమగును. మాంసపిండము నుండి అంగ ప్రత్యంగము లేర్పడును. ఇంద్రియ గోళకములు, సప్తధాతువులు, నఖ. రోమాదులివి యన్నియును మారుచునే యుండును. బుద్బుదముగ నున్నది, బిడ్డయైనది. బిడ్డ తొమ్మిది నెలలు తరువాత నుదరమునుండి యుత్పన్నమై స్త్రీ, పురుష సంజ్ఞను జెందును. బిడ్డయనబడును. వాని చర్మమెంతో కోమలముగ నుండును. అంగ ప్రత్యంగములెంతో సుకుమారముగ నుండును. ప్రతి క్షణమును మారుచుండును; అంగములకు గాఠిన్యత ప్రాప్తించును. రూప పరివర్తనము కలుగుచుండును. వెంట్రుకలు మొలుచును. శరీరము ముడుతలు పడును. తల నెరయును. బాల్య, కౌమార, పౌగండ, కైశోర, యౌవన వృద్ధావస్థలు కలుగును. ఒక యవస్థ నుండి యింకొక యవస్థకుబోవునపుడు రంగు రూపము, ఆకృతి, ప్రకృతి ఇవన్నియును మారుచునే యుండును. ప్రతి దినముకాదు, ప్రతి క్షణమును మారుచునే యుండును. అయితే ప్రాణులు దీనిని దెలిసికొనజాలనంత సూక్ష్మముగ మారుచుండును. దేని యుత్పత్తి యెవరివలన గలిగినదో యెవరు చెప్పగలరు? జలములో ఫలాని సుడి యెవరివలన జరిగినదో యెవరు చెప్పగలరు? అందర శరీరములోను బృధివికలదు. అన్నిటియందును జలము, తేజము, వాయువు, ఆకాశము, ఇంద్రియములు, మనస్సు మొదలగు నన్నియు నొకేరీతిగా నుండును. ఎవరెవరివలన నుత్పన్నమైనారో నిర్ణయించుటెట్లు? నీ శరీరమెట్లున్నదో, యితరుల శరీరము నట్లేయున్నది. నీ శరీరములో నాత్మయెట్లున్నదో, అట్లే

యితరుల శరీరములందునుగలదు. అట్టియెడ నీ వెవరు? నేనెవరను ప్రశ్న యెట్లుత్పన్నము కాగలదు?"

అంత జనక మహారాజిట్లనెను:-"దేవీ! నీవు నాశరీరములో నేల ప్రవేశించితివి?"

సులభ యిట్లనెను-"నీవు జ్ఞానివోకాదో యథార్థవిషయమును గనుగొనుటకై నీశరీరమందు ప్రవేశించితిని. రాజ్యమును జేము చున్నను నందరు నిన్నేల జ్ఞాని యనుచున్నారో కనుగొనదలచితిని."

అంత మహారాజిట్లనెను:-"దేవీ! నీకు నీయోగమునుగూర్చిన గర్వముకలదు. కావున నీవు గర్వముచేతను జంచలత్వము చేతను నిట్టి యనుచిత కార్యము నొనర్చుచున్నావు."

సులభ యిట్లనెను:-"నీకేకార్య మనుచితముగ దోచినది?"

రాజిట్లనెను:-"నీవు స్త్రీవయ్యునాశరీరములో ప్రవేశించు టొక అనుచితకార్యము."

సులభ యిట్లనెను:-ఇందులో ననుచితమేమున్నది?"

రాజిట్లనెను:-"దీనిలో నన్నియు ననుచితములే. ఒకటి కాదు. ఇందనేక దోషములు వచ్చిపడినవి. స్త్రీలు స్వతంత్రులైన జెడిపోవుదురను లోకోక్తి సత్యము. నీవు స్త్రీ సులభ చంచలతా కారణమున నీకార్యము నొనర్చితివి. నేను జ్ఞానినో, అజ్ఞానినో, ముక్తుడనో, దీనివలన నీకేమి ప్రయోజనము? నీ వీకార్యమును బోకిరి

తనముచే నొనర్చితివి. పైగా నీవు సన్యాసినివిగను, భిక్షుకిగను, యోగినివిగను జెప్పుకొనుచున్నావు. సన్న్యాసికి స్త్రీస్పర్శ మహా పాపము, అదేవిధముగ సన్న్యాసినియగు స్త్రీ పురుషని స్పర్శించుట పాపము. నీవు నాశరీరమున బ్రవేశించి సన్న్యాసి ధర్మమును దూషితము కావించితివి. దీనినిబట్టి నీవు పేరునకే సన్న్యాసివని ఋజువగుచున్నది. నీకింకను బురుషని స్పర్శింపవలయునను కోరిక యథాప్రకారముగనే యున్నది. మనస్సులో గామభావము కలవారు సన్న్యాసులమని చెప్పుకొనుట కధికారములేదు. నీవాశ్రమ ధర్మమును సాంకర్యము కావించుటొకటి. రెండవది నీవు బ్రాహ్మణస్త్రీవి. నేను క్షత్రియుడను. బ్రాహ్మణస్త్రీవయ్యు క్షత్రియ శరీరములో బ్రవేశించి నీవువర్ణ ధర్మమునకు లోపము కావించితివి. మూడవది నీవు మోక్షధర్మ పరాయణయు త్యాగధర్మావలంబినివగు భిక్షుకవు. నేను సంగ్రహ ధర్మముగల గృహస్థుడను. నీవు త్యాగ ధర్మమునుగూడ దూషితము కావించితివి. నీవు బ్రాహ్మణివో, క్షత్రియవో నాకు తెలియదు. ఒకవేళ క్షత్రియవేయైనను నా గోత్ర మునకు సంబంధించిన దానవైనచో గోత్రసాంకర్యదోషము సంభ వించునుగదా! నీవవివాహిత కన్యకవగుచో గన్యక పరపురుషుని శరీరమున బ్రవేశించుట మహాపాపము. నీవు వివాహితవైనచో నీపతివేరుగా నున్నాడుకదా! నేను బరపురుషుడను. సతులగు స్త్రీలకు బరపురుషునితో సంబంధము కలిగియుండుట మహాపాపము. నీవు నీయుత్కృష్టతను జూపుటకు నాశరీరమందు బ్రవేశించితివా యిది నీయొక్క అతిపోకిరితనము కాగలదు. స్త్రీలకు బోకిరితనము

గొప్ప యవగుణము. కావున సమస్త దృష్టులచేతను నీవ్యవహారమను చితమైనది; గర్హ్యమైనది, దోషయుక్తమైనది, నీవు నాయిచ్ఛకు వ్యతిరేకముగా నాకుజెప్పకయే నాబుద్ధిలో బ్రవేశించితివి. ఈ సంగమ మేకాంగిగానున్నది. అంగీకారమున నుభయపక్షముల సంతోషముకొరకు జరుగుసంగమము సుఖకరముగనుండును. ఏకాంగి సంగమము దుఃఖకరమైనది. కావున నీవు విషవమనకార్య మొనర్చినావు. నీవు విజయేచ్ఛచే నన్నోడించుటకై యిట్టికార్య మొనర్చి యుండినచో నదియుననుచితమైనదే. సన్న్యాస ధర్మము ననుసరించువారు వాదవివాదములకును, జయప రాజయములకును దూరముగ నుండ వలయును. నీవ్యవహారమంతయును లోక వేదముల దృష్టిచేనిందనీయమైనది."

ఇది విని సులభ కిలకిలనవ్వి యిట్లనెను:-"ఓయీ! జనకా! నేను నీద్వైతభావము నశించినదనుకొన్నాను. బ్రహ్మజ్ఞాని వను కొంటిని, కాని నీవిషయములన్నియును నజ్ఞానులకువలె నున్నవి. ఆత్మయందు స్వగత, విగత, స్వజాతి, విజాతి, స్త్రీ పురుష భేదము లేదు. నీవు నీజ్ఞానము వాసనారహితమైనదను చున్నావు; కాని నీమనస్సునందు బ్రత్యక్షముగ వాసన లున్నవి. నేను బుద్ధితత్వ మున నీ శరీరమందు బ్రవేశించినను నీటిలోని తామరాకువలె నేను నాయంగములతో నీయంగములను స్పర్శింపలేదు. నీవు జీవన్ముక్తుడవని చెప్పుకొనుచున్నావు. మనస్సుతో సంగమ భావనకలిగి యుండుటచే నీవు స్వధర్మచ్యుతుడవైతివి. వీడుగృహస్థుడు, వీడు త్యాగియను మిథ్యాభిమానమింకను నిన్ను వదలలేదు. జీవి మోక్ష

ముతో సమాగమ మొనర్పవలయును. ఇందులో సాంకర్యమేమున్నది? మనస్సులో భేదము కలిగినవానికి ద్వైతము గోచరించును. సర్వత్ర ఒకేఆత్మయున్నచో దానిలో సంకరతకవకాశమేలేదు. అట్లే చూడుడు. సన్న్యాసి ధర్మమేకాంతముగ నుండుటయే యనినచో నేను నీబుద్ధి నేకాంతముగభావనచేసి దానిలో సుఖముగ నుంటిని. లౌకిక దృష్టిచేతను సాంకర్యములేదు. నీవునుక్షత్రియుడవే. నేనును క్షత్రియ కన్యకనే. నా నీగోత్రము లొక్కటికావు. నేను నీకంటె హీనజాతి దాననుగాను."

రాజిట్లడిగెను:-"దేవీ! నీవే క్షత్రియుని పుత్రికవు?"

సులభ యిట్లనెను: "రాజా! నీవు ప్రధాను డను రాజర్షి నామమును వినియే యుందువు. ఆతడు గొప్ప యశస్వి, పుణ్యశ్లోకుడు. ఆతడు గొప్ప గొప్ప యజ్ఞయాగాదు లొనర్చెను. నే నాతని ప్రియ పుత్రికను. బాల్య కాలమునుండియును నా కధ్యాత్మ మునిన రుచి. నేను సమస్త శాస్త్రములను విద్యుక్తముగ గురు ముఖమున నధ్యయనమును గావించితిని. నేను వివాహయోగ్యను కాగానే చాలామంది రాకుమారులు నన్ను వివాహమాడుటకు వచ్చిరి. కాని వారిలో నాకనురూపు డొక్కడును లేడు. యోగ్యుడగు వరుడు లభింపకపోగా నేను గురుముఖమున మోక్షధర్మోపదేశమును గ్రహించితిని. నేను భిక్షుకను, సన్న్యాసినినైతిని. నేను సన్న్యాస ధర్మమును విద్యుక్తముగ నడుపుచున్నాను. ఏకాంతమున నుందును. నేను విచారింపక ఏ కార్యము

నొనర్పను. నీవు మోక్ష ధర్మావలంబివని నేను నిన్ను గూర్చిన ప్రశంసను వినియుంటిని. అందువలన నేను సత్సంగము కొరకిచ్చుటకి వచ్చితిని. నా మనస్సులో నే విధమగు కోరికయును లేదు. నేను బ్రహ్మచారిణిని. నేను నా ప్రతిజ్ఞనుండి యెన్నటికిని జ్యుతను గాను. నేను కేవలము నీ జ్ఞానముయొక్క శ్రోతుపాతులను గనుగొన వచ్చితిని."

రాజిట్లనెను: "దేవీ! అయినప్పటికిని నీ చంచలత్వమే యిందిమిడి యున్నది. నేను జ్ఞానినైన నేమి అజ్ఞానినైన నీ కేమి? నేను జ్ఞానినైన విషయమున సందేహమేల జనించినది? తలను బోడి చేసుకొని సన్న్యాసి అయితేనే జ్ఞానియా? ఇంటిలో నుండి జ్ఞాని కాగూడదా? నేను గురు పరంపరగ జ్ఞానినైతిని. నా గురువు సామాన్యుడు కాడు. ఆతడు ప్రపంచములో విఖ్యాతిని జెందినవాడు. ఆయన పంచశిఖ మహాముని. ఆతడు లోక కళ్యాణార్థము తప్పు త్రోవను నడుచు ప్రాణులకు సత్పథమును జూపించుటకై నిరంతరము భ్రమించుచుండును. గడచిన వర్షమీ నా పురియందే ఆతడు చాతుర్మాస్య లొనర్చినాడు. ఆతడు సాంఖ్య శాస్త్రమున బూర్ణ పండితుడు. యోగశాస్త్ర పారంగతుడు. ఆతడు నాకు సాంఖ్య శాస్త్రమును, యోగ విధిని, కర్మకాండయందును శిక్షణ మొసంగినాడు. నేనును నాతని కృపచే నందు నిష్ణాతుడ నయితిని. ఆతడు నన్ను సన్న్యాసి నొనర్పలేదు. గృహస్థ ధర్మమందున్నను నన్ను బూర్ణ జ్ఞానిగ నొనర్చియున్నాడు. ఆ గురుదేవుని కృప చేతనే నా సంశయము లన్నియును బటాపంచ లయినవి. నా

హృదయ గ్రంధి విడినది. నేను పూర్ణ జ్ఞానినైతిని. నేను రాజ్య కార్యము లొనర్చుచున్నను వాని యందు నిర్లిప్తుడనై యున్నాను. మోక్ష సాధనములు జ్ఞాన వైరాగ్యములే. నాకు పూర్ణ జ్ఞానము లభించినది. జ్ఞాని త్యాగి వేషమును వైరాగ్య వేషమును వేయవల సిన పనిలేదు. ఆతడు వేషమును వేసికొనకయే సమస్త స్థితులం దును మగ్నుడై యుండును. ముఖ్యముగా గావలసింది అంతఃకరణ శుద్ధి. గృహస్థుడై యున్నను సదాచారముగ నుండి, యమ నియమ ములను బాలించుచుండిన నాతడింటిలో నున్నను సన్న్యాసియే. దీనికి విపరీతముగ నియమములను బాలింపక సన్న్యాసి వేషమును ధరించియును. కామ, క్రోధ, లోభ, మోహ, ద్వేష, ధనాదులం దాసక్తి నుంచి యీ వస్తువులను సంగ్రహించినచో నాతడు సన్న్యాసియైనను గృహస్తుతో సమానుడే. యోగినీః కేవల మకర్మ ణ్యుడగుట చేతను, అగ్నిని దాకక పోవుటచేతను, కాషాయ వస్త్ర త్రిదండాదులను ధరించుటచేతనే యెవడును సన్న్యాసి కాజాలడు. సాంసారిక విషయములందు వైరాగ్యము కలుగునంత వరకు జ్ఞాన ముండజాలదు. జ్ఞానము లేక మోక్షము లేదు. మానవుడు మృత్యు భయము చేతనే అటు నిటు దిరుగుచుండును. జ్ఞానముండిన గాని మృత్యు భయము పోజాలదు. జ్ఞానము కలుగగానే జీవుడు నిర్ద్వందుడగును. అట్టి వాడు జనన మరణ చక్రమునుండి బయటబడును.

బంధనమునకు గారణము పూర్వ జన్మకృత పుణ్య పాప ములే. కారణ రూపమున బ్రాణులకు శరీరమందు బుణ్య పాపము

లుండును. తడిసి పదునైన పొలమున బడిన బీజము లంకురించి అవియే వృక్షములైనట్లు వాసనామయ బీజములు శరీరమును బొంది జనన మరణ రూపమగు సంసారములో బడి సుఖ దుఃఖ ముల ననుభవించు చుండును. కర్మ వాసన లున్నంతవరకు మాటి మాటికిని జనన మరణములు కలుగుచునే యుండును. వాసనా రూపములగు బీజములను జ్ఞానరూపమగు నగ్ని యందు వేయించినచో నింక నవి యంకురింపవు. నేను గురు ప్రసాదముచే వాసనలను వేయించి వేసినాను. నాకీ సాంసారిక విషయములం దాసక్తి లేదు. అనిత్యములును, నాశవంతములు నగు విషయములు నన్ను దమ వైపున కాకర్షింపజాలవు. నాకు రాజ్య భవనములందు సుఖము లేదు, దుఃఖమును లేదు. ధారా పుత్రులందు రాగము లేదు. ద్వేషమును లేదు. నాకు శత్రువును లేదు, మిత్రుడునులేదు. నేను దాసీనునివలె వ్యవహరించెదను. నా కొక చేతి కగ్నిని, రెండవ చేతికి గోమలాంగియగు స్త్రీ హస్తము నొసంగినను నాకు రెండును సమానములే. జ్ఞానము కలిగిన తరువాత త్రిదండమును ధరించినను, రాజ్య మొనర్చినను, నౌకరి నొనర్చినను నన్నియును సమానములే. జ్ఞాని కాకున్నచో శరీరమంతయును గాషాయ మయము నొనర్చినను, వందల కొలది త్రిదండ కమండలువులను ధరించినను నేమియును లాభము లేదు.

దండ ధారణముచేతనే నరుడు నారాయణుడగునని కొందరు చెప్పుదురు. ఇది కేవలము దండప్రశంస మాత్రమే. ముఖ్య జ్ఞానము కాదు. జ్ఞానము కలిగిన తరువాత త్రిదండమును, ఛత్ర

దండమును సమానములే. అన్నింటిని ద్యజించి కేవలము కౌపీన మాత్ర ధారణము చేతనే మోక్షము కలుగుననుట అబద్ధము. త్యాగ సంబంధము వస్తువులతో గాదు. మనస్సు తోడనే. మానసికముగ ద్యాగ మొనర్చినవాడు రాజులవలె ఛత్ర చామరములను ధరించి నను ద్యాగి యగును. మానసికముగ ద్యాగ మొనర్పకున్నచో నాతడు కౌపీనమ్మును ధరించియును త్యాగి కాజాలడు. మానవున కేది లభించిన దానిని సంగ్రహింప వలయుననుట తప్పు. సర్పము, వృశ్చికము, సింహ వ్యాఘ్రములు ఇవేమి సంగ్రహము కావించు చున్నవి. కొందరు సర్పముల నాడించి పొట్ట బోసికొనువారికి పాముచేతనే పని జరిగిపోవును. వారు సర్పములను బ్రోవు చేయు దురు. మనము పారవేయు చింపిరి పేలికలను కాగితములను దయారు చేయుటకు సంగ్రహించు చుందురు. ఏలననగా వానివలన వారికి పని జరుగును. రాజు ఛత్ర చామర, గజతురగ, సేనా, కోశ, మంత్రి, భవన, సేవకాది వస్తువులను సంగ్రహించుచుం డును. సన్న్యాసి దండ, కమండలు, కంథా, కౌపీనాదులను సంగ్రహించు చుండును. సంగ్రహ మనునది రెంటికి సమానమే. ఆసక్తి యనునది యుండినచో సాధువునకును గమండలువు మీద నాసక్తి యుండును. దానితో నానావిధములగు పనులుండును. నిత్యమును దానిని నునుపు చేయుచుండును. దానిని గనిపెట్టుకొని యుండును. ఎవరును దొంగిలింపకుండ చూచుచుండును. ఎక్కడ నైన నగ్ని ముట్టుకొనిన దండ కమండలువులు తగులబడి పోవు నన్న చింత కలుగును. దీనికి విపరీతముగ వస్తువులను సంగ్ర

హించినను నాకీ వస్తువుల మీద నాసక్తి యుండదు. మిథిలాపురి యంతయును దగులబడినను నాకే మాత్రమును దుఃఖములేదు.

కాషాయ వస్త్రముచేతను, తలలను బోడులను జేసికొనుటచే తను దుఃఖము తొలగుచో జాలమంది కాషాయములను ధరించినను దుఃఖులుగ గనబడుచున్నారు. గొఱ్ఱెకు గూడ తలను గొరుగుదురు. డబ్బు కూడబెట్టకుండుటచేతనే దుఃఖనివృత్తియగుచో బశుపక్ష్యాదులు డబ్బును గూడ పెట్టవు. అవి రేపటికుంచుకొనవు. ఇవన్నియును ముక్తి చెందవలయును. బాహ్యత్యాగమునకును, బాహ్యసంగ్రహమునకును జ్ఞానముతో నేసంబంధమును లేదు. అకించన వేషమును ధరించినను బంధనము కలుగవచ్చును. ధనాదికములను సంగ్రహించినను నాతడు జీవన్ముక్తుడు కావచ్చును."

జనకుడిట్లనెను:- "సులభా! నీవు చదివిన దానవుగా గనబడుచున్నావు. నీ ఓజ, తేజః ప్రభావముచే నేను ప్రభావితుడనైనాను. నాకు నీపైన శ్రద్ధకలిగినది. కాని రూపము నీకనురూపముగ లేదు. నీవు సుందరివి, సుకుమారివి, యువతివి. నీతో శిష్టతావ్యవహార మొనర్పవలయును. ఇట్టి నీ ప్రభావమును ప్రదర్శించుటకై యెవరి శరీరమందును ప్రవేశింపబని లేదు."

ఇది విని సులభ యిట్లనెను:- "రాజా! నీవు చెప్పునది సత్యమే. అయినను జ్ఞానికి వేషబంధనము కారణముకాదు. ఆతడెట్టి వేషమునైనను వేయవచ్చును. బాహ్యత్యాగ సంగ్రహములు జ్ఞానమునకు గారణములు కావని నీవిప్పుడే యంటివి. అయినను నీవు మాటి మాటికిని నీపక్షమునకు బుష్టినొనర్చు కొనుచున్నావు.

రాజా! నేనేమియు నాలోచింపక నీకడకు రాలేదు. నేను ముముక్షువుల నన్వేషించు చున్నాను. నీవు జ్ఞానివనియును, బ్రహ్మవేత్తవనియును వినగానే కేవలము నీయొక్క మేలుకొరకు నీమోక్షజ్ఞానము నెరుగుటకై యిచ్చటికి వచ్చితిని. నేను వాదవివాదములకు సదా దూరముగ నుందును. మల్లుడు రెండవ మల్లుని జయించుటకై పరస్పరము శరీరబలమున బోరాడునట్లు జ్ఞానులకును వాదనివాదములు కలుగవు. స్వపక్షమండన మొనర్చుటకై మనస్సునకు వచ్చినట్లు తలయును దోకయును లేని మాటలను మాటలాడుచు వితండ వాదమొనర్చువారు యథార్థజ్ఞానులుకారు. శబ్దములమీదనే పోరాడువారికి, నెరసులెన్నునట్టి శాబ్దిక జ్ఞానులకు బరమార్థము చాల దూరముగనుండును.

జ్ఞాని వాద వివాదములను వదలుకొని మౌనధారణ మొనర్చును. ఆతడు నిజానందమగ్నుడై యుండును. ఆతనికి జయపరాజయములతో నేమిపని? నేను నీజ్ఞానముయొక్క లోతును గనుగొంటిని. సన్న్యాసి యేదైన నగరమునకు బోయినచో నచ్చట శూన్యగృహమందు నిర్జనస్థానమందొక రాత్రి నివసించును. మరునాడింకొక చోటునకు పోవును. అదేవిధముగ నేను నీ శరీరరూపమగు గృహమునందీ రాత్రి యుండి వెడలిపోయెదను. రాజా! అదృష్టమేమనగా మీరు రాజభవనమునందున్నను సాంసారిక భోగవిరక్తులు. ప్రపంచ మందుండియును నిష్ప్రపంచలు. ఇది నీ వంశమున కనురూపముగనే యున్నది. మీ పూర్వజులందరును విదేహులగు జ్ఞానులును, జీవన్ముక్తులునై యున్నారు. నీవును వారివలెనే

నున్నావు. నీవు నన్నాదరించి సత్కరించితివి. ఇంతసేపు సత్సంగ మొనర్చితివి. దీనికి నేను చాల సంతోషించితిని. నీకు మేలగు గాక! ఇక నేను వెడలిపోయెదను."

సూతుడిట్లనెను:- "మునులారా సులభ వాక్కులను విని ధర్మధ్వజుడామె నభినందించెను. ఈ విధముగ రాజుచే సత్కృతయై ఒక రాత్రి అచ్చట నివాసమొనర్చి సులభ యథేష్టముగ దనస్థానమునకుబోయెను. నేను ప్రసంగవశమున సులభా జనక సంవాదమును జెప్పితిని. ఇప్పుడిక మీరు ధర్మధ్వజుని తరువాత వచ్చిన జనక వంశ రాజుల వంశవర్ణనమును వినుడు,"

## కేశిధ్వజుడును, ఖాండిక్యుడును

శ్లో॥ కృతధ్వజాత్ కేశిధ్వజః ఖాండిక్యస్తు మితధ్వజాత్।
కృతధ్వజ సుతో రాజన్నాత్మవిద్యా విశారదః॥

శ్రీ భాగ. ౯ స్కం. ౧౩ అ. ౨౦ శ్లో॥

గుణగ్రాహకత్వమందరలో నుండదు. ఎవరికి గుణ గ్రహణ ప్రవృత్తి యుండునో ఆతడెన్నటికిని ప్రపంచమున నెవరిని ద్వేషింపడు. మనమేల ద్వేషించుచుందుము? అజ్ఞానవశమున నసద్వస్తువుగ భావించి మిథ్యాభి నివేశమొనర్చినచో గొందరను శత్రువులుగను గొందరను మిత్రులుగను భావించుచుందుము. మన మనస్సులో నెవరి యెడల శత్రుత్వము కలుగునో వాని గుణములును దోషములుగ గనబడుచుండును. ద్వేషవశమున మనము

వాని శుభ కర్మలందును గలియము. మనకెంతటిహాని సంభవించి నను వాని సమీపమునకుబోము. కాని గుణగ్రాహియైన వాడెవరి యెడలను శత్రుత్వమును వహింపడు. పైగా గర్తవ్య వశమున నెవరితోనైనను శత్రుత్వము కలిగినచో వాని మనస్సునందే భావ మునుండదు. అవసరము వచ్చినప్పుడాతడు శత్రుత్వమును మరచి పోవును. మూర్ఖుల శత్రుత్వము రాతిమీద గీతవలె నెన్నటికిని మాయనిదిగ నుండును. కాని జ్ఞానులయొక్క శత్రుత్వము సైకత మందలి గీతవలె నుండును. కొంచెము గాలివీచెనా మరల నదిచెరిగి యథాప్రకారమగును. ప్రపంచములో నుండినవారు జ్ఞానులు కానింతు, అజ్ఞానులు కానిండు, మిత్రత్వ శత్రుత్వములు సాధారణ ముగా సంసర్గులతో గలుగుచునే యుండును: కాని జ్ఞాని హృదయ మున దీని ప్రభావమేమియునుబడదు. అజ్ఞాని రాగద్వేషములవలన దుఃఖియగుచుండును. జ్ఞానియొక్కయు నజ్ఞానియొక్కయు వ్యవ హారమందంతరము కలదు.

సూతుడిట్లనెను:—"మునులారా! నేను మీకు జనక వంశ ములోని ధర్మధ్వజునకును యోగినియగు సులభకును జరిగిన సంవాదమును సంక్షిప్తముగ జెప్పితిని. ఇప్పుడు మీరు ధర్మధ్వ జుని తరువాత జనక వంశీయులగు మైధిల రాజుల వంశవర్ణన మును వినుడు."

ధర్మధ్వజ జనకునకిద్దరు పుత్రులుకలరు. కృతధ్వజ జనకుడును, మితధ్వజ జనకుడును. కృతధ్వజునిపుత్రుడు కేశిధ్వజ

జనకుడు. మితధ్వజ జనకుని పుత్రుడు ఖాండిక్యజనకుడు. ఈ యన్నదమ్ము లిద్దరకును జరిగిన నాధ్యాత్మిక సంబధమైన మంచి గొప్ప సంవాదముకలదు. దానిలో బరమార్థనిరూపణము మిక్కిలి సరళముగచేయబడినది.

ఇది విని శౌనకుడిట్లనెను:-"సూతా! మాకు కేశిధ్వజ జనకునకును, రాజర్షియగు ఖాండిక్య జనకునకును జరిగిన సుఖద సంవాదమును దప్పక జెప్పక జెప్పవలయును. దానిని వినుటకు మాకు గొప్పకోరికకలదు. ఇది అధ్యాత్మిక సంబంధమగు చర్చ. గొప్ప నిగూఢమైనది. కాని యీ జనక వంశరాజుల చరిత్రములు గూఢజ్ఞానముతో నోతప్రోతమై యున్నవి. వీనిలో నాధ్యాత్మ్యము నకు సంబంధించిన నీరస విషయముగూడ మిక్కిలి సరళముగను జెప్పబడినది."

ఇది విని సూతుడిట్లనెను:- "మునులారా! నేనిచ్చట నధ్యాత్మ్య చర్చను జేయుటలేదు. ఇచ్చట నేను సరళ సరళ శిక్షా ప్రదములగు కథలను బ్రసిద్ధ పురుషుల ఆఖ్యానములను జెప్పు చున్నాను. కావున నీవిషయమును విస్తరింపక నేను బ్రసంగవశ మున సంవాదమును సంక్షేపముగ జెప్పెదను. కేశిధ్వజ, ఖాండిక్య సంవాదము మిక్కిలి శిక్షాప్రదమైనదియును, రోచకమైనదియును, ఆధ్యాత్మిక భావములతో నిండినదై యున్నది. మంచిది, వినుడు. నేనీపుణ్య ప్రసంగమును జెప్పెదను."

కృతధ్వజుని పుత్రుడు కేశిధ్వజుడు. ఈతడు పరమ జ్ఞానులు, ఋషులు, మునులు వీరిని బరమార్థ సంబంధమగు

ప్రశ్నలడుగుటకు వచ్చుచుందురు. అనేక శంకలడుగుచుందురు. వాని కన్నిటికిని యథోచితమగు ప్రత్యుత్తరముల నొసంగుచు సమస్త శంకలకును సమాధానము లొసంగుచుండును. ఈతని పినతండ్రియగు మితధ్వజుని పుత్రుడు ఖాండిక్యుడును జ్ఞానియే. కాని ఆతడు కర్మకాండను బాగుగా నెరిగినవాడు. కర్మకాండ విషయమున నాతనికి సర్వత్ర ఖ్యాతికలదు. కర్మకాండ విషయమున నెంతటి గొప్ప సందేహములు కలిగినను నాతడు సమాధానము నొసంగెడువాడు. ఈతనికి కేశిధ్వజుని రాజ్యము కాక వేరు రాజ్యముకలదు. అచ్చట నాతడు సుఖముగ నుండి యజ్ఞము లొనర్చుచుండును.

క్షత్రియ ధర్మమందు తండ్రికిని బిడ్డకును, అన్నదమ్ములకును, సంబంధులకును బోరువచ్చుచుండును. ఏక్షత్రియుడైనను నస్త్ర శస్త్రములనుగైకొని యుద్ధమునకు బిలిచిన యెడల నాత్మాభిమానియగు క్షత్రియ కుమారుడు యుద్ధ పరాఙ్ముఖుడుకాడు. ఆతడు యుద్ధము నభినందించి ప్రాణములను బణముగనొడ్డి సమర భూమికి దుముకును. అదేవిధముగ నేదియో కారణమున గేశిధ్వజునకును ఖాండిక్యునకును యుద్ధము పొసగెను. ఇద్దరును శూర వీరులే. క్షత్రియ కుమారులే. పైగా నన్నదమ్ములు. చాల సేపటి వరకు యుద్ధము జరిగెను. చివరకు గేశిధ్వజునకు విజయము కలిగెను. ఖాండిక్యుడు పరాజితుడై తన మంత్రి పురోహితులతోడను కొందరు సేవకులతోడను వనమునకుబోయి, యచ్చట నాతడొక చిన్న కోటను నిర్మించుకొని, సమీపముననున్న గ్రామములపై నధి

కారమును స్థాపించుకొని చిన్న రాజ్యమును స్థాపించుకొని నివసించు చుండెను. ఇచ్చట కేశిధ్వజుడు ఖాండిక్యుని రాజ్యమందధికారమును స్థాపించుకొని సుఖముగ రాజ్యము నొనర్చుచుండెను.

జ్ఞానులును నాసక్తినిపీడి నిష్కామ భావముతో లోక సంగ్రహార్థమై యజ్ఞయాగాది పుణ్యకార్యము లొనర్చుచుందురు. యజ్ఞము లొనర్చకున్నచో గాలక్షేపము జరుగుటెట్లు? యజ్ఞ, దాన, తపములు మానవుని బావన మొనర్చును. వీని నెన్నడును బరిత్యజింపరాదు. ఈ భావముతో నాత్మ విద్యా విశారదుడగు గేశిధ్వజుడు సదా యజ్ఞయాగాది పుణ్యకార్యములందు మగ్నుడై యుండును.

ఒకసారి అతడొక గొప్ప యజ్ఞము నొనర్చెను. ఆయజ్ఞము నొనర్చుటకై కర్మకాండను దెలిసిన ఋషులును మునులును బిలువబడిరి. దైవవశముననే గోదుగ్ధములు యజ్ఞ కర్మలకు వినియోగింపబడు చుండినవో ఆయజ్ఞధేనువు నొకానొక సింహము విజన వనమందు రక్షకుల యొక్క యేమరపాటున జంపివైచెను. ఇది యజ్ఞమందు గొప్పవిఘ్నము. ఇప్పుడు యజ్ఞము నెట్లుచేయవలసి యుండును, దీనికేమి ప్రాయశ్చిత్తము నొనర్పవలసి యుండును. యజ్ఞమందు యజ్ఞ ధేనువునష్టమగుట గొప్పపాపము. యజ్ఞమునకు గొప్ప అంతరాయము. రాజుచాల చింతించి, తన ఋత్విజులను దీనికి బ్రాయశ్చిత్తమేమియని యడిగెను.

ఋత్విజులు సరళముగ నిష్కపట భావముతో నిట్లనిరి: "రాజా మేము దీనికి యథార్థమగు బ్రాయశ్చిత్తమును జెప్పజాలము.

ఇప్పుడు కశేరు మహర్షి కర్మకాండయందు ప్రసిద్ధుడు. విశేషించి ప్రాయశ్చిత్త విధానమందాతని కవ్యాహత గతికలదు. కావున నాతడు దానికి సమాధానము చెప్పగలడు. కావున నీవాతని శరణమునకుబోయినచో నాతడు దీనికి యథోచితమగు ప్రాయశ్చిత్తమును జెప్పగలడు."

ఇది వినగానే కేశిధ్వజునకు మిక్కిలి యానందము కలిగెను. ఆతడు ఋత్విజుల యభిప్రాయమునుగైకొని కశేరు మహర్షి సమీపమునకు ప్రాయశ్చిత్త మడుగబోయెను. ప్రణామాది శిష్టాచారములు నెరపిన మీదట రాజు వృత్తాంతమునంతను నెట్లు యజ్ఞధేనువును సింహము చంపినదియును, నేవిధముగ ఋత్విజుల నడుగగా జెప్పినదియు గశేరుని కడకెట్లు పంపినదియు నీ విషయము లన్నిటిని జెప్పి చివరకు ప్రాయశ్చిత్త మడిగెను.

అన్నిటిని విని కశేరు మహర్షి యిట్లనెను: "రాజా! ఈ విషయము చాల గూఢమయినది. యజ్ఞ ధేనువు వధింపబడినచో నీవు ప్రాయశ్చిత్తమును జేసికొని యీ దీక్ష తోడనే యజ్ఞమును జేయవచ్చునో లేక మరల దీక్షను గ్రహింపవలయునో నేను నిర్ణయించి చెప్పజాలక పోవుచున్నాను. ఒక్క పనిని జేయుడు. ఈ విషయమును పోయి భృగు వంశీయుడగు శునక మహర్షి నడుగుడు. శునక మహర్షికి ఈ విషయము నాకంటె బాగుగా దెలియును."

సూతుడిట్లనెను: "శౌనకా! మీ తండ్రియగు శునకమహర్షి కర్మకాండయందద్వితీయుడు. ఎచ్చటను నే శంకకును సమాధానము లభింపక పోయినచో నీ తండ్రి కడకు వెళ్ళుచుండెడువారు. కశేరు ముని వాక్యములను విని ఆతనికి బ్రణామమును గావించి రాజు తన తండ్రియగు శునకుని కడకు బోయెను.

భృగు వంశీయుడగు శునక మహర్షి రాజునకు సత్కారమును గావించి వచ్చిన కారణము నడిగెను. రాజు వినయమును బ్రదర్శించుచు జేతులను జోడించుకొని యిట్లనెను: "స్వామీ! నా యజ్ఞము యొక్క యజ్ఞ ధేనువును నొక సింహము వధించినది. దానికి బ్రాయశ్చిత్తమును మా ఋత్విజులు చెప్పజాలకున్నారు, కశేరు మహర్షి యథార్థపు ప్రాయశ్చిత్తమును జెప్పగలడని నన్నాతని కడకు బంపిరి. సత్యవాది యగు నా ఋషి కడకు బంపగా నాతడేమియును ఛల కపటము లేకయే యిట్లు చెప్పెను: "నాయనా! దీనికి యథార్థమగు బ్రాయశ్చిత్తమును నేను నెరుగను. శునకునికడకు బొమ్ము. ఆతడు నీకు శాస్త్రీయమగు బ్రాయశ్చిత్తమును జెప్పగలడు." అందువలన నేను శ్రీవారి చరణ సన్నిధికి వచ్చితిని.

ఇది విని సర్వజ్ఞుడగు శునకు డిట్లనెను: "రాజా! దీనికి బ్రాయశ్చిత్తమును నీ ఋత్విజులు నెరుగరు. కశేరు మునియు నెరుగడు. నాకును దెలియదు. ప్రపంచములో నొక్కనికే తెలియును. సంభవమయినచో నీ వాతని కడకు బొమ్ము. లేదా మానుము"

శీఘ్రముగ రాజట్లనెను : "స్వామీ! మీరు తప్ప సర్వజ్ఞుడయిన వాడీ లోకమున నింకెవడు కలడు? మీరు నాకు తప్పక ఆతని నామమును జెప్పినచో నే నవశ్య మాతని సేవింప బోయెదను."

అంత శునక మహర్షి యిట్లనెను : రాజా! ఈః విషయమును దెలిసినవాడు నీకు శత్రువైన ఖాండిక్య రాజర్షి. నీ వాతని నోడించితివి. నీవాతని కడకు బోయినను పోకున్నను నేను చెప్పవలసినది చెప్పితిని."

రాజు దృఢముగ నిట్లనెను : "స్వామీ! నేనవశ్య మాతని కడకుబోయెదను. యుద్ధాదులు క్షత్రియ ధర్మము. ఈ సమయమున నేను గురుభావముతో నాతనికడకు బోయెదను. ఆతడు నన్ను శత్రువుగా భావించి చంపినచో నాకు ప్రాయశ్చిత్తము స్వతః జరిగిపోవును. నేను యజ్ఞదీక్షితుడను, శస్త్రమును బట్టను. ఆతనిచేతిలో జచ్చనచో ప్రాయశ్చిత్తమును జరుగును. ఆతడు ధర్మమని భావించి నేనడిగిన దానికి యథాయోగ్యముగ ప్రాయశ్చిత్తమును జెప్పినచో నా యజ్ఞము విఫలముకాక సమాప్తమగును. నాకు రెండు విధములను ఫలమే. సోదరుడగు ఖాండిక్యునికడకు బోయిననే నాకు మేలు కలదు."

ఇది విని శునకుడిట్లనెను : "రాజా! నీవు రాజర్షియగు ఖాండిక్యునికడకు బోయినచో నీకు మేలుకలదు."

ఇది విని మునిచరణములకు బ్రిణామమును గావించి కేశిధ్వజ మహారాజు రథముపై నెక్కి ఖాండిక్యుని సమీపమునకు బోయెను. ఆతడు యజ్ఞదీక్షితుడగుటచే కృష్ణమృగ చర్మమును గప్పుకొనెను. చేతిలో జింకకొమ్మును, దర్భముడియు నుండెను. ఆతడు మూర్తిభవించిన తపమువలె నుండెను. ఆతడస్త్ర శస్త్రములను విసర్జించెను. ఆతడు తనవైపునకే వచ్చుటను గాంచగానే ఖాండిక్యునకు గోపము వచ్చెను. ఆతడిట్లనుకొనెను: "నేనిచ్చటికి రాజ్యమును వదలి వనములలోనికి వచ్చియుంటిని. ఇచ్చటను నీతడు నన్ను వదలలేదు. మంచిది. నేనును నీతనితోనే యుద్ధమొనర్చెదను" అనుకొని ధనుర్బాణముల నెక్కిడి నిలుచుండెను.

ఖాండిక్యుడు యుద్ధమునకు సిద్ధపడుటనుగాంచి కేశధ్వజుడిట్లనెను: "సోదరా! నేను యుద్ధమొనర్పరాలేదు. నీవు నా మృగ చర్మముమీద బాణమును గొట్టెదవా?"

అంత ఖాండిక్యుడిట్లనెను: "రాజా! నీవు నాకు శత్రువు. శత్రువును వధించుట రాజులకు పరమ ధర్మము. నీయీ మాయ తపస్వి వేషమును, నీమృగ చర్మమును గాంచి నేను బాణమును వదలనను నుద్దేశ్యముతో వేసికొనియున్నావు. ఇది నీభ్రమ. మృగముల వీపుమీద మృగచర్మముండదా? మృగయాసక్తులగు రాజన్యులు దానిమీద బాణములను వదలరా? శత్రువు శత్రువే. అట్టివాడే వేషమున నాయెదుటకు వచ్చినను జంపక విడువను."

కేశిధ్వజుడిట్లనెను : "సోదరా ! నేను యజ్ఞమును జేయు చున్నాను. నా యజ్ఞధేనువు నొకసింహమడవిలో వధించినది. దానికి బ్రాయశ్చిత్తము నడుగుదమని నీశరణమునకు అస్త్రశస్త్ర విరహితుడనై వచ్చియున్నాను, ఏకాంతమని నన్ను జంపినను సరియే లేక నాప్రశ్నకు సముచితమగు బ్రత్యుత్తర మొసంగినను సరియే అది నీయిష్టములో నున్నది."

ఇది వినగానే ఖాండిక్యుడు ధనుర్బాణములను దించి, తన మంత్రి పురోహితులను గైకొని ఏకాంతమున లోనికిబోయి, ఇప్పు డేమి చేయవలయునని వారియాలోచనమును గ్రహించెను.

రాజు వాక్యములను విని మంత్రులిట్లనిరి : "మహారాజా! ఇట్టి స్వర్ణావసరము నెన్నడును జేతినుండి జారవిడువరాదు. ఎవని కారణమున మనము రాజ్యహీనులమై వనవనములందు దిరుగు చుంటిమో అట్టిశత్రువు మనకు చేజిక్కినాడు. చేజిక్కిన శత్రువును బ్రాణములతో విడుచుట బుద్ధిమంతుని కార్యముకాదు. నీవు శత్రు వును సులభముగ జయించి సమస్త భూమండలమును నిష్కంట కముగ రాజ్యమొనర్పవచ్చును."

ఇది విని ఖాండిక్యుడిట్లనెను:--మీరు సత్యమునే చెప్పితిరి. వశమునకు వచ్చిన శత్రువు నవశ్యము చంపివేయువలయును. రాజు యొక్క ధర్మము రాజ్యమును బాలించుటయే. ఏప్రయత్నము లొనర్చిన రాజ్యములభించునో రాజట్లుపోయిన రాజ్యమును మరల సంపాదింపవలయును. పైగా బ్రక్కననున్న రాజ్యము లభించినచో

నింక జెప్పవలసినదేమున్నది? బుద్ధిమంతుడగు రాజిట్టి యవసరము నేమాత్రమును జారవిడువరాదనుట సత్యమే. ఆతతాయియగు శత్రువును వధించుట ధర్మసంగతమేయగును. కాని యీ సమయ మున నా సోదరుడు శత్రుతాభావమున రానేరాలేదు. అతడు జిజ్ఞా సువై వచ్చినాడు. ఈ సమయమున నేనీతని జంపినచో నాకవశ్యము నిష్కంటకమగు బృథివీరాజ్యమంతయును లభింప గలదు; కాని నాపరలోకము నశించును వీరికి బరలోకము లభిం చును. నేను రాజ్యలోభమునువీడి యీతని ప్రశ్నలకు బ్రత్యుత్తర మొసంగుచో రాజ్యము లభింపదేమో కాని నాకుబరలోకము లభింప గలదు. ఈలోక తుచ్ఛ సుఖములు కంటె బరలోక సుఖములు సర్వశ్రేష్ఠములు. నేను దుచ్ఛమగు బృథివీరాజ్యమునకై పరలోక సుఖములను బోనాడను. కావున నేను ద్వేషమునువీడి అతడడిగిన దానికి బ్రత్యుత్తరమొసంగెదను." అని చెప్పి మరల గేశిధ్వజుని కడకువచ్చి యిట్లనెను:- "రాజా! వచ్చితిని ఏమడుగదలచితివి."

కేశిధ్వజుడు ఖాండిక్యుని యెడల నాదరమును బ్రదర్శిం చుచు నమ్రతతో నిట్లనెను:—"సోదరా! నేను యజ్ఞము నొనర్చు చున్నాను. ఈమధ్య యజ్ఞధేనువును సింహము చంపి వైచినది. దీనికి బ్రాయశ్చిత్తమును మాఋత్విజులు చెప్పజాలకపోయిరి. కశేరు మహర్షియును జెప్పజాలకపోయెను. శునక మహామునియు జెప్ప జాలకపోయెను. అతడు నన్ను నీసమీపమునకు బంపినాడు. నీవు దీనికుచితమగు బ్రాయశ్చిత్తమును జెప్పుము. దానివలన నాయజ్ఞము సాంగోపాంగముగ నిర్విఘ్నముగ సమాప్తము కావలెను."

ఇది విని ఖాండిక్యుడు శాస్త్రీయవిధిచే దీనికి ప్రాయశ్చిత్త మును జెప్పెను. ప్రాయశిత్తమును దెలిసికొనగానే కేశిధ్వజునకు పరమానందము ప్రాప్తించెను. ఆతడు ఖాండిక్యుని యెడల నాదర మును బ్రకటించుచు దనయజ్ఞమునకు దిరిగిపోయెను. అచ్చటికి బోయియాతడు ఖాండిక్యుని ఆదేశానుసారముగ బ్రాహ్మణుల యనుమతిని బ్రాయశ్చిత్తమొనర్చుకొని విధి విధానముగ యజ్ఞము నంతను బూర్తికావించెను. ఆతడు దానమానములచేత నందరను సంతుష్టులను గావించుచు బ్రాహ్మణులకు యథేష్టముగ దక్షిణ నొసంగెను. ఎవరు దేనినడిగిన దానినొసంగెను. యాజ్ఞికుల మనో రథములను బూర్తి కావించెను. ఋత్విజులత్యంత సంతుష్టులై యశీర్వాదముల నొసంగి వెడలిరి. అయినను రాజు మనస్సునకు బూర్ణశాంతి కలుగలేదు. ఆతడిట్లనుకొనెను:-"నామనస్సు పూర్ణ సంతుష్టిని జెందలేదేల? నేను యజ్ఞమును విధ్యుక్తముగ సమాప్తము కావించితిని. ఆతనికి నేను గురుదక్షిణనీయలేదు. గురుదక్షిణ నీయకున్నచో సమస్త కృత్యముల సంపూర్ణములుగనేయుండును. నేను మునుముందుగా రాజర్షియగు ఖాండిక్యునకు యథేష్టముగ గోరిన దక్షిణ నొసంగి సంతుష్టు నొనర్చిననే నాకు సంతోషము కలుగును."

సూతుడిట్లనెను:-"మునులారా! ఇట్లు విచారించి కేశిధ్వజ మహారాజు సుందరమగు దన రథమునెక్కి రాజర్షియగు ఖాండి క్యుని ఆశ్రమమునకు బోయెను."

# కేశిధ్వజుడు ఖాండిక్యునకు జ్ఞానదాన మొసంగుట

శ్లో॥ ఖాండిక్యః కర్మతత్త్వజ్ఞో భీతః కేశిధ్వజ ప్రసతః ।
భానుమాం స్తస్య పుత్రోఽభూచ్ఛతద్యుమ్నస్తుతత్సుతః ॥

శ్రీ భాగ. ౯ స్కం. ౧౩ అ. ౨౧ శ్లో ॥

ఈ సాంసారిక భోగము లనిత్యములు, నశ్వరములు, క్షణ భంగురములు, అగమాపాయులు, అశాశ్వతములు, పరిణామమున దుఃఖదములు. విద్వాంసులు వీని మోహమునబడరు. ఈ శరీర మునే సర్వస్వమని భావించువారు న్యాయముననో అన్యాయముననో ఉచితోపాయములచేతనో అనుచితో పాయములచేతనో యేదో విధ మగు ధనాదులను బొందుటకు బ్రయత్నించెదరు. వారికి పరమార్థ పరమాత్మాదుల వలన నేమియును బ్రయోజనము లేదు. ధనము ప్రాప్తింప వలయును, ప్రతిష్ఠరావలయును, ఈ శరీరము సుఖ ముగ నుండవలయును. ఇదియే వారి యభిలాష. అహమ్మమలే వారికి మూలమంత్రము. నేను సుఖముగ నుండవలయును, నా వైభవము వృద్ధికావలయునను నదియే వారిజీవన ధ్యేయము. అట్టి నరపశువులాహార నిద్రాభయ మైథునాదులనే సర్వోత్కృష్ట సుఖ ముగ భావించి వానిని బొందుటకు బ్రయత్నశీలురగు చుందురు. వారు మాటిమాటికిని జన్మించుచుందురు, మాటిమాటికిని మర ణించుచుందురు. వారావాగ మన చక్రము నుండి బయటపడరు. దీనికి విరుద్ధముగ నినాశ వంతములగు పదార్థములలో నేమియును

లేదని పరమార్థచింతన మందు కాలమును గడుపుచో నట్టివారమృత తత్త్వమును జెందెదరు. జనన మరణ రూపమగు బంధనము నుండి శాశ్వతముగ విముక్తిని జెందెదరు.

సూతుడిట్లనెను: "మునులారా! ఖాండిక్య జనకుని ఆదేశానుసారముగ కేశిధ్వజ జనకుడు తన యజ్ఞమును విధ్యుక్తముగ సమాప్తము కావించి గురుదక్షిణ నొసంగుటకై మరల గహన వన మందున్న ఖాండిక్యుని సమీపమునకు బోయెను. ఇప్పుడు మరల కేశిధ్వజుడు రథముమీద వచ్చుటను గాంచగనే ఖాండిక్యునకు మరల శంకకలిగెను. ఆతడస్త్ర శస్త్రములను గైకొని తన శత్రువుతో మరల యుద్ధమొనర్ప నుద్యుక్తుడయ్యెను.

ఖాండిక్యుడు యుద్ధమొనర్చుట కుద్యుక్తుడగుటను గాంచి నవ్వుచు రాజర్షియగు కేశధ్వజుడిట్లనెను: "రాజా! నేను యుద్ధ మొనర్ప నీ సమీపమునకు రాలేదు. నీ కృపచే నాయజ్ఞము సాంగోపాంగముగ, సకుశలముగ, సవిధిగ సమాప్తియైనది. ఇప్పుడు నేను గురుదక్షిణ నొసంగుటకై నీసమీపమునకు వచ్చితిని. నీవు నావలన యథేచ్ఛగ దక్షిణ నడుగుము."

ఇది విని ఖాండిక్యుడు తన మంత్రులను దీసికొని యేకాంత ప్రదేశమునకుబోయి వారినిట్లడిగెను: "ఈ కేశిధ్వజ మహారాజు నా సోదరుడు. ఈతడు యుద్ధమందు నన్ను బరాజితునొనర్చి నారాజ్యమును లాగుకొనినాడు. నన్నుయథేచ్ఛగ దక్షిణ నడుగుమను చున్నాడు వీని నేదక్షిణ నడుగవలయును?"

మంత్రులిట్లనిరి : "మహారాజా! ఇందులోను గొంచెమడుగ వలసిన విషయమున్నది. నీవీతనినుండి దక్షిణగా సమస్తరాజ్యము నడుగుము. రాజ్యము కొరకెన్నో గొప్పగొప్ప యుద్ధములు జరుగుచుండును. అసంఖ్యాకులగు వీరులు వధింపబడుదురు. రాజ్యము కొరకై ఉచితానుచితములగు కార్యములెన్నో చేయబడుచుండును. క్షత్రియునకు రాజ్యమన్యాయమున లభించినను దానిని గైకొన వలయును. పైగా నీకింటిలో నుండగనే ఆయాస ప్రయాసలు లేకయే, యుద్ధములులేకయే స్వతఃరాజ్యము లభించుచున్నది. ఇట్టి యవసరమున నే బుద్ధి మంతుడును రాజ్యము నవహేళనము కావింపడు.

ఇది విని రాజర్షియగు ఖాండిక్యుడు నవ్వుచు నిట్లనెను : "మీరు లౌకికార్థ సాధనమందే నిపుణ మంత్రులు. పారలౌకిక సాధనమందు మీరు సర్వథా అనభిజ్ఞులు. నావంటి వ్యక్తి గురు దక్షిణకొరకై యిట్టి క్షుద్ర వస్తువును యాచించుటా? రాజ్యాదుల నిత్యములైనవి. అవి ప్రారబ్ధవశమున వచ్చిపోవుచునే యుండును. నేనిదివరకు రాజునుగానా? ఇప్పుడొకవేళ నేను రాజ్యమునడిగినను నెన్ని దినములు సుఖింపగలను? చివరకు సమస్తము నిచ్చటనేవీడి చచ్చిపోవుదును. బ్రహ్మజ్ఞానియగు నాయీ సోదరుని శాశ్వతముగ జనన మరణ చక్రము నుండి విడివడి సాంసారికా వాగమనములు నశించునట్టి వస్తువు నేల నడుగరాదు."

మంత్రులిది విని సిగ్గుతో నిట్లనిరి :- "మహారాజు యిష్టము మేము మాబుద్ధిననుసరించి సమ్మతి నొసంగితిమి. చేయుటకున్ను

జేయకపోవుటకును మీరు సర్వధా సమర్థులరు." ఇది విని ఖాండిక్యుడు కేశిధ్వజుని సమీపమునకుబోయి, ఆతని నభినందించి స్నేహపూర్వకముగ నిట్లనెను: "నీవు యథార్థముగ నేనడిగిన దక్షిణ నీయదలచితివా?"

కేశిధ్వజుడిట్లనెను:- సోదరా! నేను దక్షిణ నొసంగుటకే వచ్చితిని. నీవేది యడిగిన దానిని నేను గురుదక్షిణగ నొసంగెదను.

ఇది విని ఖాండిక్యుడిట్లనెను: "మంచిది, నీవు నాకు గురుదక్షిణ నొసంగదలచినచో సమస్త క్లేశము లత్యంతాభావమగు నట్టి కర్మోపదేశము నొనర్పుము. నీవధ్యాత్మ విజ్ఞాన సారంగతుడవు. సత్పదార్థ బోధకలిగి, పరమార్థ పథమును బ్రదర్శింప గలుగు నుపదేశము నొసంగుము."

ఇది విని యానందమును బ్రకటించుచు గేశిధ్వజు డిట్లనెను: "ఇదేమి? నీ వెట్టి గురుదక్షిణ గోరితివి? నేను నీకు యథేచ్ఛగ వస్తువు నొసంగుటకు వచ్చితిని. నీవు సమస్త భూమండల నిష్కంటక రాజ్యము నడుగవచ్చును. క్షత్రియులకు రాజ్యలాభము నకు మించిన మఱియొక లాభమే లేదు. ప్రజాపాలనమునకు మించిన పుణ్యప్రదమగు కార్యమే లేదు. రాజ్యము లభించిన మీదట నీవు యథేష్టముగ దానపుణ్యము లొనర్పవచ్చును. ఇష్ట మిత్ర బాంధవులను సుఖపెట్టవచ్చును. స్వయముగ సుఖోప భోగము లొనర్పవచ్చును. దీనినడుగక నీవీ వస్తువు నడిగితివేమి?"

అంత దృఢతాస్వరమున ఖాండిక్యుడిట్లనెను: "సోదరా! నీవు నన్ను మోసగింపవలదు. నీవు నా ముముక్షుత్వమును బరీక్షించుచున్నావు. మానవుడు రాజ్యమును బొంది యహంకారి యగుసను సంగతి నీకు తెలియనిదా? ఈ యహంకారమెంతో మాదక మధువు. దీనిని బానమొనర్చి మానవుడు జనన మరణ చక్రములోబడిపోవును. ప్రజాపాలన రూపమగు ధర్మమును నేనాచరించుచునే యున్నాను. నేను దానిని స్వేచ్ఛగా ద్యజింపలేదు. నీవు యుద్ధమున నా రాజ్యమును హరించి మంచిపని చేసితివి. నాకుండిన భోగలిప్సను నీవు వదలించితివి. ఇన్ని దినములనుండి అరణ్యములలో నుండుటచే గ్లేశములను సహించి సహించి నేనీ విషయముల క్షణభంగురతను దెలిసికొంటిని. నాకు విషయ వైరాగ్యము కలిగినది. నాకు మోక్షేచ్ఛ జాగృతి చెందినది ఏమోహగర్తమునుండి భగవానుడు బలవంతముగ జేయిని బట్టుకొని బయటకు లాగినాడో దానిలోనికి బోయి మరల బడుదునా? మరల జనన మరణ చక్రములో బడుటెంతటి బుద్ధిమతత్వము. కావున రాజా! నావంటి వ్యక్తి నీవంటి అధ్యాత్మ విద్యావిశారదుని బొంది క్షుద్ర సాంసారిక భోగములను యాచించుటెట్లు జరుగ కలదు?"

ఇది విని కేశిధ్వజుడిట్లనెను:- "యథార్థముగ నీవధ్యాత్మ జ్ఞానమున కధికారివైతివి. నేనేది చేసినను మృత్యువును దరించు నుద్దేశ్యము తోడనే చేయుచున్నాను. యజ్ఞయాగాదులొనర్చి పాప క్షయమును గావించుకొనుచున్నాను. భోగముల ననుభవించి పుణ్య

క్షయమును గావించుకొనుచున్నాను. పుణ్యపాపములు రెండును వీడినప్పుడే జీవుడు ముక్తుడగును. అవిద్య సంసృతికి హేతువు."

ఖాండిక్యుడిట్లనెను:- "అవిద్య యనగానేమి?"

కేశిధ్వజుడిట్లనెను:- "అసత్తు నందు సద్బుద్ధియును, అనాత్మయందలి ఆత్మబుద్ధియుంచుటయే అవిద్య యొక్క స్వరూపము. ఈ దేహము పంచభూతములచే నిర్మింపబడినది. అనిత్యమైనది, నశ్వరమైనది. అవినాశియును, నిత్యరూపుడునగు దేహి భ్రమవశముననను నజ్ఞానకారణముననను మాయాధీనుడై యీ దేహము నాత్మయని భావించుచుండును. కావున మానవుడే కర్మనొనర్చినను దేహసుఖము కొరకొనర్చును. ఆత్మ సుఖ స్వరూపమైనది. దానికి భౌతికపదార్థముల సుఖాపేక్షలేదు. ఈ దేహము పంచభూతములతో నిర్మింపబడినది. అందువలన బంచభౌతిక విషయ సుఖములను గోరుచుందును.

ఖాండిక్య డిట్లనెను :- "దేహము పంచ భూతములచే నిర్మింపబడినచో దానికి పంచ భూతము లేమి సుఖము నొసంగ గలవు ?"

అంత గేశిధ్వజు డిట్లనెను :-"సుఖము లేమి యొసంగును. ఇది ఒక విధమగు భ్రమ. ఇంటిని మట్టితో గట్టెదరు. మరల మట్టి, నీరు వీనితోడనే అలుకుదురు. స్వచ్ఛమొనరించెదరు. అదే విధముగ నీ దేహము పృథివిచే నిర్మింపబడినది. ఇది పార్థివ పదార్థములగు అన్నము, పాలు, పెరుగు, నేయి, చక్కెర మొదలగు

వానిచే బుష్టమగును. అన్న జలముల తోడనే యిది నిలుచును. ఇంటికి నింటి యజమాని యెట్లు వేరుగ నున్నాడో అట్లే దేహము నుండి దేహి వేరుగ నున్నాడు. ఇంటివాడింటి నమ్మి మరియొక యింటికి బోవును. ఇల్లు మారినను నింటి యజమాని మారడు. అదేవిధముగ దేహము నాశము చెందినను దేహి నాశము నొందడు. పంచ భూతములచే నిర్మితమయిన దేహము పంచ భూతముల చేతనే పెరుగును. పుష్టిని జెందును. అట్టియెడ నేను లావువాడను, నేను సుందరుడను, ధనవంతుడను, సమ్మానితుడను, జగత్పూజ్యుడనని యహంకారమును జెందుట కేమియున్నది? ఆత్మ దృష్టితో జూచినచో నాత్మ సర్వశ్రేష్ఠమయినది. దేహ దృష్టితో జూచినచో దేహము లావు దేహము కానిండు, పలచని దేహము కానిండు, కురూపుడు కానిండు, సురూపుడు కానిండు, ఎఱ్ఱనివాడు కానిండు, నల్లనివాడు కానిండు, చిన్నవాడు కానిండు, పెద్దవాడు కానిండు, సమస్త విధముల నశ్వరుడు నశాశ్వతుడై యున్నాడు. కావున దీనిపై మోహము నుంచుట వ్యర్థము."

ఖాండిక్యు డిట్లనెను :- "దేహి దేహమునకు వేరైనచో బ్రాణి ధన, జన, పుత్ర పరివారమునందును, దేహమునందును నింతటి యాసక్తిని జెందు టెందులకు?"

కేశిధ్వజు డిట్లనెను : "అనేక జన్మములందలి సంస్కారములచే నిరంతరము కర్మ వాసనల బంధనమునందు బడియుండి జీవి సంసారమున దిరుగుచుండును. మరల మరల జన్మించుచుండును. మరల మరల జచ్చుచుండును. వానికి జన్మమును

లేదు, మరణమును లేదు. దేహోపచారముననే దాని యందు జనన మరణములు కల్పింపబడినవి. వాసనా మలినముచే నంతఃకరణ రూపమగు వస్త్రము మలినమైనది. తన యథార్థ స్వరూపమునుండి పతనమైనట్లు కనబడుచున్నది. మంచు కప్పుటచే సూర్యుడు కప్పబడినట్లు కనబడును. ఈ యంతఃకరణ రూపమగు మలిన వస్త్రమును జ్ఞాన రూపమగు నుష్ణ జలముచేతను నన్య సాధన సామగ్రి చేతను యుక్తి పూర్వకముగ గడిగినచో శుద్ధముగను నిర్మలముగను నగును. ఆత్మ నిత్య శుద్ధ బుద్ధ నిర్మల నిరామయ స్వరూపము. ప్రకృతి సంసర్గముచే నిది తన్ను సుఖిగను దుఃఖిగను భావించును."

ఖాండిక్య డిట్లనెను:- "అయితే యిది చెప్పుము. దుఃఖము, అజ్ఞానము లేక భ్రమాదులు దేనికి గలుగును; ప్రకృతి యందా? ఆత్మ యందా?"

కేశిధ్వజుడు శీఘ్రముగ నిట్లనెను: "ఆత్మకు దుఃఖా జ్ఞాన భ్రమాదులు సంభవములు కావు. ఇవన్నియును ప్రకృతి ధర్మ ములు. ఆత్మ వీనికి బూర్తిగా నిర్లిప్తముగ నున్నది."

అంత ఖాండిక్య డిట్లనెను: "ఈ క్లేశ కర్మల నాశనమే సాధనము ద్వారా కాగలదు? దయతో దీనిని జెప్పుము."

కేశిధ్వజు డిట్లనెను: క్లేశ నాశనమున కేకైక సాధనము యోగము. యోగము లేక చిత్తవృత్తులు నిరోధింపబడవు. చిత్త వృత్తి నిరోధము కాకున్నచో స్వస్వరూప మందుండజాలదు."

ఇది విని ఖాండిక్యు డిట్లనెను : "మహాభాగా ! ఆ యోగ స్వరూపమును నీవు నాకు జెప్పవలయును."

అంత గేశిధ్వజు డిట్లనెను : "మనస్సును వశము చేసి కొను సాధనమునకే యోగమని పేరు. సాధారణముగ ప్రాణి మనస్సునకు వశుడై పని చేయుచుండును. మనస్సున కోడిన నోడినవాడే, గెలిచిన గెలిచినవాడగును. బంధ మోక్షములకు గారణము మనస్సే. విషయాసక్తమగు మనస్సు బంధన హేతు వగును. అదియే నిర్విషయ మగుచో ముక్తి కారణమగును. అశుద్ధ మగు మనస్సే జీవుని నెనుబది నాలుగు లక్షల జీవరాసులలో ద్రిప్పును. అదియే విశుద్ధమై బ్రహ్మతో సంయోగమును జెందును. ఆ సంయోగమునకే యోగమని పేరు. యోగసాధన మొనర్చు వాడు ముక్తి సాధన మొనర్చుచున్నట్లే. ఆతడే ముముక్షువగు యోగి యనబడుచున్నాడు. యోగులు రెండు రకములు. ఒకడు యోగయుక్తుడు, రెండవవాడు యుంజవంతుడు. సమాధి సిద్ధిని బొందినవాడు యోగయుక్తుడగును. యోగముకొరకై యత్నించుచు యోగమున నంతరాయము కలుగుటచే సిద్ధిని బొందనివాడు యుంజవంతు డనబడును. యోగయుక్తుడగు యోగి తక్షణము ముక్తుడగును కాని యోగమున కంతరాయము కలిగినచో నాతడు జన్మాంతరమున ముక్తుడగును. యోగి ముందుగా యమ నియమ ములను బాలించుట ఆవశ్యకము."

ఖాండిక్యు డిట్లడిగెను :-"యమ నియమము లెన్ని ?"

కేశిధ్వజు డిట్లనెను :-"యమ నియమము లైదైదు కలవు. అహింసా, సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యము, అపరిగ్రహము అను నీ యైదును యమములు. శౌచము, సంతోషము, తపము, స్వాధ్యాయము, ఈశ్వర ప్రణిధానము అను యైదును నియమములు. ఈ యమ నియమ పాలనము విశిష్టములగు గోరికలతో జేయబడినచో నా కోరికలు పూర్ణమగును. నిష్కామ భావముతో బాలించుచో ముక్తి చేకూరును. వీనిలో నొక్కదానినైనను నిష్కామ భావనతో బాలించినచో మానవుడు ముక్తుడగును. యమ నియమముల తరువాతది ఆసనము."

ఖాండిక్యు డిట్లడిగెను :- "ఆసనము లెన్ని రకములు?"

అంత గేశిధ్వజు డిట్లనెను :- "సోదరా ! ఆసనము లసంఖ్యాకములుగ నున్నవి. స్థిరత్వమునుండి, మోకాళ్ళు భూమి కానుచు మేరుదండము సరిగా నిఖువుగా నుండి, కూర్చుండుటకు సుఖముగా నుండినచో దాని నాసనమందురు. యోగ శాస్త్రమం దేబదినాలుగాసనములు ప్రసిద్ధములుగ నున్నవి. ఇవిగాక యింక ననేకాసనములు కలవు. వీనిలో సిద్ధాసనము, పద్మాసనము, సుఖాసనము, ఇవి ముఖ్యములు. వీనిలో నేదియో యాసనము నభ్యాసము చేవించి దానిలో గూర్చుండి ప్రాణాయామ మొనర్పవలెను."

ఖాండిక్యు డిట్లడిగెను :- "ప్రాణాయామ మన నేమి?"

కేశిధ్వజు డిట్లనెను : "ప్రాణములను సంయమించుటను ప్రాణాయామ మందురు. ప్రాణము లెల్లప్పుడును శ్వాసోచ్ఛ్వాస

రూపమున సదా వచ్చుచు బోవుచుండును. వీని నభ్యాసముచే నియమన మొనర్చుటను బ్రాణాయామ మందురు. అది పూరక, రేచక, కుంభకములని మూడు విధములుగ నున్నది. ప్రాణాయామము తరువాత బ్రత్యాహార మొనర్పవలయును.''

ఖాండిక్యు డిట్లడిగెను :- "సోదరా! ప్రత్యాహారమని దేని నందురు ?"

కేశిధ్వజు డిట్లనెను :- ''పరువిడుచుండు చిత్తవృత్తులను మాటి మాటికిని లాగి అంతర్ముఖ మొనర్చుటకు, వృత్తులను బాహ్యము కానీయక పోవుటకు బ్రత్యాహారమని పేరు. చిత్తమును శుభాశ్రయమున నుంచుటయే ప్రత్యాహార ప్రయోజనము.''

ఖాండిక్యు డిట్లనెను :- "సోదరా ! చిత్తమునకు శుభాశ్రయ మేది ?"

కేశిధ్వజు డిట్లనెను :- "చిత్తమునకు రెండు విధములగు శుభాశ్రయములు కలవు. ఒకటి మూర్తము, రెండవది అమూర్తము అమూర్త భావనము నిరాకారమునందును, మూర్త భావన మీ విశ్వమునంతను భగవద్రూపముగ జూచుటలో గలదు. ఈ చరాచర విశ్వమంతయును, పృథివీ, జల, తేజ, వాయువు, సరిత్సముద్ర ఆకాశ, భూగోళ, ఖగోళము లన్నియును నా శ్రీహరి రూపమే. అన్నిటిని నాతని యంగమున భావన మొనర్పవలయును. భగవంతుని యొక్క యే రూపమిష్టమో, శాస్త్రములలో నాతని వర్ణనమెట్లున్నదో, దానియందు చిత్తమును స్థిరము కావింప

వలయును. అంతఃకరణమందు భగవంతుని నిల్పుకొన్నచో సమస్త పాపములు నాశనమగును. సమస్తాశుభములు భస్మము లగును. సమస్తశక్తులను స్థిర మొనర్చుట కాధారము చిత్తమే. యమ, నియ మాసన ప్రాణాయామ ప్రత్యాహారము లైదును బాహ్య సాధన ములు. ధారణ, ధ్యాన, సమాధు లను నీ మూడును నంతరంగ సాధనములు. చిత్తమునందు భగవంతుడు లెస్సగా నుండి చిత్త మాతని స్వరూపమును ధరించినచో దానిని 'ధారణ' యందురు. ధారణా సిద్ధినే ధ్యానమందురు. భగవంతుని యొక్క సుందర స్వరూపమును నఖ శిఖ పర్యంతము ధ్యాన మొనర్పవలెను. ముందుగా నొక్కొక్క యంగమును ధ్యానింపవలెను. లలాటము, నేత్రము, నాసిక, ముఖారవిందము, హృదయము, బాహువు, వక్షః స్థలము, నాభి, కటి, ఊరు, జాను, జంఘ, పాద, ప్రపాద, పాద తలము - ఇట్లు ప్రతి యంగమునందును జాలసేపటివరకు ధ్యాన మొనర్ప వలెను. అన్ని యంగములయందును ధ్యానము కుదుర గానే భగవంతుని యొక్క సమస్తాంగములను నొక్కసారిగా ధ్యానింపవలెను. ధ్యానము యొక్క పరిపక్వావస్థకు సమాధియం దురు. ఆ సమాధియును సబీజమును నిర్బీజము నని రెండు విధ ములుగ నున్నది. సమాధి ప్రాప్తింపగనే అశేష సంక్లేశములు నాశనము లగును. ప్రాణి పరమానంద నిమగ్నుడగును. ముక్తి కరతల గతమగును జీవుడు స్వస్వరూపమునం దుండును. ఇదియే చివర నిష్ఠ. ఇదియే పరాగతి. సమాధి సిద్ధిని బొందిన ముని కృతకృత్యు డగును. సమాధి స్థితుడగు యోగికి సమస్త సంశయ

ములు నాశనమగును. హృదయ గ్రంథి వీడును. ఆతని శుభాశుభ కర్మ లన్నియును నశించును. నే నిప్పు డత్యంత సంక్షేపమున నాత్మజ్ఞాన సాధన భూతమగు యోగము నుపదేశించితిని. నీవు దీని నభ్యసించినచో నీకుసమస్త విషయములు తెలియగలవు."

ఇది విని ఖాండిక్యుడు కేశిధ్వజుని యెడల గృతజ్ఞతను బ్రకటించుచు నత్యంత సత్కార పూర్వకముగ నిట్లనెను :- "సోదరా ! నీవు నాసమస్త సంశయములను ఛేదన కావించితివి. నీవు నాకభూతపూర్వమగు నమూల్యమగు దక్షిణ నొసంగితివి. నేను సంతసించితిని. నీవు నాకధ్యాత్మోపదేశము నొసంగి కృతార్థుని గావించితివి."

సూతుడిట్లనెను :- "మునులారా ! కేశిధ్వజుని యుపదేశమున ఖాండిక్యుడు కృతార్థుడయ్యెను. ఆతడు కేశిధ్వజుని బూజించెను. కేశిధ్వజుడు ఖాండిక్యుని సమస్తరాజ్యమును దిరిగి యిచ్చివైచెను. ఖాండిక్యుడును దన రాజ్యమును బుత్రునకొసంగి యోగ సాధన మొనర్చుటకై వనమునకుబోయెను.

కేశిధ్వజుడు సమస్త కర్మలను నిష్కామ భావముతో నొనర్చుచు జివరకు పరమ పదమును బొందెను. కేశిధ్వజుని తరువాత నాతని పుత్రుడు భానుమంతుడు రాజయ్యెను."

# జనక వంశములోని మిగిలిన రాజులు

శ్లో॥ ఏతే వై మైథిలా రాజన్నాత్మ విద్యా విశారదాః ।
యోగేశ్వర ప్రసాదేన ద్వంద్వైర్ముక్తా గృహేష్వపి ॥

శ్రీభాగ. ౯ స్కం. ౧౩ అ. ౨౭ శ్లో॥

వ్యక్తియొక్క పూజ ఆతని గుణముల వలన జరుగుచుండును. రూప, ధనైశ్వర్య కులాదులవలన క్షణిక ప్రతిష్ఠ కలిగిన గలుగుగాక; కాని ఆదరభావము గుణముల వలననే జరుగును. తనకడకేదైన వస్తువును యాచించుటకై వచ్చినచో వారికోరికను నెరవేర్చుట అన్నిటికంటె గొప్ప శుభకార్యము; కాని సాంసారికేచ్ఛలను నెరవేర్చుటకంటే మించిన సర్వశ్రేష్ఠకార్య మభయదానము. ఈప్రాణి మృత్యుభయముచే అటునిటు దిరుగుచుండును. మృత్యుభయ మజ్ఞానముచే గలుగును. ఈ యజ్ఞానమును నశింపజేసి జ్ఞానదానమెవడు చేయునో ఆతడే నిజమగుదాత. ఏకుల మందే వంశమందిట్టి జ్ఞానులు పుట్టిరో ఆకులము ధన్యమైనది, ఆవంశము సర్వశ్రేష్ఠమైనది. ఆవంశములో బుట్టిన వారందరును బూజనీయులును, ఆదరణీయులును, శ్లాఘనీయులునై యున్నారు.

సూతుడిట్లనెను :— "మునులారా ! నేను జనకవంశములోని రాజుల వంశమునుగూర్చి వర్ణించితిని. ప్రసంగ వశమున కేశిధ్వజ ఖాండిక్యుల సంక్షిప్త ఆధ్యాత్మిక సంవాదమును జెప్పితిని; ఇప్పుడు మీరు కేశిధ్వజుని పుత్రుడగు భానుమంతుని కావలి

రాజుల వర్ణనమును వినుడు. కేశిధ్వజుని తనయుడు భానుమంతుడు ఆతని పుత్రుడు శతద్యుమ్నుడు. ఆతనికి శుచి, శుచికి సనద్వాజుడు. సనద్వాజుని సుతుడూర్ధ్వకేతువు. ఊర్ధ్వకేతువునకజుడు. అజునకు బురుజిత్తు. ఆతని కరిష్టనేమి. అరిష్టనేమికి శ్రుతాయువు. శ్రుతాయువునకు సుపార్శ్వకుడు. సుపార్శ్వకునకు జితరథుడు. ఆతనికి క్షేమధి, క్షేమధికి సమరథుడు. సమరథునకు సత్యరథుడు ఆతనికి కుపగురు. ఉపగురున కుపగుప్తుడు. ఈతని నగ్నివంశీయునిగానెన్నిరి. ఉపగుప్తునకు వస్వనంతుడు. వస్వనంతునకు యుయుధుడు. యుయుధునకు సుభాషణుడు. సుభాషణునకు శ్రుతుడు. శ్రుతునకు జయుడు. జయునకు విజయుడు పుత్రుడయ్యెను. విజయునకు ఋతుడు. ఋతునకు శునకుడు, శునకునకు వీతహవ్యుడు, వీతహవ్యునకు ధృతి, ధృతికి బహుళాశ్వుడు, బహుళాశ్వునకు గృతియను బలవంతుడగు పుత్రుడుదయించెను. కృతియే జనక వంశమునకు చివర రాజు. కృతికి తరువాత జనక వంశము సమాప్తమయ్యెను.

ఈ రాజులందరును జనకులనబడు చుండిరి. ఉపనిషత్తులతో యాజ్ఞవల్క్య జనక సంవాదమతి ప్రసిద్ధమైనది. ఆధ్యాత్మిక సంవాద చర్చ తెచ్చుటనున్నను జనకునకును నితర జ్ఞానులకును జరుగుచుండును. జనక శబ్దము జ్ఞానికి వ్యవహరింపబడు చుండెను. ఎవరినైనను బ్రశంసించుచున్నను, వ్యంగ్యముగ ననుచున్నను నీతడు జనకుడై నాడయ్యా అనుచుందురు. రాజర్షియగు జనకుని కథలు పురాణములలో నధికముగ గలవు. అవియే జనకుని కథలో మనము నిర్ణయింపజాలము. బృహదారణ్యకోపనిషత్తులోని తృతీ

యాధ్యాయ ప్రథమ బ్రాహ్మణమున నొక గొప్ప జ్ఞాన పూర్ణ మగు కథ కలదు. అది యీ విధముగ నున్నది.

ఒకసారి జనకమహారాజు గొప్ప దక్షిణలుగల యజ్ఞము నొకదానిని నొనర్చెను. ఆయజ్ఞమునకు దూరదూరముల నుండి విద్వాంసులగు బ్రాహ్మణులు చాలమంది వచ్చిరి. కురుపాంచాల దేశముల నుండియును జాలమంది పేరుగల శాస్త్రపారంగతులగు బ్రాహ్మణులు వచ్చిరి. వారి నందరును మహారాజు దాన మానము లచే సంతుష్టుల నొనర్చెను. వీరందరలో బూర్ణ బ్రహ్మజ్ఞానియగు బ్రాహ్మణుడెవడను జిజ్ఞాస రాజునకు గలిగెను. అందరకంటే దామే గొప్పవారమని వారెట్లు చెప్పగలరు? ప్రతివారును దమకు తామే గొప్పవారమనుకొను చుండిరి. ఈ విషయమును బరీక్షింప వలయును."

అని యిట్లాలోచించుకొని రాజత్యంత సుందరములగు వేయి గోవులను దెప్పించెను. అవన్నియును తరుణులు. అన్నియును బాడివే. అన్నియును బలిసియుండెను. అన్నిటి శృంగములును సువర్ణముతో బొదుగబడి యుండెను. అన్నియును స్వస్థముగను సాధువులునై యుండెను. వానినన్నిటిని నిలిపి రాజిట్లనెను:—
"బ్రాహ్మణులారా! మీలో బ్రహ్మనిష్ఠుడెవరో ఆతడీ గోవులను దోలుకొని పోవచ్చును."

ఇది వినగానే బ్రాహ్మణులందరును నొకరిముఖము నొకరు చూచుకొనుచుండిరి. ఆగోవుల సమీపమునకు బోవుటకై యెవ్వరికిని

సాహసము లేకపోయెను. అందరును సంభ్రమములోబడి యుండు టను గాంచి యాజ్ఞవల్క్య మహాముని తన శిష్యుడగు బ్రహ్మ చారితో నిట్లనెను:- "వత్సా ! ఈ గోవులనన్నిటిని మన యాశ్రమ మునకు దోలుకొనిపొమ్ము."

శిష్యుడగు సామశ్రవుడు తన సద్గురుని యాజ్ఞను బాలించెను. ఆతడు గోవుల నన్నిటిని దోలుకొని పోయెను. యాజ్ఞవల్క్యునికి గోవులన్నియును బోవుటనుగాంచి, అచ్చటికి వచ్చి బ్రాహ్మణు లందరును బరమ కుపితులైరి. ఇది వారి కవమానముగ దోచెను. వారిలో జనకుని హోత అశ్వలుడిట్లనెను:- "యాజ్ఞవల్క్య ! మా యందరలో నీవొక్కడవేనా బ్రహ్మవేత్తవు?"

యాజ్ఞవల్క్య మహాముని యిట్లనెను:- "విప్రవరా! బ్రహ్మ నిష్ఠునకు మేము ప్రణామమును గావించెదము. మేము గోవులను గొనిపోవు వారమే." అంత నాసభలో నున్న విద్వాంసులందరును యాజ్ఞవల్క్యునిపై ప్రశ్నల వర్షమును గురిపించిరి. మునుముందుగా నశ్వలుడే ప్రశ్నించెను. వానికన్నిటికిని యాజ్ఞవల్క్యుడు సముచిత ముగ బ్రత్యుత్తర మొసంగెను. తదనంతరము జరత్కారు ఆర్త భాగులు ప్రశ్నించిరి. అంత క్రమముగ లాహ్యాయనిభుజ్యుముని, చాక్రాయణ ఉపస్తుడు, కౌషీతకేయుడు కహోలుడు వచక్రుని పుత్రిక గార్గి, అరుణి ఉద్దాలకుడు, శాకల్య విదగ్ధుడు నాతని బ్రశ్నించిరి. ఆ ప్రశ్న లన్నిటికిని యాజ్ఞవల్క్యుడు చాల తెలివిగా నుత్తరములు నొసగెను. జనకునకును యాజ్ఞవల్క్యునకును వాదము

జరిగెను. మహారాజీతని బ్రహ్మనిష్ఠను, అధ్యాత్మ జ్ఞానమునుగాంచి పరమానందమును జెందెను. ఆతడు యాజ్ఞవల్క్యునకాత్మ సమర్పణమును గావించెను. తన ధన, జన, రాజ్య, సర్వస్వములను ముని చరణముల కర్పించెను. అప్పటి నుండి యాజ్ఞవల్క్యుడీ కులమునకు జ్ఞానదాతయగు గురువయ్యెను.

ఇక్ష్వాకు వంశమునకుఁ గులగురువు వశిష్ఠుడెట్లో అట్లే జనక వంశమునకు గులగురువు గౌతముడు. గౌతముని తరువాత నాతని పుత్రుడగు శతానందుడు జనక వంశమునకు ధార్మిక కృత్యములను జేయించుచుండెను. జనక వంశములోని రాజులలో నొకరికి మించి మరియొకడు జ్ఞానులును యోగులునైరి. వీరందరును నిరభిమానులు, ఆత్మ విద్యానిపుణులైయుండిరి. వీరివద్ద నెల్లప్పుడు నాధ్యాత్మిక చర్చ జరుగుచుండెడిది ఉపనిషత్తులలో నొకకథ కలదు. ఒకరాజు కడకొక మునిపోయి ధనము నడిగెను. ఆతడా నందించెను. ఆతడిట్లనెను:— "స్వామీ! మీరు నన్ను యాచించి కృపచేసితిరి. నాకును గౌరవమొసంగినారు. కాకున్న ప్రపంచములో జనకులు గొప్ప దాతలు, జనకులు గొప్ప జ్ఞానులని, సర్వత్ర ప్రసిద్ధి యెట్లురాగలదు?" ఇతరరాజులు వీరిదాన ప్రశంసనుగాంచి యీసును జెందెడువారని తెలియుచున్నవి.

ఇదిగాక జనకుడింట నుండియు నెట్లు నిస్పృహుడుగ నుండెడువాడో తెలిపెడు కథలెన్నో కలవు. ఆకథలలో గొన్నిటి నిచ్చట జెప్పెదను.

( 1 )

ఒకసారి ఒకానొక ముని జనకునితో నిట్లనెను:- "నీవు రాజ్య మొనర్చుచున్నను విదేహుడవని యెట్లు పిలువబడుచున్నావు. రాజ్య ప్రబంధమందు చాల చింతలుండును. కొందరను దండింప వలసి వచ్చును. నిగ్రహించుటలో ద్వేషభావము కలుగుచుండును. వీని యన్నిటి నుండి విముక్తిని జెందుటెట్లు?

జనక మహారాజిట్లనెను:- "స్వామీ! మీరిచ్చట గొంతకాల ముండిన నేను ప్రత్యుత్తర మొసంగెదను."

ముని అచ్చటనే యుండెను. రాజొకసారి యిట్లనెను:- "ద్విజవరా! మీరు పాలకుండను జేతబెట్టుకొని బజారంతయును దిరుగగలరా?"

ముని యిట్లనెను:- "దీనిలో జాతుర్యమేమున్నది? అందరును దిరుగగలరు"

రాజిట్లనెను:- "దానిలోని పాలొక బొట్టైనను గ్రిందబడకుండ చూడవలెను."

ముని యిట్లనెను:- "పడవు"

రాజిట్లనెను: "పడినచో

ముని దృఢతా స్వరమున నిట్లనెను: "పడినచో నీకిష్టమగు దండము నొసంగుము

రాజిట్లనెను: "మంచిది. మీరు కుండను దీసికొని పొండు. నలుగురు సైనికులు ఖడ్గములను దీసికొని మీవెంట రాగలరు. ఎచ్చట పాలచుక్క క్రిందపడునో అచ్చట నప్పుడే మీ తల తెగ గొట్టబడును."

ముని యంగీకరించెను. ఒక కుండ నిండ బాలను బోసిరి. ఇంకొక్క బిందువు పడినను బొరలిపోవునంతగ నింపబడెను. ఏమాత్రము కుదుపువచ్చినను నవి చిందిపోగలవు. దానిని చాల జాగ్రత్తగా ముని చేతికొసంగిరి. నలుగురు సైనికులు విచ్చు కత్తులతో వెంటనడచిరి. ముని తన ధ్యానమునంతను నాపాత్రపై లగ్న మొనర్చెను. శరీరమేమాత్రమును గదల కుండు పట్లడుగు వేయుచుండెను. కుండ కదలకుండునట్లే ఆతడు చూచుకొనుచుండెను. ఈ విధముగ మెల్లమెల్లగా నాతడు సమస్త రాజ్యపథమున ద్రిప్పబడెను. ఒక పాలబొట్టైనను జారిపడలేదు. ఆతడు తిరిగిరాగానే రాజిట్లడిగెను: "స్వామీ! మా నగరమందలి బజారెట్లున్నది? మీరు సర్వత్ర తిరిగి వచ్చితిరి కదా! ఈ వీధులలో నేదుకాణము సర్వశ్రేష్ఠముగను నందముగను నున్నది?"

ముని యిట్లనెను:- "రాజా! నాకేమియును దెలియదు. నేను నీ దుకాణములను జూడనే చూడలేదు."

రాజాశ్చర్యమున నిట్లనెను:- "స్వామీ! మీరేమి మాటలాడుచున్నారు. మీరు వీధినంతయును దిరిగి వచ్చుచున్నారు. మీరు కన్నులను దెరచుకొనియే యున్నారు. వీధియును తెరవబడియే యున్నది. మీరేల జూడజాలరైతిరి. ?"

ముని యిట్లనెను :— "రాజా! కేవలము పోయిన నేమి లాభము. కన్నులు తెరుచుకొని యున్నను మనస్సు దానిని గలిసికొనకున్న గన్నులు చూడజాలవు. నామనస్సా కడవలోని పాలపైననే లగ్నమైయున్నది. దానిలోని బిందువొక్కటైనను గ్రిందబడకుండ వలయుననియే నాకు ధ్యానము కలదు. నాదృష్టి అటు నిటు పోయెనా వెంటనే పాలు చితికిపోవును. అందువలన వీధిలో పోవుచున్నను నేను రసాస్వాదన మొనర్పజాలకుంటిని. ఆ సౌందర్యమును గాంచలేకుంటిని."

అంత రాజిట్లనెను :- స్వామీ! ఇదే విధముగ నేనును రాజ్యోపభోగము నొనర్చుచు విషయాసక్తిని జెందకున్నాను. వ్యవహారమునకు శరీరములోనున్నను నామనస్సు సదా పరమార్థమందే లగ్నమై యున్నది. నామనస్సు విషయములలో బడరాదను దృష్టియే నాకుండును." ఇది విని ముని ప్రసన్నుడై రాజునకు గృతజ్ఞతను బ్రకటించుచు దనకిచ్చ వచ్చిన చోటునకు బోయెను. ఇదేవిధముగ నింకొక కథకలదు.

(2)

ఒకానొక మునివచ్చి జనకు నిట్లడిగెను :- "రాజా! ఈ సాంసారిక విషయములలో గొప్ప యాకర్షణము కలదు. వీనిని స్మరించినచో మనస్సునకు వెఱ్ఱి యెత్తును. నీవద్ద ఒకరిని మించి ఒకరుగ సుందరులగు రాణులు కలరు. నీవు వారితో నేకాంతమున నుందువు. అయినను వారియందు నీవాసక్తిని జెందవేల?

రాజిట్లనెను :- "స్వామీ! మీరు భోజన మొనర్చుడు. సంభాషింతుము." ముని దీనికంగీకరించెను. నేడు రాజు తన వంట వారితో జెప్పి మంచి మంచి పదార్థములను జేయించెను. ఛప్పన్నారు పిండివంటలను జేయించెను. వానిని సువర్ణ పళ్ళెరము లలో నలంకరించిరి. మునికి సుందరమగు నాసనము వేయబడెను. ముని యాసనమున గూర్చుండెను. వడ్డించిన పళ్ళెరములు తేబడెను. ఆతడు పైన జూడగా దలపై సన్నని దారమునకొక ఖడ్గము వ్రేలాడగట్టబడెను. మునికి లోలోన గొప్ప భయము వైచెను. కాని సంకోచ వశమున నేమియును మాటలాడలేదు. త్వర త్వరగ భోజన మొనర్చు చుండెను. ఆతని ధ్యానము కత్తిమీదనేయుండెను. రాజు మాటిమాటి కిట్లను చుండెను :- "స్వామీ! ఈ వస్తువును దీసికొనుడు, ఆవస్తువును దీసికొనుడు. ముని ఆ, ఊ అనుచు నేదో విధముగ భోజనము నొనర్చి లేచెను. రాజు స్వయముగ జేయి కడిగి యిట్లడిగెను : "స్వామీ! ఫలానికూర యెట్లు చేయబడినది. క్షీరాన్నమందు తీపి తక్కువగ లేదు కదా!"

ముని యిట్లనెను :- "రాజా! నేను నిజమును జెప్పు చున్నాను. నేనేమి తింటినో నాకు దెలియదు.

రాజాశ్చర్యమును బ్రకటించుచు నిట్లనెను : "స్వామీ! షడ్రస యుక్తములగు మంచి మంచి వ్యంజనములు కలవే. మీరు మీజిహ్వాతో రుచిచూచితిరి. అయినను వానిరుచి మీకు దెలియ లేదేల?"

ముని యిట్లనెను : "నామనస్సు స్వాదువైన పదార్థము లతో గూడినప్పుడే రుచి తెలియును. నామనస్సు పైన వ్రేలాడగట్టబడిన ఖడ్గము మీదనున్నది. తినుచునే యున్నాను గాని వానిరుచి తెలియలేదు;"

రాజిట్లనెను :- "విప్రవరా ! నాస్థితియు నిట్టిదే. నామనస్సు సదా పరబ్రహ్మమునందు లగ్నమై యున్నది. పైకి ఈ సాంసారిక విషయభోగముల నుపభోగించుచున్నాను. కావున నేను వీని యెడల సర్వథా నిస్సంగుడనై యున్నాను. నాకు వీనియందాసక్తి లేదు. ఇది విని ముని ప్రసన్నుడై పోయెను. ఇట్టిదే యింకొక కథ కలదు.

(3)

ఒకానొక ఋషికలడు. ఆతడు మనస్సే బంధమోక్షములకు గారణమని శిష్యులకు జెప్పుచుండెను. మనస్సు విషయములలో మునిగియుండిన నెన్నివనములకు బోయినను బంధనమే. మనస్సు విశుద్ధమైనచో విషయముల మధ్యనున్నను నేమియును బంధనములేదు. జనకుడు రాజ్యమొనర్చుచున్నను విదేహుడే."

శిష్యుడిట్లనెను :- "గురుదేవా : ఈ విదేహ రాజు నందరును బ్రశంసించుచుందురు. ఇందులో విశేషమేమియున్నది? గొప్ప గొప్ప జ్ఞానులు కూడ విదేహుని దృష్టాంతముగ జెప్పెదరేల ?

గురువిట్లనెను :- "వారిలో నున్న విశేషత యేమనగా నాతని మనస్సు విషయములందున్నను వానిలో జొరబడదు.

నీవుపోయి యీ విషయము నాతనినే అడుగుము. నేను గూడ నీవెంట వచ్చెదను పోవుదముపద,"

అట్లని గురువు శిష్యుని వెంటబెట్టుకొని మిథిలాపురికి బోయెను. ఆ సమయమున రాజంతఃపురమున నుండెను యోగ దృష్టిచే నాతడు గురుశిష్యుల యాగమనమును దెలిసికొనెను. ఆత డేకాంతమున దన పట్టపు రాణితో శయ్యపై బరుండి యుండెను, గురువు బయటనే నిలుచుండెను. శిష్యు నంతఃపురము లోనికి బంపెను. అచ్చట సుందర స్త్రీ లటు నిటు తళుకు బెళుకులతో దిరుగుచుండిరి. శిష్యునకు మిక్కిలి సంకోచము కలిగెను. తన మనస్సు చంచలమగునేమో నని ఆతనికి భయము కలిగి, ఆతడు తల వంచుకొని రాజును గూర్చి అడిగెను. సుందరులగు స్త్రీలు మిక్కిలి యాదరముతో నిట్లనిరి : "స్వామీ ! మహారాజంతఃపుర మున నున్నాడు. మీ కడ్డు లేదు. లోనికి బొండు. శిష్యుడిది విని లోనికిబోయెను. రాజు, రాణితో శయ్యపై నుండుటను గాంచి శిష్యుని మనస్సులో జాల నేవగింపు కలిగెను. రాజు గారి చేయి ఒకటి మంచము క్రింద వ్రేలాడుచుండెను. ఒక చేయి మహారాణి వక్షస్థలముపై నుండెను. శిష్యుడు వెంటనే తిరిగి వచ్చి గురువుతో నిట్లనెను : "స్వామీ ! మీరెట్టి విషయ లంపటుని కడకు బంపితిరి? ఆతడు కేవలము విషయాసక్తుడే కాదు, లజ్జకూడ లేనివాడు. నన్ను జూచి లేవనైన లేవలేదు. అట్టివాడు నాకేమి యుపదేశింపగలడు." గురువిట్లనెను : "మంచిది, నా వెంట రమ్ము" అని పలికి గురువు శిష్యుని దీసికొని మరల నంతఃపురములోనికి బోయెను. రాజు

ప్రేలాడవైచిన చేతి కొక మండుచున్న యంగారమును నాతడు తాకించెను. రాజు ముఖమున నా యంగారము వలన నే వికార మును గలుగలేదు. రాణి వక్షఃస్థలమం దెట్లు చేయి నుంచినాడో అట్లే అగ్నియందును నాతడుంచెను. అప్పుడు గురువిట్లనెను :- "జనకునిలో గల విశేషమిదియే. ఈతనికి గామిని యొక్క కమనీ యాంగమునకును నంగారమునకు భేదము లేదు. సర్పమునకును, హారమునకును, మట్టికిని బంగారమునకును భేదమేమియును లేదు. ఈతని మనస్సు సదా పరబ్రహ్మమందు లగ్నమై యుండును. శరీరాసక్తి లేక యీత డన్ని కార్యముల నొనర్చు చున్నాడు." గురుని ఇట్టి వాక్యములను వినగానే శిష్యుని భ్రమ దూరమయ్యెను. వారిద్దరును జనక మహారాజు నభినందించిరి. జనకుడును వారికి సత్కారమును గావించెను. ఇట్టిదే యింకొక కథ కలదు.

( 4 )

ఒకానొక ముని వచ్చి యిట్లనెను : "విషయములకు సమీ పమున నుండినచో వానియందు మమత్వము కలుగును. విషయ త్యాగముచే మమత్వము వీడిపోవును. కావున నీవీ విషయములను వదలి వనవాసమేల జేయవు? రాజ్యమందలి ఈ వస్తువులందు నీకు కొలదిగనో గొప్పగనో ఆసక్తి యుండనే యుండును."

రాజిట్లనెను :- "స్వామీ! మీరు కొన్ని దినములు నాదగ్గర నుండుడు. అప్పుడు మీకంతయును దెలియగలదు." రాజు మాటను విని ముని రాజు సమీపముననే యుండెను. ముని వద్ద

సంగ్రహమేమియును లేదు. నాలుగు గోచీలు, దండ కమండలువులు, బొంత, మృగ చర్మము, ఒకటి రెండు పుస్తకములును గలవు. సమీపమున నొక భవనమున నీ వస్తువు లన్నియు నుంచబడినవి. ఆ వస్తువుల నన్నటి నచ్చటనే యుంచి ముని సభకు బోవును. అచ్చట వివిధములగు జ్ఞాన చర్చలను వినును. గొప్ప వ్యాఖ్యానముకల సూత్రముల వ్యాఖ్య చేయుచు నిరంతరము ఆధ్యాత్మిక చర్చను జరుపుచుండును. ఒక దినమున రాజు తన యోగ ప్రభావముచే భవనమునకు నిప్పంటుకొనునట్లొనర్చెను. భగభగ మని భవనమంతయును దగులబడుచుండెను. అందరు నటు నిటు కుయ్యో మొర్రో యనుచు బరువిడుచుండిరి. సర్వత్ర కోలాహలము వ్యాపించెను. ఆ మునియు నచ్చటనే కూర్చుండెను. తానే భవనమున నున్నాడో అగ్ని దాని సమీప భవనమున కంటుకొనిన ట్లాతడు తెలిసికొనెను. వెంటనే అతనికి తన దండ కమండలువులు గోచీలును, బొంతయును జ్ఞాపకమునకు వచ్చి అవి తగులబడి పోవునేమోనని భయపడి, పరుగెత్తుకొని పోయి ఆ వస్తువులను దీసి బయటకు దెచ్చెను. ఇంతలోనే అగ్ని ఆరిపోయెను.

నవ్వుచు రాజు ముని సమీపమునకు వచ్చి యిట్లనెను:- "స్వామీ ! అందరు నావశ్యక వస్తువులను సంగ్రహించుచుందురు. రాజునకు గజ, తురగ, రథ, సైనిక, ధనాదులావశ్యములు. కావున నాతడు వీనిని సంగ్రహించును. సాధులకు దండ, కమండల, కౌపీన కంథా, మృగ చర్మాదులం దాసక్తి యుండును. ఆసక్తి యిద్దరకు నొక్కటే. సంగ్రహించినను వానియం దాసక్తి

లేకున్నచో నాతడు వనమందుండినను, గృహమం దుండినను రెండును వానికి సమానమే. నేను రాజ్య మొనర్చుచున్నను, సమస్త మిథిలాపురి తగులబడి పోయినను నాకేమియును జింత కలుగదు. చూడుడు. నా యెదుట నా భవనము తగులబడుచున్నను నేను మెదలక కూర్చుంటిని కాని మీరు మీ దండ కమండల రక్షణము కొరకు వ్యగ్రులరైతిరి. పరుగిడి వాని రక్షణయందు ప్రవృత్తిని జెందితిరి. మీ సంగతి బంధ హేతువో నా సంగ్రహము బంధన హేతువో ఇప్పుడు మీరే చెప్పుడు." ఇది విని ముని లజ్జితుడై యిట్లనెను :- "రాజా! నీవే యథార్థమగు త్యాగివి." ఇట్లు పలికి రాజు నెడల సత్కారమును బ్రదర్శించుచు ముని వెడలిపోయెను. ఈ విధముగనే జనకునకును నింకొక బ్రాహ్మణునకును సంవాదము జరిగెను.

ఒకసారి అపరాధి యగు బ్రాహ్మణుని జనకుడు దండించి యిట్లనెను :- "నీవు నా రాజ్యమునం దుండుటకు యోగ్యము కాని యపరాధము నొనర్చితివి. ఇప్పుడే నా రాజ్యమును విడిచిపొమ్ము."

రాజుయొక్క వచనములను విని బ్రాహ్మణుడు రాజు నిట్లడిగెను : "రాజా! మీకు నేను వశవర్తినగు విషయమును జెప్పవలయును. మీ రాజ్యమును వదలి వేరొక రాజ్యమునకు వెళ్ళుటకు మీ రాజ్యమెంత ?"

బ్రాహ్మణుని యొక్క యీ ప్రశ్నను విని రాజు చింతలో బడిపోయెను. ఆతడు కొంచెము సేపాలోచించి యిట్లనెను: "విప్ర

వరా : నాదేమిటి యను విషయమును గూర్చి నేను చాల విచారించి తిని. ఈ రాజ్యము, ధన, జన, స్త్రీ, పరివారాది విషయములు నావియా? ఎంత విచారించినను నేను నిర్ణయింప జాలకున్నాను. చివరకు నేను నాదేమియును లేదనియు ప్రపంచములోని సమస్త విషయములును నావే యనియు నిర్ణయించుకొంటిని."

నవ్వి బ్రాహ్మణు డిట్లడిగెను : "మీవియా లేక యింకెవరి వైనవా ?"

రాజిట్లనెను:- "లేదుస్వామీ! నావెట్లో అట్లే యితరులవియు"

బ్రాహ్మణుడిట్లనెను:- "అందరదైనచో నారాజ్యము నుండి వెడలి పొమ్మని యేల పలుకుచున్నావు?"

రాజిట్లనెను:- "అవునుస్వామీ! ఇది నాపొరపాటే, మీరు స్వేచ్ఛాపూర్వకముగ మీ యిష్టము వచ్చినచోట నుండవచ్చును."

బ్రాహ్మణుడిట్లనెను:- "రాజా! ఈ రాజ్యము మీపై తృక సంపత్తి. దీనిమీద నీకు వంశపరంపరాను సారమగు నధికారము కలదు. అట్టియెడ నీవు దీనిని నాదికాదను చుంటివేల? దీనిమీద నీ మమకారము నేల వదలుకొంటివి?"

జనక మహారాజిట్లనెను:- స్వామీ! మానవుడు తాను ధని కుడనుకొననిండు నిర్ధనుడనుకొననిండు, బలి కానిండు నిర్బలుడు కానిండు. కులీనుడు కానిండు అకులీనుడు కానిండు, సురూపి

కానిందు కురూపి కానిందు, ఎట్టి యందునను నన్నియు నశ్వర ములే. అన్నియు నశ్వరములైనపుడు వీనియందు మమకారమును వహించుట మూర్ఖత కాగలదు. కావున నాకేవిషయమునందునను మమకారము లేదు. మమతావశముననే మానవుడిది నాది, అది వేరొకరిదని భావించుచుండును. మమత్వములేక సమస్తభూతము లందు నదేయాత్మ యున్నదని భావించుచు, నాత్మయందన్నియు నున్నవని భావించుచుండిన మానవుడు అహంకార మమకార మాయాజాలములో నేల పడగలడు?"

అంత బ్రాహ్మణుడిట్లనెను:- "మంచిది, అది నిజమేకాని, సమస్త విషయములును నావియే, నా వెట్లో అదేవిధముగ నితరు లవియునై యున్నవని నీవంటివి, అదెట్లు?"

రాజిట్లనెను:-"బ్రాహ్మణోత్తమా! శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములను నీయింద్రియ విషయములన్నిటి సంయోగము నా యింద్రియములతో గలుగును. కాని వీనిని నేను నా కొరకు కోరను. వీనిని నేను జయించితిని. నాచే జయింప బడిన విషయములు, ఇంద్రియములు నాకధీనములు. నేనేది చేసినను నా కొరకు చేయను, నేను ౘ్రోవుచేయుధనము దేవతల కొరకును, పితరుల కొరకును, నతిధి అభ్యాగతుల కొరకును, ప్రజల కొర కును, సమస్త ప్రాణులకొరకునై యున్నది. కావున సమస్త విషయ ములును నావియే. మీ రెచ్చట నున్నను నా రాజ్యమందున్న వారే? మీరీ స్థానముననుండుడు. ఈ స్థానమున నుండగూడదను బట్టును నేను పట్టను, మీ యిష్టమున్న చోటునకు మీరు పోవచ్చును."

ఇది విని బ్రాహ్మణుడు నవ్వి యిట్లనెను:- "రాజా: నేను నిన్నుగూర్చి యెట్టి ప్రశంసను వినియుంటి అట్లే యున్నారు. నేను వాస్తవమున బ్రాహ్మణుడనుగాను, సాక్షాత్తుగ ధర్మరాజును. నేనిప్పటికి బ్రాహ్మణ వేషమును ధరించి నిన్ను బరీక్షించుటకు వచ్చి మమతా రహితమై జ్ఞాన రూపమగు ప్రవృత్తిని గలిగినవాడవు నీవొక్కడవే" అని పలికి ధర్మరాజచ్చటనే అంతర్ధానమయ్యెను.

సూతుడిట్లనెను:- "స్వామీ! ఈ విధముగ నొక్కటి కాదు అనేక కథలు విదేహరాజ సంబంధమున బ్రచలితమై యున్నవి. రాజునకు సంబంధించినవేకావు, విదేహరాణుల విషయములోను నిట్టి కథలు కలవు. ఒకానొక విదేహరాజు సన్న్యాసి యయ్యెను, అంత నాతని రాణి ఆతనికుపదేశించి యింటికి దీసికొని వచ్చినది."

ఇది విని శౌనకుడిట్లనెను:- "సూతా! ఈ ప్రసంగమును గూడ మాకు జెప్పవలయును. ఈ కథలు వినగోరిక మాకు మిక్కిలి గానున్నది. వీనివలన మంచి జ్ఞానము కలుగుచున్నది"

సూతుడిట్లనెను:-"మంచిది స్వామీ! వినుడు. మహాప్రసంగమును గూడ సంక్షేపముగ జెప్పెదను."

ఒకపారి జనక మహారాజునకు రాజ్యముమీద మహావైరాగ్యము కలిగెను. ఆతడిల్లు వాకిలిని, రాజ్య, పరివారము నంతను ద్యజించి వనమునకు బోయెను. ఆతడిట్లనుకొనెను: "నేను రాజ్య ప్రపంచమునబడి యేమిచేయగలను. తలను గొరిగించుకొని భిక్షో

పజీవినై నా జీవితశేషమును ద్యాగమయముగ గడిపెదను" అను కొని ఆతడు వనమునకుబోయెను. అచ్చట నిస్సంగుడై యేకాంత మున గుటీరమును నిర్మించుకొని గుప్పెడు యవాన్నమును దిని కాలము గడుపుకొనుచుండెను. దీనివలన బ్రజలందరును దుఃఖితు లైరి. రాజుతో జెప్పుకొనుట కెవరికిని సాహసము కలుగలేదు దీనిని గాంచి పరమ బుద్ధిమతియగు రాజమహిషి రాజుకడకుబోయి నిర్భ యయై యిట్లనెను: రాజా! ఇదేమి, మీరిట్టియాట నాడుచున్నారు?"

రాజిట్లనెను: "త్యాగములేక విషయాసక్తివీడదు. విషయా సక్తివీడనిది జ్ఞానము కలుగదు. జ్ఞానము లేనిది ముక్తిలేదు. కావున నేనన్నిటిని ద్యజించితిని."

రాణియిట్లడిగెను: "మీరేవస్తువును ద్యజించితిరి ?"

రాజిట్లనెను : "నేను సంగమును ద్యజించితిని. రాజ్య, ధనైశ్వర్యములను ద్యజించితిని."

రాణియిట్లనెను: "రాజ్యములోని సమస్త వస్తువులును బంచ భూతాత్మకములు. ఇప్పుడు మీరు పృథివిపై నుండరా? రాజభవన మునకును బూరిగుడిసెకును భేదమేమున్నది? మీరు జలమును ద్యజించితిరా? మీరిచ్చట శ్వాసించుట లేదా? వాయువును బూరిం చుట లేదా? మీరు ప్రకాశమును వదలితిరా? మీరిచ్చట నాకాశము క్రింద నుండుట లేదా? పంచభూతములచ్చట నెట్లున్నవో, ఇచ్చ టను నట్టియే; వీనిలో మీరు దేనిని ద్యజించితిరి? అచ్చట మీదగ్గర

మంత్రి పురోహిత, సైనిక సేవకాదులున్నారు; ఇచ్చట బశు, పక్షి, కీట పతంగములున్నవి. దీనివలన సంగమును బరిత్యజింప లేదే."

రాజిట్లనెను: "నేను బరిగ్రహమును ద్యజించితిని"

రాణి యిట్లనెను: "పరిగ్రహమేమి త్యజించితిరి ? మధ్యాహ్నకాలమున నాకలైనప్పుడొక్క పిడికెడు యవాన్నము కొరకు నీవు నగరమునకు బరువిడవలెను. దానిని గూర్చిన చింత యుండును. ఇదివరలో మీరు దాతలైతిరి. ఇప్పుడు యాచకులైతిరి. ఇదివరలో మీరు రాజ్యపాలన మొనర్చెడు వారు. దానిని గనిపెట్టి యుండెడు వారు. ఇప్పుడు మీరు దండ కమండల, కంథా కౌపీన ములను గనిపెట్టుచున్నారు. మీకావశ్యకములగు నీవస్తువుల నెవ రైన నశింప జేసినచో వానికొరకై దుఃఖము కలుగగలదు. రాజ్య త్యాగమున నేమైనది ? మమత్వమే బంధనమునకు గారణము. మీరు మమత్వమును వదలినచో మీరెచ్చటనున్నను ద్యాగులే. మమత్వ మును ద్యజింపక పైకి కాషాయవస్త్రముచు దండ కమండలములను ధరించినచో నిది మోసము, దంభము, కపటము. తన్నుదాను వంచించుకొనుటయే కాగలదు. రాజా ! మీరు సోమరులవలె నకర్మ ణ్యులు కాగూడదు. అకర్మణ్యముగనున్న యేనుగునైనను జీమలు తినగలవు. మూర్ఖులే కర్మలను వీడి మోసపు వేషములను వైచు కొని సన్న్యాసు లయ్యెదరు. సోమరితనముతో దమకాలమును వెడలదీసికొను చుందురు. మీరిదివరలో వేలమందికి పెట్టి తినునట్లే తినుడు. ప్రజాపాలన కార్యమును గర్తవ్య బుద్ధితో నొనర్పుడు.

దేవతలను బితరులను, అతిథులను సంతుష్టులు నొనర్పుడు. ఫలేచ్ఛ లేక నిష్కామ భావముతో గర్మల నొనర్పుడు.

సూతుడిట్లనెను : "మునులారా! తన రాజమహిషి పలికిన యీ వాక్కులను వినగానే రాజుయొక్క మోహము విడిపోయెను. అతడు సన్న్యాసియగు నాలోచనమును విడిచి, యింటికి వచ్చి నిష్కామ భావముతో సమస్త రాజ్యకార్యము లొనర్చుచుండెను జనకవంశములోని రాజులందరెట్లు జ్ఞానులో అట్లే వారి రాణులును నధ్యాత్మ విద్యయందు నిష్ణాతులై యుండిరి. జనక మహారాజు మునులకును మాననీయుడే. ఇంతయేల సమస్త మునులకును గురుడగు శుకమహర్షియును నాతని శిష్యత్వము నంగీకరించెను. మునులారా! ఈవిధముగ జనకుడు మాగురువునకు గురువు అనగా బరమ గురువు."

అంత శౌనకుడిట్లడిగెనెను :- "సూతా! శుకదేవునకు జనకు డెట్లు గురువైనాడు. జనకుడాతని కెట్లుపదేశించినాడు. కృపతో నీయాఖ్యానమును మాకు జెప్పవలయును."

సూతుడిట్లనెను : "మునులారా! మాగురుదేవుడు రాజర్షి యగు జనకుని కడకెట్లు శిక్షణను బొందబోయెనో జనకుడాతని కెట్టి యుపదేశము నొసంగెనో, యీప్రసంగమును సంక్షేపముగ మీకు జెప్పెదను. మీరు దత్తచిత్తులరై శ్రవణ మొనర్పుడు."

సూతుడు మునులకు జనక శుక సంవాదము నిట్లు చెప్పెను: "మునులారా! మా గురుదేవుడగు శుకమహర్షి జన్మచేతనే విరక్తుడు.

సర్వశాస్త్రార్థజ్ఞాత. ఆతనికి గృహస్థాశ్రమాది ప్రవృత్తి మార్గ కార్యము లిష్టము లేదు. ఆతడు దేవగురుడగు బృహస్పతికంటెను నెక్కుడుగ శాస్త్రాధ్యయన మొనర్చెను. ఆతడు సమస్త శాస్త్ర పారంగతుడు కాగానే, ఒకానొక దినమున నాతడు తన తండ్రి యగు వ్యాసునిట్లడిగెను:- స్వామీ! మీరు మోక్షధర్మము నెరిగిన వారు. దయతో నాకు మోక్షధర్మముపదేశింపుడు."

వ్యాసుడిది వినగానే పరమ ప్రసన్నుడయ్యెను. మరల నాతడిట్లనుకొనెను: నాపుత్రుడు నావద్ద చదువడు, వానిని జదువుట కింకొక అధ్యాపకుని వద్దకు బంపవలసి యున్నది. నేను వీనికి జెప్పిన శ్రద్ధయుండదు. శ్రద్ధలేకున్న ఫలముండదు. కావున వీనిని పరమజ్ఞానియగు విదేహ జనకునికడకు బంపవలయును" అని యాలోచించి యిట్లనెను: "వత్సా! ఈ ప్రశ్నకు నేను బ్రత్యుత్తర మొసంగజాలను. నీవు విదేహ జనకునికడకు బొమ్ము. ఆతడు నీ సంశయము లన్నిటిని దీర్చగలడు."

శ్రీ శుకదేవుడిట్లనెను: తండ్రీ! మీరేల నాకేల నుపదేశింపరు?

వ్యాసుడిట్లనెను: వత్సా! ఆతడే యీ విద్యలో బారంగతుడు. గొప్పగొప్ప ఋషులును, మునులును నాతని సమీపమున కీవిద్యను దెలిసికొనుటకు వెడలుచుందురు. నీవు శీఘ్రముగ నాతని కడకు పొమ్ము."

శ్రీ శుకుడిట్లనెను : తండ్రీ ! నేను యోగము ద్వారా ఆకాశ మార్గమున క్షణకాలములో మిథిలకు జేరగలను."

వ్యాసుడిట్లనెను : "వలదు నాయనా ! జ్ఞానమును నేర్చుకొనుటకు నిరభిమానియై పోవలయును. మోక్ష ధర్మ జిజ్ఞాసువు సాధారణ భావముతో గురునికడకు పోవలయును. నీవు నడచియే మహారాజు కడకు పొమ్ము. అచ్చటికిబోయి నీవు నీ యిష్టమిత్రులను వెదుకుకొనరాదు. మహారాజేమి చెప్పిన దానిని జేయవలెను. ఆతని యెడల నశ్రద్ధను బ్రకటింపకుము. ఆతనివలన గౌరవము నపేక్షింపకుము."

తండ్రి యాజ్ఞను శిరసావహించి సమ్యాప్రాసము నుండి శ్రీశుకదేవుడు మిథిలాపురికిబోయెను. ఆతడు బదరీనాథము నుండి విష్ణుప్రయాగ, నందప్రయాగ, దేవప్రయాగ ఋషీకేశము నుండి పోలేదు. కలాప గ్రామము నుండి సరస్వతీ నదీతీరమున బైకి యెక్కెను. కాకభు నుండి పర్వతశిఖర సమీపమునకు గ్రింద నున్న హూణదేశము (తిబెత్తునకు) వచ్చెను. మేరు పర్వతము మీదుగా నాతడు మానసరోవరము, కైలాసము మీదుగా ఆల్మోడా మార్గమున గ్రిందకు దిగి అంత సరయూతీరమున గంగాతీరమునకు వచ్చెను. అచ్చటి నుండి మిథిలాపురికి జేరుకొనెను. మార్గమందాతనికి హూణియా. చీనాజాతివారి నగరములు తగిలెను. అందరును దిగంబరుడగు శుకుని సత్కరించిరి. విదేహ రాజ్యమును గాంచి శుకుడు పరమ ప్రముదితుడయ్యెను. ఆ దేశము ధనధాన్య

ములతో నిండియుండెను. ఆచ్చటి భూమి సస్యశ్యామలమై పచ్చ పచ్చగ నుండెను. సమృద్ధిశాలియగు నాదేశమును గాంచగానే ఆతని హర్షమునకు మేరలేకుండెను. మిథిలాపురియందొక దానికి మించి మరియొకటిగ నద్భుత వస్తువులుండెను. నగరము నానా విధముల నలంకరింపబడెను. కాని శుకదేవుడా వస్తువు లన్నిటి వైపున జూడనేలేదు. ఆతడీ వస్తువులను గాంచకయే మిథిలాపురీ నగర ద్వారము కడకు జేరుకొనెను. ఆతడు నగరద్వారమున బ్రవేశింపబోగా ద్వారపాలకులాతని లోనికి బోనీయలేదు. ఇది శుక దేవునకు గొప్ప యవమానము; కాని ఆతడు నిజమగు జిజ్ఞానువు, నేడెవడైన సాధువు దర్శనమునకుబోయిన, నచ్చట సాధువు భజన పూజనమందున్నచో గొంచెము సేపు కూర్చుండవలసి వచ్చినచో మిక్కిలి క్రుద్ధుడగును. నానాతిట్లు తిట్టి క్రుద్ధుడై తిరిగిపోవును. శుకదేవుడట్లు చేయలేదు. ఆతడు శాంతభావముతో ద్వారమున నిలు చుండెను. రాజాజ్ఞ కాగానే ద్వారపాలురాతని లోనికి గొనిపోయిరి. నగరమున బ్రవేశించి శుకదేవుడు రాజమహలునకు బయలుదేరెను. మహలు ద్వారముయొక్క మొదటి కక్షనాతడు ప్రవేశింపగనే ద్వారపాలురు కసరి ఆతనితో నిట్లనిరి :- ''అడుగకయే దిగంబరివి నీవెచ్చటికి లోపలకు బోవుచున్నావు."

శుకదేవు డిట్లనెను : నేను జనక మహారాజును దర్శింప వలయును. అతని సమీపమునకు బోవుచున్నాను "

ద్వారపాలురు శుష్కహాసమొనర్చి యిట్లనిరి: రాజును దర్శింప వలసిన దిట్లేనా? ఇప్పుడు లోపలకు బోవు సమయము కాదు."

ఇది విని శుకదేవుడు కొంచెముగ గుర్విద్ధుడయ్యెను. ఆతడు మెదలక నిలుచుండెను. ఆతడెండలో గూర్చుండి యాత్మచింతన మొనర్చుచుండెను. ఇంతలోనే మంత్రివచ్చెను. ఆతడాతని సత్కార పూర్వకముగ రెండవ ద్వారముకడకు గొనిపోయెను. ఈ సత్కారమున శుకదేవున కేమియును హర్షము కలుగలేదు. ఆతడు మెదలక మంత్రివెనుకనే పోయెను.

రెండవ కక్షలో నత్యంత సుందరమగు నొక యతిథిశాల కలదు. దానిలో రాజ్యమందలి మిక్కిలి ప్రతిష్ఠకలిగిన వ్యక్తులే బసచేయుచుందురు. ఆభవనములు బాగుగా నలంకరింపబడినవి. అచ్చటచ్చట సుందర స్వచ్ఛశీతల సలిలములుగల సరోవరములుండెను. వానిలో నానావిధములగు కమలములు వికసించి యుండెను. అచ్చటిభూమి చాల అందముగ నుండెను. అచ్చట నత్యంత సుందరులగు యువతులేబదిమంది బాగుగా నలంకరించుకొని యుండిరి. శుకదేవుని జూడగనే వారందరును లేచి నిలుచుండిరి వారు వ్యాసనందునకు స్వాగత సత్కారములను గావించిరి. పాద్యార్ఘ్యాసనముల నొసంగి యాతనిబూజించిరి. గంధ సలిలములచే నాతనికి స్నానము కావించిరి. ఆతడు చాల దూరమునుండి వచ్చుచుండెను ఆతని శ్రమను వివిధోపాయములచే బోగొట్టిరి.

మంచిరసయుక్తములగు సుందర పదార్థములను భోజనముకొరకా తని ముందుంచిరి. మిక్కిల ప్రేమతో బలవంత మొనర్చుచు నాత నికి భోజనము పెట్టిరి. భోజనమొనర్చి శ్రీశుకుడు విశ్రామమును జెందెను. ఆయువతులు గానవాద్యములందును, నృత్యగీతాదులం దును మిక్కిలి ప్రవీణలు. వారు శృంగార రసముతో వివిధము గానముచేయసాగిరి. హావ భావ కటాక్షములను బ్రదర్శించుచు నృత్యము చేయసాగిరి; కాని శుకదేవుని మనస్సున నేవిధమగు వికారము నుత్పన్నము కాలేదు. ఆతడు శాంత భావముతో స్థిర ముగ గూర్చుండి బ్రహ్మ చింతన మొనర్చుచుండెను. అర్థ రాత్రి వర కాతడు ధ్యానమగ్నుడై యుండెను. అంత నాతడు శాస్త్రీయ విధిగ శయనించెను. ఈ విధముగ నొక పగలును, నొక రాత్రి యును శ్రీశుకుడా విలాస వైభవపూర్ణమగు స్థానమందు నిర్వికార భావమున నుండెను.

మరునాడు మిథిలేశుడు తన మంత్రి పురోహితుల తోడను, రాణులతోడను శుకదేవుని సమీపమునకు వచ్చెను. ఆతడు వచ్చి శాస్త్రీయ విధిచే మునిని బూజించెను. సుందరమగు సర్వతో భద్రా సనమున నాతని గూర్చుండబెట్టి గోదానము నొనర్చి కుశలమడి గెను. పూజ పూర్తియైన తరువాతముని యాజ్ఞ నీయగానే రాజు చేతులను జోడించుకొని కూర్చుండెను. అప్పుడు రాజిట్లడిగెను: "స్వామీ! మీ రాక యేదైన విశేష కారణమున నైనచో దానిని నాకు జెప్పుడు."

రాజడిగిన ప్రశ్నను విని ముని యిట్లనెను: "రాజా! నా తండ్రి నన్ను మీ సమీపమునకు ప్రవృత్తి నివృత్తి విషయక సందేహము లన్నిటిని బోగొట్టుకొనుటకై పంపినాడు. ఆతడు నాతో నిట్లనెను: "జనకుడు నా యజమాని. ఆతడు మోక్ష ధర్మము నెరిగినవాడు. సర్వశ్రేష్ఠుడగు జ్ఞాని. ఆతనిని నాకు బదులుగా గురువుగా వలయును. నీ సంశయములను నాతని ముందు చెప్పవలయును. ఆతడు నీ సంశయముల నన్నిటిని ఛేదింపగలడు."

రాజు వినయముతో నిట్లనెను: "స్వామీ! నేను నేర్చు కొనిన దేదియో దానిని మీ పితృదేవులగు వ్యాస భగవానుని వలననే నేర్చుకొంటిని. ఆతడేదో విశేష ప్రయోజనమున మిమ్ము లను నాకడకు పంపియుండును. సరియే. మీరడుగ దలచిన దేదియో యడుగుడు."

శ్రీ శుకుడిట్లడిగెను: "రాజా! ఈ లోకమందు జ్ఞానము నిచ్చించు ముముక్షువుల కర్తవ్యమేమి? మోక్ష స్వరూప మెట్టిది? మోక్ష ప్రాప్తికి సాధనము తపమా? జ్ఞానమా? ఇది నాకు చెప్ప వలయును."

ఇది విని గంభీరముగ రాజిట్లనెను: "స్వామి! మీ ప్రశ్నలు మిక్కిలి గూఢములైనవి. అయినను నేను యథామతిగ వానికి ప్రత్యుత్తర మొసగెదను. స్వామీ! మోక్షేచ్ఛ కలవారు జన్మిం

చినది మొదలు మరణించు వరకు పారమార్థిక కర్మ లొనరింప వలెను. ఒక యాశ్రమము నుండి మరియొక యాశ్రమమునకు బోవలయును. బ్రహ్మచర్యము నుండి గార్హస్థ్యమునకును, గార్హస్థ్యము నుండి వానప్రస్థమునకును, వానప్రస్థము నుండి సన్న్యాసాశ్రమమునకును బోవలెను."

శ్రీ శుకదేవు డిట్లనెను; "రాజా! ఎవనికైనను జన్మతః జ్ఞానము కలిగినచో నాతడును బ్రహ్మచర్యము నుండి గృహస్థాశ్రమము లోనికిని, గార్హస్థ్యము నుండి వానప్రస్థమునకును, తరువాత సన్న్యాసమునకు బోవలయునా?"

జనకు డిట్లనెను: స్వామి! మోక్ష ప్రాప్తి జ్ఞాన విజ్ఞానములు లేక కలుగదు. గురు సంబంధము లేక జ్ఞానప్రాప్తి కలుగదు. గురువే యీ సంసార సాగరమునుండి దాటింపగలడు. జ్ఞానమే సుదృఢమగు నౌక. గురువే కర్ణధారుడు చేయు పని చేయును. పరంపర అక్షుణ్ణముగ నుండుటకై జ్ఞానియును నాలుగాశ్రమములను బాలించును. ఎవనికి మనస్సు శుద్ధమయినదో, యెవడు జీవన్ముక్తానందము ననుభవించునో వానికి మూడాశ్రమము లవసరము లేదు. అట్టివాడు పరమ హంస రూపమున స్వేచ్ఛానుసారముగ విచరింపవచ్చును; ఏలననగా వానిమనస్సులో నేవిధమగు కోరికయు నుండదు. ప్రవృత్తి మార్గము కోరికలను బోగొట్టుటకై విషయ విరక్తి కలుగుట కొరకే. ఇది క్రమ మార్గము. జ్ఞానికి క్రమమేమియును లేదు. మీరు పరమ జ్ఞానులు.

